


౧౬. సంపుటం. ప్రమాది, భాద్రపదమాసము (1939) సెప్టెంబరు సంఖ్య. ౯

# విహగ గానము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౧

మంజులమగు నాదు మనః
కుంజంబునఁ గట్టుకొన్న గూటికి సరిగా
సంజకడ నొక్కపిట్ట వె
సం జనుదెంచుచును బాడు సంగీతంబున్.

౨

ఆసక్తప్రళయప్రమేయ మిహాలోకైకప్రవాసంబునం
దీ సంగీతము విస్ఫురద్విరహావహ్నిస్థాపితాకాశదీ
పాసాధారణకారణంబయి స్వమూలాధారపున్ మూర్ధ్వకుఁ
గ్రానంబై వినిపించుచుండు నుడుచక్రంబెల్ల నాలింపగన్.

౩

ఆకాశంబును భూమి తాండవము సేయంజొచ్చు నారాశిపై
రాకాచంద్రుఁడు డోలికోత్సవసమారంభంబుఁ గావించు గో
లోకం బ్రరులు సాఁచు శేషుపడగల్ లోలంబు లైపోవు సు
శ్లోకంబైన విహంగగాన మెలమిన్ శ్రోత్రంబులం బర్వఁగన్.

౪

కోయిల కూయుఁగాని యిటు కూయఁగఁజాలదు, దాక్షిణాత్య మా
వాయువు వచ్చుఁగాని యిటువంటివిధంబుగ రాదు, వెన్నెలల్
కాయును గాని యీగతిఁ గాయవు; వీనులవింటకుం దృగు
న్నేయము సేఁతకుం గనులఁ గ్రోలఁగ నంద ది దే విహంగమా!

౫

అహారంతములందు మహో
విహగము తాఁ గొనరి కూసి వెళ్లిసయుంతన్
బహుపల్లీశైలగుహా
గహనంబులు మ్రోఁగిపోవుఁ గా కా యనుచున్.



# కథానిక: దాని పరిణామము*

శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి

౧

కథ లంటే చిన్నవాళ్లు చెవి కోసుకుంటారు. పెద్దవాళ్లకు కూడా ప్రీతి. అనగనగా ఒకరాజు అనో, పేదరాసి పెద్దమ్మ అనో, ఈగ అనో ప్రారంభించి, కడకు కథ కంచికి వెళ్లింది అని మనము బాల్యములో బహు పర్యాయములు ఆనందముతో ఆలకించాము. పూర్వము కాంచీనగరము కళ లన్నింటికీ ఆటపట్టు అవడముచేత, అక్కడ అంగీకారముద్ర పడితే కథ గట్టు ఎక్కిందన్నమాట. వినోదార్థముగాని, విజ్ఞానాభివృద్ధికిగాని, పరిహాస పరిణతికిగాని, భావనాశక్తిప్రకోపనకు గాని, ప్రపంచవృత్తము ప్రకటించడానికిగాని, పరమార్థచింతకుగాని కథావర్ణన కర్తవ్యమే. కథలో గంభీరవిషయము ఎటువంటి దయినా కరతలామలకము కావచ్చు. ప్రాచీనపద్ధతిలో కథాజాలము కావలసినంత ఉన్నది. అది నోటిమీదుగా విశేషము చలామణీ అయ్యేది. విద్వాంసులకు వినడానికి అభ్యంతరము అట్టే లేదుగాని, కాకితము మీదికి వచ్చేసరికి కథను ఖాతరుచేసేవారు కారు. ఏదయినా వృద్ధిలోకి రావలెనంటే ఆదరము అవసరము. పద్యరూపములో ఉన్నకథలకు ప్రాభవము ఉన్నది. గద్యములో ఉన్న వాటికి గౌరవము తక్కువ. గౌరవము లేకపోయినా ఉత్సాహ
వంతులు ఊరుకోలేక గద్యలోనే కథల
అల్లినారు. అయితే కావ్యభాషలాంటి వచ
ములోనే రచన సాగింది.

అన్యసాహిత్యముతో సన్నికర్షగా
సంఘర్షణగాని సంఘటిల్లితేనే గాని దేశీయ
సాహిత్యాలకు తెలివి హెచ్చదు. ఆంగ్లస
హిత్యంవల్ల ఆంధ్రసాహిత్యానికి అఖం
మైన మెళుకువ వచ్చింది. గత శతాబ్దిలో
కథారచనకు యత్నాలు యత్కించిత్ జ
గినవి. ఈ శతాబ్దిలో హెచ్చిపోయినవి.

కథకు కావ్యభాషవల్ల జీవకళ చెడి
పోతుంది. వాడుకభాష వాడితేనే వర్చస్సు
భావుకులు భాషాచర్చ చేసి వ్యావహారి
భాషనే వన్నెతేవలెనని ప్రయత్నము చేస
టప్పటికి ప్రళయము పుట్టింది! గ్రాంథి
వాదులు కత్తులు నూరినారు. ఇప్పటికీ
ఆందోళన అణిగిపోలేదు.

హిందీభాషలో ఆధునికకథ పుట్టి
రోజులలోనే ఆంధ్రములోకూడా కథ అవ
రించింది. గురజాడ అప్పారావుపంతులుగార
వాడుకభాషలో చెప్పిన "దిద్దుబాటు" అ
కథవల్ల తెలుగులో వెలుగు బయలుదేరిం

* ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ వారి అనుమతిని.

అనుకున్నాము. ౧౯౧౨ సంవత్సర ప్రాంతాలలో "ఆంధ్రభారతి", ౧౯౧౮లో "త్రిలింగ" మాసపత్రిక, "సువర్ణలేఖ" కథలు ప్రకటించినవి. 'మదరాసు కథలు' అనే కథాసంపుటి కూడా ఆరోజులలోనే అచ్చుపడ్డది. ౧౯౧౯లో నేను "ఆఖ్యాయిక" అనే సచిత్రమాసపత్రిక తెనాలినుంచి ప్రకటించడానికి ప్రయత్నించాను. నామిత్రులు కొంతమంది కథారచనకు కంకణము కట్టినారు. అనేక ఆంగ్లేయ అమెరికా మాసపత్రికలు నేను నిరంతరము చూస్తూ ఉండడముచేత అపూర్వమూ, అందమూ చేతామనుకున్నాను "ఆఖ్యాయిక"ను. శివానుగ్రహము లేకపోవడముచేత ప్రయత్నము కొనసాగలేదు.

'మురారి' కథలు అనేశీర్షికతో కథాపరంపర సంకల్పించి, ఒకటో రెండో రచించాను. అప్పటికి నేను కృతకగ్రాంథికభాషావాదినే. చింతా భీమశంకరంగారు Sherlock Holmes రీతిగా పాత్ర సృష్టించి, విశ్వనాథం అనే పేరుపెట్టి Connan Doyle కథలు కొంతవరకు అనువదించినారు. కొంతమంది కథకులు కథాక్షేత్రములోకి దిగినారు. కాని, సాహితీసమితివారు గట్టిపట్టు పట్టేవరకూ కథకు కమనీయత కలగలేదు.

సమితికథకులు భాషాచర్చలు పరిపూర్ణంగా చేసి చివరకు శిష్టభాషలో రచనలు రమ్యంగా ఉంటవని అంగీకరించారు. ఇంచుమించుగా వారంతా వ్యావహారికభాషవాడడము మొదలుపెట్టారు. ౧౯౨౦ సంవత్సరము స్మరణీయము. సాహితీపత్రిక ఆరంభించింది ఆసంవత్సరమే. అప్పటినుంచీ కథ కట్టుదిట్టాలకులోబడి, గౌరవము సంపాదించుకో సాగింది.

౨

ఇంగ్లీషులో Sketch, Tale, Narrative, Story అనే సాహిత్యవిభాగాలను అన్నింటిని మనవారు చేషు స్థూలదృష్ట్యా కథ అని వ్యవహరిస్తున్నారు. అగ్నిపురాణములో ఆఖ్యానము, ఆఖ్యాయిక, ఖండకథ, పరికథ, కథానిక అనే పరిభాష ప్రస్ఫుటముగా ఉన్నది. వస్తువునుబట్టి మానుషకథ, దివ్యకథ, దివ్యమానుషకథ, అనే విభాగము కూడా విస్పష్టమే. ప్రకృతప్రసంగవిషయము Short Story. దీన్ని కథానిక అందాము.

కొన్నికథానికలను గురించీ, కొంతమంది కథకులను గురించీ కొద్దిగా ప్రసంగిస్తాను. స్థాలీపులాకన్యాయమే శరణము.

చింతా దీక్షితులుగారు సిద్ధహస్తుడు. సూరీ, సీతి, వెంకీ, పటీరావు, భైరవశాస్త్రి వంటి మరవడానికి వీల్లేని మంచిపాత్రలు సృష్టించినారు శ్యామల, చిన్న, చెంచురాణి ముద్దు, శంపాలత, శరబాల, లీలాసుందరి, గోపీమోహిని, కిష్కింధలో కోతి మొదలైనవి వీరి ఉత్తమకథానికలు. బాహ్యప్రకృతిని బాల్యచేష్టలనూ, ప్రణయంలో బాధలనూ, భక్తిని, విరక్తిని వీరు బాగా వర్ణిస్తారు. రచనలో నర్మరేఖ హేళన నసుమ నడుమ కనపడుతూ ఉంటవి. దీక్షితులుగారి శైలి తీర్చిదిద్దినట్టు ఉంటుంది.

నోరి నరసింహశాస్త్రిగారి నిపుణత భార్యాభర్తల సరాగాలను, ప్రణయమును,

ప్రణయకలహాలను వర్ణించడంలో వన్నె తేరింది. గానభాగము, గులాబీపూవు, శ్యామసుందరుడు, భవిష్యత్తువంటి కథానికలు కళా వైభవముతో కూడినవి. సందర్భానుసారంగా సంస్కృతాంధ్ర వృత్తాలను జతచేయడం వల్ల స్వారస్యం హెచ్చుతుంది. రీతిలో ఓజస్సు ఒప్పి బుద్ధిబలం పూర్తిగా కనబడుతుంది.

కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగారి 'సుకుమారి' లో స్వసుఖము చూచుకునే భార్య భర్తను బహువిధాల వేధించి చివరకు బయటపడి పోతుంది. 'ప్రతిఫలము'లో యువతిని కోరిన ఉద్యోగి ఉసురులు కోల్పోతాడు ఉవిదతోకూడా. అందులో భయానకం ప్రజ్వలిస్తుంది. "ఏప్రియల్ ఫూల్" కథలో విద్యార్థిని పట్టుకోబోయిన ప్రధానాచార్యుడే ఫూలయిపోతాడు. సుబ్బయ్యగారి వాక్కు శుచి అయినది.

మునిమాణిక్యం నరసింహారావుగారి వాణి నాజూకుగా ఉంటుంది. వీరు రకరకాల కథలు వ్రాసి కడకు 'కాంతం' అనేపాత్రను సృష్టించారు. గృహకృత్యాలు, భార్యాభర్తల కీచులాటలు, కపట భక్తుల నటనలు అమాయకుల ఆమోదాలు హాస్యపూర్వకంగా వర్ణిస్తారు. వీరి "కాంతంకథలు", "నేనూ మా కాంతం", "కాంతం-కైఫియ్యత్" అనే కథానికాసముచ్చయాలు కమ్మగా వుంటవి.

వివాహకథానికలు రచించడంలో వడ్డి బాబూరావుగారికలం కదం త్రొక్కుతుంది. "అరిసెముక్కలు", 'దాంపత్యము,' 'రుక్మిణీ కల్యాణము' మొదలైనవి ముద్దుముద్దుగా ఉంటవి. ఈయన చిత్రకారుడు కావటంచేత

శ్రీనివాసశిరోమణిగారు సిద్ధవాక్కు. వీరి "దారద్వయం" అనే కథానిక వెలువడ్డ తరువాత పెళ్లిళ్లమీద పెళ్లిళ్లుఅయినవి. "ధర్మసంస్థాపనము" అచ్చయిన సంవత్సరానికి కలకత్తాలో ఖడ్గబహదూర్ సింగ్ కలకత్తాలో అగర్ వాలాను హత్యచేశాడు! వీరి 'పాహిమాం', 'భార్యా రూపవతీ శత్రుః', 'ఏకాకీ' అనేవి వుత్తమశ్రేణిలోవి. గోష్ఠిలో ఈకథ రచనలో నడుమనడుమ నగిషీకనబడుతుంది. కుడు కుశలి. చాటువాక్యాలతో సభారంజనము చేసేశక్తి కలవాడు కాబట్టే కథనంలోకూడా కనబడుతుంది ఆగుణం.

మొక్కపాటినరసింహశాస్త్రిగారి రచన ముద్దుగా ఉంటుంది. పరదేశనివాసంచేసిన ప్రౌఢుడు కాబట్టి ప్రపంచవృత్తం బాగా వుంటుంది వీరి కథానికల్లో. 'చిత్తరువు', 'శిల్పిద్వయం' 'లక్ష్మి' మొదలైనవి ఉదాత్తమైనవి. ఈయన కథనంలో గట్టివాడు, చింతాశీలములో చేవతేరినవాడు, హాస్యరేఖలో అందెవేసిన చెయ్యి.

అడివి బాపిరాజుగారు అనేక ప్రజ్ఞలు కలవాడు. చిత్రకారుడు కావటంచేత చెప్పినదాంట్లో వైచిత్ర్యం ఉంటుంది. పదకర్తకావటంవల్ల పలుకులో తీపి స్ఫురిస్తుంది. దివ్యమానుష కథా రచనలో ఈయన దిట్ట. 'శైలబాల', 'సంధ్యానృత్యము', 'వీణ', 'భోగీరలోయ', 'హిమాలయరశ్మి' 'పాంచర'—ఒకటేమిటి, అన్ని కథానికలూ అందాలు చిందుతూఉంటవి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పల్లెలలో బ్రాహ్మణకుటుంబాలనూ, వితంతు

వుల వివిధవ్యథలను విశేషరీతుల వివరించారు. వీరికి సంస్కారదృష్టి జాస్తి. ఆంధ్రాభిమానము అఖండం. శాస్త్రిగారి సంభావణ రచన చాలా మనోహరం.

విద్వాంసులు కథకులు కాలేదన్న లోటు వేలూరి శివరామశాస్త్రిగారివల్ల తీరింది. వివిధశాస్త్ర విజ్ఞానము, విశేషప్రౌఢి, విచిత్ర సన్ని వేశాలు వీరికథనములలో కనిపిస్తవి. ప్రతి కథానికా భావపూర్ణమై పాత్రపోషణతో భాసిస్తూ ఉంటుంది.

కవికొండల వెంకట్రావుగారు గ్రామీణుల జీవితమూ, కర్మకారుల కష్టసుఖాలు, సామాన్య కుటుంబాలలో సంఘటనలు చక్కగా వర్ణిస్తారు. పదేండ్లలో వందకథలు వ్రాసినారట! పూడిపెద్ది వెంకటరమణయ్యగారు రెండు వందల కథలు రచించారట!! కాఫీ పుచ్చుకుని కలం పట్టుకుంటే భోజనవేళకు పూర్తి అయ్యేదిట కథానిక.

గుడిపాటి వెంకటాచలంగారికలం కాకలు తీరినది. బాహ్యప్రకృతిని, పాపాత్ముల భావక్లిష్టతను, అసతుల అంతరంగ సంక్షోభమును, పరకీయాప్రణయమును వీరు బాగా వివరిస్తారు.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు రసికుడు, సంస్కృతిప్రియుడు, వ్యుత్పన్నుడు కావడంవల్ల శైలిలో చమత్కారం ఉన్నది. రచనావిధానము రమణీయమై అనన్యసామాన్యంగా అగుపిస్తుంది. కథానికలలో కమనీయమైన కల్పితలోకము, కామినీగోష్ఠి, కామకలాప్రావీణ్యము గాటముగా ఉంటవి. 'తాతగారు' అనే ప్రగల్భపాత్రను వీరు సృష్టించారు.

వీరి పద్ధతినే వెళ్లుతారు కొంతవరకు వెంపటి నాగభూషణంగారు 'చిన్ని' అనే పాత్రను సృజించారు. లోకమంతా అతిలోకంగా కనబడుతుంది ఆయనరచనలో.

పురుషులలో శ్రీరాయసం వెంకటశివుడు, భావరాజు కృష్ణరావు, బుర్రా సుబ్రహ్మణ్యము, కొడవటిగంటి కుటుంబరావు, టేకుమళ్ల కామేశ్వరరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, విశ్వనాధ సత్యనారాయణ, మొదలి సుబ్రహ్మణ్యశర్మ, కాఖూరి రామారావు, 'కరుణకుమార' గిరి, ప్రతాపరెడ్డి, జానకిరాం, బొడ్డు బాపిరాజు, అత్తిలి సూర్యనారాయణమూర్తి, తాతా కృష్ణమూర్తి, తీర్థులు, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, కుమార రాఘవశాస్త్రి ప్రభృతులూ, స్త్రీలలో శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ; క్రమధాటి జానకీదేవి, యల్లాప్రగడ సీతాకుమారి, పులవర్తి కమలావతీదేవి ప్రభృతులూ పేరుపడ్డారు.

ఇక్కడ నేను ఉద్ఘాటన చెయ్యాలి ఉదీయమానకథకులు ఉన్నారు.

## 3

ప్రస్తుతస్థితిలో కథానికాసాహిత్యములో కల్లోలము కనబడుతున్నది. భావసాంకర్యమూ, రససాంకర్యమూ ప్రబలిపోయినవి. శిల్పము క్షీణతవైపు మొగ్గుచూపుతున్నది. కాంతాసమ్మితముగా ఉంటేనే కమనీయత. నిరలంకృతితో కూడిన

నిజమైన విషయమయినా వార్త అనిపించుకొంటుంది. ఉక్తివిశేషము లేకుండా ఉన్నది ఉన్నట్టు సూటిగా చెప్పడమువల్ల సొగసు పోతుంది.

వస్తువు ఏదయినా కావచ్చు. యథార్థ సంఘటన అయినా, కేవల కల్పిత మయినా, ఉభయసమ్మిశ్రణ మయినా, తుల్యబలవిరోధాలు తూచి రసవంత మవుతుందని తేలితే రచనలోకి స్వీకరించవచ్చు. లౌకికప్రపంచములో జరిగిన వాటికన్న కథానికలో కల్పిత ఘట్టాలే రమణీయముగా ఉంటవి. అశ్లీలము హేయము జుగుప్సాకరము అయినవి పరిహరించడము ప్రశస్తము.

సమస్యలు - అంటే ధర్మసూత్రాలు - వాదాలు, సిద్ధాంతాలుకూడా కథానికకు కారణభూతము కావచ్చు. అయితే అవి మిట్టపళ్లవలె మీదికి నెట్టుకురాకూడదు. ప్రతిభావమూ ఒకవిధముగా ప్రచారార్థమే అయినప్పటికీ, వనితనములో బయట పడరాదు. సంస్కారదృష్టి స్తవనీయమే, ప్రచారకదృష్టి ప్రశస్తమే. అయితే పత్రికావార్త వేరు, ప్రచారకకరపత్రము వేరు, కళావైభవోపేతమైన కథానిక వేరు.

గ్రంథం ఏదయినా ప్రత్యక్షంగా ఎవరికో చెప్పుతున్నట్టు భావించి రచించాలి. కథ్ ధాతువుకు చెప్పడము అని అర్థం. ఇక కథానిక నోటితో చెప్పుతూ ఎవరిచేతనైనా వ్రాయిస్తే వర్చస్సు వస్తుంది. కాకితముమీద కలము నడపడమే ప్రధానంగా పరిగణించగూడదు. కథానిక కంటికోసముకాదు, కర్ణము కోసము.

కథానిక పదిపుటలు ఉండవచ్చు, పదిపదులు వ్యాపించవచ్చు. ఆదిమధ్యాంతములు అదృశ్యము కాకుండా, ప్రధానవిషయము భ్రష్టము కాకుండా ఉన్నంతసేపూ దీర్ఘమయినా లోపము లేదు. చిన్నవయినా, సింహావలోకనము లేక చెడిపోయినవి అనేకము. తాత్పర్యార్థముమీద తలపు ఉంచడం ధర్మము.

అనుకరణములూ, అనువాదములూ అనుచితము కావు. అయితే ఆమాట అనక పోతే గ్రంథచౌర్యముకింద గణించవలసి వస్తుంది. దేశీయభాషలో కథానికలు తెలిగించి, పరదేశసాహిత్యాలలో ప్రముఖమైన వాటిని పరివర్తనము చెయ్యవచ్చు. పరభాషలో భావించి పంక్తిమాత్రము ఆంధ్రములో అంటే అందము లేదు.

వాక్యముమీద, వాక్యసందోహము మీద, వాక్యగమనముమీద, మాధుర్యము మీద మనస్సు ఉంచాలి. వాడేది వ్యావహారికభాష అయినప్పటికీ కవివాక్యభాగాలు గంభీరముగా ఉండాలి.

అక్కడ కూడ పసకోసము ప్రౌఢవాక్కు (High proze)అవలంబించాలి. లోకములో నాజూకయిన నవీనపదాలు, జాతీయాలు సంతరించాలి. వర్ణనలలో, కథనములో గట్టు తెంచుకుని విశృంఖలముగా వెళ్లక వెనుకముందులు చూడాలి.

స్త్రీవిషయములో చిక్కు లున్నవి. కామినీవర్ణనలో కళ్లెము బిగించాలి. యువతీ

యువకుల సమాగమాదులలో సముచిత దృష్టి జారనియ్యరాదు. రసికత లేకపోతే రాణింపు లేదు. మొపాసామీద మోజువల్లః లారెన్సుమీద లాలసవల్ల, హాక్స్లీమీద అభిమానమువల్ల కథకులు కొందరు మార్దవమూ మంచీ మరిచిపోయినారు.

వస్తుగ్రహణములో ఇంకా వైవిధ్యము, వైచిత్ర్యము, వైదగ్ధ్యము కావాలి. అపుడు కథానికాసాహిత్యము కలకలలాడుతుంది.

సంవత్సరానికి ఒకసారి కథకసమ్మేళనం జరపాలి. అటువంటి సమావేశంలో కథాసాహిత్య వృద్ధిక్షీణతలనుగురించీ, వివిధవిషయాలను గురించీ విమర్శించవచ్చు. సమ్మేళనములో సమీచీనమైన కథాజాలము గ్రంథరూపంగా అందరికీ అందజేయవచ్చు. ఇదివరలో హైదరాబాదానగరములో అఖిలాంధ్ర కథక సమ్మేళనము రెండుపర్యాయములు జరిగింది. ఇకముందు మధ్యాంధ్రదేశంలో సమ్మేళనము సమకూర్చడం సముచితము.

---

# ముక్తి

శ్రీ బెల్లూరి శ్రీనివాసమూర్తి

ఈయకల్మషహృదయమ్ము, ఈప్రగాఢ
రాగభరితమహాహృదయమ్ము రాత్రి యనకు
పవ లనకు వేదనాభార భగ్నమగును
అమలమైన నీప్రేమలో నిముడుకొలకు.
ఈ తమోనిలయంబున నీ మహోగ్ర
దుర్నిరాశాలయంబున దుఃఖబాష్ప
నిర్ఝరీనిలయంబున నెల్లప్రొద్దు
నవసిపోయెడు నాకు నెన్నడు విముక్తి?
పలుకబోనింక, యత్నంబు సలుపలేను
ఇదిగో శుష్కించి పోయిన యీ యెడంద
యకట, నీలోన తన్మయ మందిపోవ
వేచియుండెద నేకాంతవీథియందు.

---

# కవిహృదయము

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

కవికర్మ కావ్యమని పెద్దలవ్యవహారము. కావ్యము విశ్వశ్రేయోనిదాన మగుటచే నెల్లరి కుపాదేయము. రమణీయార్థప్రతిపాదక మగు కవితల్లజునిశబ్దజాలమే కావ్య మనినాఁ డొకసహృదయుఁడు. శబ్దార్థముల నిరంతర మధురసంబంధము నెఱిఁగిన కవిచంద్రుని దివ్యవాణి లోకోత్తరవస్తునిర్మాణక్షమము. జనవాణి సామాన్యవ్యవహారమాత్రబోధకమై విరమించుచుండ, మహాకవులవాణి ఐహిక పారలౌకికఫలములను జేకూర్చుచు నిరతిశయానందప్రదాయిని యగుచున్నది. కావుననే "ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః" అని రసవిలసితకావ్యమహత్త్వము నెఱింగిన కవివరుఁ డుద్ఘోషించి యున్నాఁడు. పైని నిరూపించిన యభియుక్తోక్తి కేవలము దృశ్యకావ్యమాత్రపరముగా నన్వయింపవలదు. శ్రవ్యకావ్యమునకు నుపలక్షణముగాఁ గైకొనవచ్చును. ప్రత్యక్షములుగాని పరోక్షములుగానియగు నర్థములను హృదయంగమముగా బుద్ధిగోచరము లగునట్లు చేసి, ఆనందము మాట యటుంచుఁడు, కర్తవ్యనిరూపణము చేసి కార్యోన్ముఖత నేర్పఱచుశక్తి కవిభారతిలోనే గలదు. ఒండ్లవాక్కున కట్టి మనోజ్ఞతాశక్తి శూన్యము. అందుకే వేదపురాణములకుఁ బ్రభుసమ్మిత సుహృత్సమ్మితత్వముల సంగీకరించి, కావ్యమునకుఁ గాంతాసమ్మితత్త్వము నతిదేశించియున్నారు. ఈసుమనోహర బోధనశక్తి శాస్త్రకుశలునికి నుండియుండదు. ఎదుటఁ గన్పట్టు స్థాణువును గేవల భాషావేత్తగాని శాస్త్రనిశిత బుద్ధిగాని యగువాఁడు "స్థాణు రయం" అని చెప్పఁగలుగును. కవిహృదయ మట్లు నిర్దేశింప నొల్లదు. "నీరసతరు రివ నివసతి పురతః" అని అలంకారభరితముగాఁగాని వస్తునిర్దేశమునైనఁ జేయఁజాలఁడు కవి.

కవిహృదయము నీరసముగాని విరసముగాని కాదు. అట్లే అతనివాక్కులును నీరసము లనుట తగదు. కవిప్రవరునివాక్కులలో బాహ్యశోభావహములగు కేవలాలంకారములేగాదు పొడకట్టునవి; సహృదయ సంవేద్యమును, రసికజనభోగ్యమును, ఆత్మస్థానమునగు రససౌందర్యమే విశిష్టముగా ఆస్వాద్యమగునది. అట్టి రసపుష్టియే లేకున్న వాగ్వ్యపదేశమే వానిమాటలకుఁ జెల్లదు. "సా వాగ్యా రసవ్యక్తిః" (రసవ్యంజకమగునదే వాక్కు) కనుకఁ గవివాక్కులు రసపర్యవసన్నములయిననేకాని వానికి ధన్యత లేదు. భావాభివ్యంజకత దానికిఁ బూర్వభావియే కాన భావారాధకులగు కవిసోదరులు కినియనక్కఱలేదు. అట్టి దొక్కవాక్యమయినను గావ్యవ్యపదేశమును భజించుచున్న దనుచున్నాఁ డొకసాహితీవేత్త "వాక్యం రసాత్మకం కావ్యం" అని. కవికి సాధ్యమును రసమే (సాధ్యోహి

రసో యథాతథం కవిభిః); కావున ఉత్తమ కవికి రససిద్ధి యావశ్యకము. కావ్యాత్మ సాక్షాత్కారమును బడసిన భర్తృహరి కవీంద్రుఁడుగూడ "జయంతి తే రససిద్ధాః కవీశ్వరాః" అని రససిద్ధులగు కవులకు జేజేలు పెట్టినాఁడు. మమ్మటాచార్యుఁడును "నియతి కృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం, నవరసరుచిరాం నిర్మితిమాదధతీ భారతీ కవేః..." అని కవివాణి నవరస రుచిరమును హ్లాదైకమయమును అగునిర్మాణమున కుశల మని కీర్తించియున్నాఁడు. రస హృదయుఁడు కానివానికి రససిద్ధి లేదు. రససిద్ధి లేకున్న భావుకులను గరఁగించి రస మయులను జేయఁజాలఁడు. అందుకే కవి ముందు అంతర్ముఖుఁడై రసాంబుధి నోలాడినఁ గాని ప్రదీప్తభావమణులతో రసికహృదయముల వెలిఁగించి, రసపానము చేయింపఁ జాలఁడు.

శబ్దార్థమాత్రపరిజ్ఞానము కవికిఁ జిన్ననాఁటియభ్యాసమే. అర్థసమాకృష్ట మగు సూక్ష్మతర కావ్యతత్త్వాభిజ్ఞతలోనే కవి యొక్క సావధానత. ఆతత్త్వప్రకాశమున నే యాతనిప్రయత్నము, కృతకృత్యత. ఈవిష యమును ఆనందవర్ధనాచార్యుఁడు తనధ్వన్యాలోకములోఁ జక్కఁగా నిరూపించి యున్నాఁడు —

"ప్రతీయమానం పున రన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనాం,
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం
విభాతి లావణ్య మి వాంగనాసు."

కామినీమణుల మనోహరాంగకము లందు సర్వావయవవ్యతిరేకముగా లావణ్య మెట్లు భాసించునో, అట్లే మహాకవులవాణిలో వాచ్యాతిరిక్తమై ప్రతీయమానరూపార్థము భాసిల్లుచుండును. తాదృశ వ్యంగ్యార్థప్రధాన మైనదే ధ్వని.

"కావ్యస్యాత్మా స ఏవార్థః"

ప్రతీయమానరూప మగు నాయర్థమే కావ్యమున కాత్మ యనియు, నయ్యది వస్త్వలంకార రసాద్యాత్మకమై త్రివిధములుగ నొప్పు ననియు నానందవర్ధనాచార్యసిద్ధాంతము. అట్టిప్రతీయమానార్థమును బ్రకాశింపఁ జేయు మహాకవుల వాణియే లోకోత్తర విషయములను జిత్రించి ప్రతిపాదించుచున్నది. మహాకవి రసావిష్టహృదయుఁడై అంతర్గత భావమును రసక్లిన్నము చేసి, శబ్దార్థశరీర భాసమానము గావించి కావ్యమున బాహ్యాంతస్సౌందర్యమును బరిపోషింపఁజాలున దీవ్యంగ్యార్థతత్త్వ పరిజ్ఞానము ననే. అందుకే కవికి రససిద్ధి యవసరమగుటను, రసము వ్యంగ్యమగుటను సకలసత్కావి కావ్యోపనిషద్భూతము వ్యంగ్య(ధ్వని) మనియు, వ్యంగ్యప్రధానకావ్యమే ధ్వనిమంతమై యుత్తమకావ్యవ్యపదేశార్హ మగు ననియు ధ్వన్యాలోకకారాదుల మతము.

అందుచేఁ గవిహృదయము కావ్యాత్మ నిరూపణమునందు సంలగ్న మయి యుండవలయును. ఆత్మశోభను గమనింపక శరీర సౌందర్యము నెంతగాఁ బోషించినను, అది జీవములేని ప్రతిమ, గంధములేని పూవు.

కవిహృది నవ్యకల్పనా ప్రవణము; నూత్ననిర్మాణకుశలము. విశ్వసృష్టిలోని పదార్థ రాశిని, భావజాలమును గవిబ్రహ్మ తన కావ్య సృష్టిలో నూత్నచైతన్యభ్రాజితము చేయును. అతఁడు కావ్యజగత్తును విశిష్టసామగ్రితో

విశిష్టసాధనములతో సృష్టించుకొనును. ప్రకృతి కేవలము అతనికి భావప్రదాత్రి మాత్రము. ప్రకృతిలోని మూఁగఱాతిని శిల్పి సౌందర్యవిభాసితసావయవముగాఁ జిత్రించినట్లే కవికుమారుఁడును నైసర్గిక భావములకు సవ్యస్వరూపము నిచ్చి కృతార్థుఁ డగును. కవి వస్తువు నున్నదాని నున్నట్లుగా నిరూపించి తృప్తిచెందఁజాలఁ డని మనవిచేసియుంటిని. దానిని తనవాగ్వైచిత్రి చేతను శిల్పముచేతను మెఱపించి జీవము (రసము) పోసికాని లోకుల కందింపఁడు. వస్తువునందలి వస్తుత్వమును గవి తనకవిత్వముచే భాసమానముచేయును. అట్లు చేయుట (నిర్మాణము)లోఁ బ్రతిభాపాటవమునుబట్టి పలుమార్గము లేర్పడి విభిన్నసౌందర్యము ద్యోతకమగుచుండును. ఒకటేవస్తువును ఒకటే భావమును బలువురు కవులు వర్ణింతురుగాక; దానికిఁ బునరుక్తి లేదు. భిన్నభిన్నశోభ ప్రతిదానియందును గోచరించుచుండును. ఇందుకు రామాయణకథయే దృష్టాంతము. దానిని పెక్కండ్రు వర్ణించినను నిత్యనూతనత్వము తీసిపోవుటలేదు. అందుకు వర్ణనాభంగులును, గల్పనావైచిత్రియు భిన్నతనాపాదించుకొనుటయే కతము. కావుననే కావ్యసంసారములో కవిప్రజాపతిసృష్టి అనంతము, అనిర్వచనీయము అనవలయును. దీని కంతటికిని ప్రతిభాగుణమే (అపూర్వవస్తునిర్మాణదక్షమగు ప్రజ్ఞ- వర్ణనీయవస్తువును నూతనముగాఁ జిత్రించుశక్తి-ప్రతిభయని పెద్దలు) ముఖ్యకారణము. కావ్యతత్త్వార్థవేత్తకు "న కావ్యార్థవిరామోఽస్తి యదిస్యాత్ ప్రతిభాగుణః" ప్రతిభయున్నచోఁ గావ్యార్థవిరామమే లేదని నాఁడు ధ్వనిసిద్ధాంతకర్త ఆనందవర్ధనాచార్యుఁడు.

కేవలము కథావస్తువును మాత్రము నిర్వహించుట కవిహృదయము కాదు. దానిని రసమయ మొనర్చుటయే కవిత యొక్క ముఖ్యోద్దేశ్యము. వస్తువును కవితాకలాప భాసమానము చేసినఁగాని కవికి సాఫల్యము లేదు. అగుటఁ గవి రసపరతంత్రుఁడు కావలయును. శబ్దార్థమాత్ర పారతంత్ర్యముగాని, లేక అన్యపారతంత్ర్యము కాని కవిహృదయమున కసమీచీనము. అన్యతంత్రుఁడైన కవి నవరసరుచిరమైన వాణిని విన్యసింపఁజాలఁడు. కవినిర్మితి అనన్యపరతంత్రము కనుక ప్రకృత రసభావాది నిరూపణవ్యగ్రుఁడైన కవికిఁ దద్రసాదిపరిపోషక సామగ్రి ప్రతిభావ్యుత్పత్తులనుబట్టి దాని కదియే సిద్ధించును. కల్పనా సామర్థ్యమును బట్టియు, వర్ణనభంగులను బట్టియు రచనాప్రకారముల వైవిధ్య మేర్పడుచుండును. రచనా(వర్ణింపఁబడురీతి)వైవిధ్యముచే ఆస్వాదనమార్గములందు భేద మేర్పడును. ఒకతయే స్త్రీ వేషముయొక్క మార్పులచేతను, భిన్నములగు అలంకారవిధానములచేతను వివిధగతుల దర్శనీయ కావచ్చును. బాహ్యమగు నాభేదము అసలువ్యక్తిని మార్పఁజాలదు. ఎన్ని విధములఁ గన్పట్టినను ఆ మొదటి వ్యక్తియే. ఆమె బాహ్యసౌందర్యము మాత్రము పలురీతుల సాక్షాత్కరించి విభిన్నభావ పరిణామములను గలిగించుచున్నది. అట్లే ఒక్కరసమే, ఒక్కభావమే ప్రతిభావ్యుత్పత్తుల ననుసరించిన కల్పనా వర్ణన విధానములనుబట్టి విభిన్నాస్వాదముం గూర్చును. అప్రధానరసమును పలురీతుల

నాస్వాద్యము చేయుటలోనే కవిప్రజాపతివిశిష్ట సృష్టి, నూత్నశిల్పము వ్యక్తమగుచుండును. చూడుడు! లోకమును మోహపెట్టు వయసు కలిమి వర్ణనీయము. ఇరువురు కవులు నవలంబించిన వర్ణనవిధానము లివి —

పదియునా ఱేండ్ల లేతయౌవనపుగర్వ
మూనికొన్నది వేణీధరాంతికమున
అచట నవవల్లులకు పల్లవాచటరసిక
పాళిహృదయాల పండసిపండు వలపు.

— జొటుపూరు పర్యనారాయణ

పదియు నాల్గు వసంతము ల్విదలపట్టి
వయసుసొగసుం దనం బౌమెమెయి నెసంగ
బాల్య మెడలిన మొలదుజవ్వనపుమూసు
ఒసలియుం దండముగ పట్టిపడుచునుండె.

— రాయప్రోలువారు.

రెండేండ్లుమాత్రము వ్యత్యాసముగల సుందరు లిందుపవర్ణితలు. మొదటికవి వేణీభరములోనే వలపుబిగువును సవరించి రసికుల దండడిపఱచినాఁడు. పాఠకునిదృష్టి ఆ కేశపాశములోనే చిక్కుకొనిపోవును. ఇతర సౌందర్యముమీఁది కది ఆకృష్టము కాదు. రెండవ కవి పదునాలుగు వసంతములు వీడనివయసు సొగసుఁదనమును మెయినిండ నింపి విడిచినాఁడు. ఇప్పుడు భావకునిహృదయమునకుఁ జాలినంతపని. పదునాల్గేండ్ల వయసు సొగసు మెయినిండినప్పు డేయంగ మెంత సౌందర్యభరితమో వీఁ డూహించుకొనవలెను; లేదా ఆ చిత్రమును మనోవీథిలోఁ జిత్రించుకొని దర్శింపవలయును. లేనిచోఁ గవిమనోరథము సహృదయునికిఁ బ్రస్ఫుటము కాదు. అందును మొదటిది పదునాఱేండ్ల యౌవనపుగర్వము గలది. రెండవది పదునాలుగు వసంతములు వీడని వయసుసొగసు గలది. ఏండ్లు అనుటకంటె వసంతములనుట వయసుకావరమును వర్ణించుపట్టుల నుచితమై వయోనుగతసౌందర్యమును ద్విగుణితము చేయుచున్నది.

ఒకే వర్ణనీయవస్తువు పైకారణములను బట్టి విభిన్నముగా సాక్షాత్కరించి భిన్నమగు నాస్వాదముం గూర్చియున్నది కదా! ఇచ్చట ప్రతిభాపాటవము ననుసరించి యేర్పడిన వర్ణనవిధానములందలి భేదమే ఒకవస్తువును ద్వివిధముగాఁ దోఁపఁ జేసినది. పునరుక్తి కాని, అనుసరణము కాని అనుటకు వీలులేదు. "సుకవివాణికిని, కామినుల విభ్రమములకును అవధిగాని పునరుక్తిగాని లే"దని ఆనందవర్ధనాచార్యుఁడు.[1]

కవి అనుకొన్నదాని ననుకొన్నట్లు చెప్పఁడు. ఉన్న దున్నట్లుగా నిరూపించి యూరకొనుట కవిహృదయము కాదని వ్రాసియున్నాను. వస్తువును కాని భావమును గాని వివిధప్రకారములఁ జిత్రించి దర్శింపఁజేయుటలోనే కవిత్వ మున్నది. దానికిఁ గారణము కవిహృదయము రసమయమును సుందర

1. ణ అ తాణ ఘడఇ ఒహీ ణ అ తే దీసన్తి కహవిపునరుత్తా
తే విబ్భమా పిఆణం అత్థా వా సుకఇవాణీణం.

ఛాయ —

"న చ తేషాం ఘటతేఽవధిర్న చ తే దృశ్యంతే కదాపిపునరుక్తాః
యే విభ్రమాః ప్రియాణా మర్థా వా సుకవివాణీనాం" —ఆనందవర్ధనుని "విషమబాణలీల."

మును అగుటయే. అట్లు కాకున్న వాఁడు కవి కాఁడు; అతనికర్మ (రచనావ్యాపారము) కావ్యమును గాదు. ప్రణయకుపిత యైన ప్రియ నుపలాలించుచు "నీకుఁ గోపము కలుగుట అసహజమని అనుట కవికిష్టము." ఆ మనోరథమును దీర్చుకొనుట కాతఁ డవలంబించిన వాగ్విన్యాసవిధాన మిది—

జిలుఁగుచిఱునవ్వువెన్నెల ల్చింది పడెడు
వదనమునఁ గోపపూర్ణవైవర్ణ్య మేల
తాండవించెను భామినీ! కలఁపవో కొ-
తిమము వర్షింపఁబోఁడు సుధామరీచి.

—నా "సాంత్వనము."

పైమాట ననుటకుఁ గవి ప్రకృతి హృదయమునఁ బ్రవేశించి సుధాకరుని మైత్రిని సంపాదించుకొని వాని చెలికారముచేఁ దత్సిద్ధిని బడసినాఁడు. చంద్రునికి చీఁకటిని గురిపించుట ఎట్లు ప్రకృతివిరుద్ధమో నీకుఁ గోపము కల్గుట అంత అసహజమని ఆమె కుపితహృదయము రసార్ద్రి మగునట్లు పలికినాఁడు. ఈవిధముగా కవివాక్కు రసపర్యవసన్న మయిననేకాని దానికిఁ జరితార్థత లేదు. అందుకే ప్రధానమైన రసమనుటచే అంతటను ఆనందస్థితి రూపప్రయోజన మత్యున్నతము. హ్లాదైకమయికదా మఱి కవి భారతి! ఇపుడు "కళ కళకొఱకే" అనుపక్షముతో "కళ కళకొఱకుఁగూడను" అనునంత వఱకు రాఁగల్గితిమి. కళాప్రయోజనవాదులు గూడ అనపహార్యముగా సిద్ధించుప్రయోజనములను విడువఁజాలరుకదా. వారిదృష్టి కళామాత్రపర మగుటచే ఇతరము వారి కగోచరము కావచ్చును. కాని కళాదేవతమాత్రము ఈఁదలఁచినన్ని ప్రయోజనముల నీయకుండఁ జాలదు. అనుభోక్త అభిరుచినిబట్టియు, హృదయపరిపక్వమునుబట్టియు, వానిని (ప్రయోజనములను) స్వీకరించుచుండును. కళనుండి ఆనందము(కళ)నే అనుభవించు సిద్ధులు కొందఱు; ఉపదేశరూప ప్రయోజనములను గూడ నభిలషించుసాధకులు కొందఱు. ఇక్కడ తారతమ్యవివక్ష అనవసరము.

కవితాకళ శాంతము శివము సుందరము. అగుట తదారాధకులును సౌందర్యపిపాసువులు. కవితాంశములైన శాంతశివస్వరూపములను సౌందర్యోజ్జ్వలములుగా అనుభవింతురు. శుష్కహృదయముతోఁడను, హీనదృష్టితోఁడను దానిని దర్శించి తృప్తి చెందరు. అట్లగుచో భావుకునకుఁ దదారాధనమే అనవసరము.

శిల్పి సువర్ణమును తన అప్రతిమాన శిల్పకళచే భూషణము నొనర్చి సర్వసంధార్యముగాఁ జేయునట్లు ప్రకృతిసిద్ధమైన భావమునే కవి కవితాచిత్రితమొనర్చి సహృదయులహృదయముల చూఱగొనుచున్నాఁడు. ఆనందబుభుక్షువులు కవిభావనానిర్మితమైన ఆప్రకృతిసిద్ధ భావమునే ఆరాధించి పరనిర్వృతిని బొందుదురు. కేవలసువర్ణము అలంకారయోగ్యమైనట్లు కవి తాఁకనిభావమును ఆనంద దాయకము కాదు. కవిరాజు కళావిరాజితముచేసి జీవముపోసిననేగాని అది (ప్రకృతి సిద్ధమైన వస్తువు, భావము, కథ) లోకమున కుపకరింపదు.

కాలవిపర్యాసముచే జీవితము కష్టముల కాలవాలమై దుఃఖభాజనమైపోయినది. వాని మరణమే శరణము. లేకున్న ఈ ప్రాకృతదుఃఖముల సహింపజాలఁడు. అట్టివాఁడు చచ్చి బాగుండు ననుకొనును. ఇదిలోకములో

పద్గ్రిస్తులకు సహజముగాఁగల్గు నభిప్రా
యము. కాని అందులో రమణీయత లేదు.
మాత్రమున సహృదయుల మానసములు
ందించవు. ఈభావమునకే కవిబ్రహ్మ
వముపోసి అబ్బా! అనిపించును.

> కాలపురుషుఁ డకారణాగ్రహము పూని
> సిలుసుగాభు జ రువ్వి హింసించునెడల
> వరలకు శ్మశానవాటి ఆనందసీమ,
> కాలపాశము చిరసుఖగ్రంథిమాచె.
>
> —పులిక ర్తి శరభాచార్యులు.

ప్రకృతిసిద్ధమైన ఆభావమే కవిహృద
యమునఁ జొచ్చి కవితాకళాప్లావితమై పరి
లమనో నేత్రములకు ఆపద్గ్రిస్తునిహృదయా
స్థను చిత్రమట్లు సాక్షాత్కరింపఁజేసినది.
చట రెంటియొక్క సమ్మేళన మున్నది.
ప్రకృతిసిద్ధమైనభావ మొకటి; కవిచంద్రుని
వితాకళ యొకటి. భూషణములో భూషణ
త్వము సువర్ణత్వము ఉన్నట్లు, డీనిలోను
స్తుత్వము కవిత్వము నున్నవి.

లోకోత్తరార్థములను, సూక్ష్మాతిసూక్ష్
షయములను ప్రకటించుటకుఁ గవివాణియే
మర్థమైనది. ప్రకృతిహృదయమున నిమిడి
యున్న రహస్యములను, మానవోపాస్యము
లైన భావభంగిమలను, మనుష్యహృదయము
కాసభాసురమగునట్లు వెలార్చుట కొక్క
సుకవిచంద్రునకే యర్హతగలదు. తరఁకిర
ముసైతము దూర కలవిగాని తావులఁ గవి
హృదయము చొచ్చుకొనిపోయి పదార్థా
న్వేషణము చేయఁగలదు. ఇట్టిసైశిత్యము
చేతనే ఆతనిహృదయవినిర్గతమగు భావము
మానసాకాశమున నంటి మిలమిల మెఱయు
తారవలె భాసురమై బుద్ధివికాసము నొడఁ
గూర్చుచున్నది.

యోగి బాహ్యవ్యాపారముల నరికట్టి
అంతర్ముఖుఁడై ధ్యానైకాగ్రమగుచిత్తముతో
బ్రహ్మసాక్షాత్కారము నంది బ్రహ్మా
నందము ననుభవించును. కవియు నేకాగ్ర
చిత్తముతో వర్ణ్యవస్తువును భావించి బ్రహ్మా
నందసబ్రహ్మచారియగు రససంసిద్ధి నంది
రసానందమున మునుఁగును. బ్రహ్మానందము
కేవలము యోగిమాత్రసంవేద్యము. రసా
నందము సహృదయుల కందఱికిని భోగ్యము.
కవి తా ననుభవించునానందమును భావుక
గణమునకుఁ బంచియిచ్చును. యోగి అట్లు
చేయఁజాలఁడు. కవిహృదయమునకు భావనా
శక్తి, రససిద్ధియు లేకున్న అతఁడు కవిత్వము
చెప్పఁజాలఁడు, పద్యము లల్లునేమో. శబ్ద
జాలమును ఛందోబద్ధ మొనరించినంతమాత్ర
మున అది కవిత యనఁబడదు. దానిలో
మనకుఁ గవిహృదయమును గన్పట్టదు. శబ్దా
ర్థములే గోచరించునవి.

కవి తాను బ్రదర్శింప నెంచిన యర్థమును
వ్యంగ్యముఖమున నిరూపించికాని తృప్తి
చెందఁడు. వాచ్యవాచకములలోఁ బరమా
ర్థము ప్రస్ఫుటము కాదు. రసము వాచ్యము
కాదు కనుక వ్యంగ్యార్థసమాశ్రయణ మపరి
హార్యము. మఱియు వాచ్యవాచకములు
కావ్యమునకు శరీరస్థానములే యగుటచేత
ఆత్మభూతమైన ధ్వనిలేకున్న ఆకావ్యము నిర్జీ
వము. కౌరవ పాండవుల పరాక్రమనిరూపక
మగు మహాభారతమున సర్వరసానుప్రవేశము
గల వీరము ప్రధాన మనుకొనవచ్చును. కాని
వ్యంగ్యద్వారమున శాంతరసమును మోక్ష
పురుషార్థమును బ్రధానముగా నిరూపించుట
కవిహృదయము. ఈయంశమును ఆనంద

వర్ధనుఁడు ధ్వన్యాలోకములో వివరించి యున్నాఁడు.

* "మహాభారతమునఁ గవి చెప్పఁదలఁచినదెల్లను అనుక్రమణిలో నున్నదిగాని ఈవిషయము కన్పట్టదు. మీఁదుమిక్కిలి సర్వపురుషార్థప్రబోధము, సర్వరసగర్భత్వమే యందు శబ్దతః చెప్పఁబడినదికదా యున్నసత్యమే మహాభారతమున శాంతరస మంగి యనియు, మోక్షము నకే అన్నిపురుషార్థములలోను ప్రాధాన్య మనియు వాచ్యరూపముగఁగాక వ్యంగ్యద్వారమున నూదితమయి నది. "భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః" అనువాక్యమున నీయర్థమే వ్యంగ్యరూపమున వివక్షితము. పాండవాదులచరిత ముద్ఘాటింపఁబడినను, అద్దాని చేతను నిస్సారములైన విభూతులయందుఁగాని నయవినయపరాక్రమాది సుగుణములయందుఁగాని రక్తులైపోవల దనియు, భగవానుఁడగు పరమేశ్వరునియందే భావితాంతఃకరణులు కం డనియు సంసారముయొక్క నిస్సారతయే వ్యక్తీకరింపఁబడినది. నిగూఢరమణీయమగు నీయర్థము నే కవిబ్రహ్మయగు కృష్ణద్వైపాయనుఁడు మహాభారతావసానమున హరివంశమున వర్ణించి స్ఫుటీకరించి యున్నాఁడు. సంసారాతీతమయిన తత్త్వాంతరమునందు భక్త్యతిశయమును గలిగించు నీయర్థముచేతనే సమస్తమైన సాంసారికవ్యవహారము పూర్వపక్షీకృతమైనది. పలువిధములైన దేవతాతీర్థ తపోనిష్ఠాదుల ప్రభావవర్ణనము కూడ అపరబ్రహ్మప్రాప్తికే యుపాయమైనది. పాండవాదుల చరిత్రోపవర్ణనము వైరాగ్యజననకారణమైనది. వైరాగ్యము మోక్షమూలమనుటను, మోక్షము భగవత్ప్రాప్త్యుపాయమనుటను, ముఖ్యముగా గీతాదులయందు పరబ్రహ్మప్రాప్త్యుపాయమే ప్రదర్శితమై పరంపరగా గోచరించెడిని. ఈవిధముగా అనుక్రమణీనిర్దిష్టమైన వాక్యముచేత భగవద్వ్యతిరిక్తమైన సమస్తమునకు అ త్యతను నిరూపించు మోక్షలక్షణమైన పరమపురుషార్థము తృష్ణాక్షయసుఖపరిపోషలక్షణమగు శాంతరసము అం భూతములుగా వివక్షితములైనట్లు సుప్రతిపాదితము అత్యంతసారభూతమైనయీయర్థము వ్యంగ్యముఖమున నిరూపితమైనదికాని, వాచ్యము దానిపాంతకైన బోలేదు. అభిమతతరమును సారభూతమును అనువర్త వ్యంగ్యముచేఁ బ్రకాశితమైన శోభించునేకాని సా చ్ఛబ్దముచే నిరూపించిన నొప్పదు."

సముద్రగంభీరమగు కవిహృదయమెం దుర్గ్రాహ్యమును దూరదర్శియునో చూడ డు. నానారసోల్లాసితమైన భా తేతిహాసమునకుఁ గూడఁ ప్రధా ముగా నిరూపింపఁదలఁచిన రస శాంత మని వాచ్యవాచకమాత్రక త్రములకుఁ దెలియదు. అందుకే అతిసూక్ష బుద్ధులగు ప్రాచీనలక్షణకారులచేతను స స్మ్రలితముకానిది వ్యంగ్యతత్త్వ మనినాఁడ ఒకవ్యక్తిని గుఱుతించుటలో ఆతనిశరీరమున గుణగణములను, వేషభాషాదివ్యవహారమ లను గనుఁగొనుట సులభమేకాని, శరీర ఆత్మను దెలిసికొనుట కష్టముకాదా? కా ననే స్థూలబుద్ధులగు చార్వాకులు శరీరా వాదులైరి. శరీరవ్యతిరిక్తమై దేహప్రకాశ మగు ఆత్మ తాత్త్వికులకే పొడకట్టినట్లు కావ్య తత్త్వార్థ భావనాకుశలులకుఁ గా శబ్దార్థ(కావ్యశరీర)వ్యతిరిక్తమయిన కావ్యా సాక్షాత్కరింపదు.

---

* ఇది ధ్వన్యాలోకములోని భాగము. మూల మనవసర మని యుదాహరింపనైతి.

# స్వేచ్ఛాజీవనము

"సంపత్"

స్వేచ్ఛా జీవన
మపేక్ష జేసే
హృదయా లేవీ
పౌరుష మేదీ
ప్రపంచమంతా
బానిసత్వమే
బానిసత్వమే.

ముడిసిన
ముచ్చటలో
మురిసిపోయి
మరగిపోయి
ముసిముసి
నవ్వులతో
ముగిసిందే మన
ముచ్చట.
హిమాంశు వేలా
హిమ తాళింపదు ?
చంద్రిక లేలా
దహింప నేరవు ?
నీరము లేలా
నిప్పై యుండవు ?
ప్రకృతి దేవికీ— బానిసత్వమే !
ఏదీ స్వాతంత్ర్యము మన
కేదీ సుఖజీవనమ్ము ?

స్వేచ్ఛాజీవన
మపేక్ష జేసే
హృదయాలేవీ
పౌరుష మేదీ?

—

# నిరుద్యోగి*

డాక్టర్ అయ్యగారి వీరభద్రరావు

## ఈనాటికలో వచ్చే ప్రధానపాత్రలు

కామేశ్వరరావు— నిరుద్యోగి. కథానాయకుడు. ౨౫ సంవత్సరాలవయస్సు. కొంచెం పొడగరి. విశాలమైననుదురు, కాంతిమైన ముఖం, వర్చస్వి.

రామారావు—అతని తమ్ముడు. వయస్సు ౨౨ సంవత్సరాలు. కొంచెం స్థూలకాయుడు, సాధుస్వభావము కలవాడు, మందకొడి. ఉద్యోగం చేస్తున్నాడు. ఇంటర్మీడియటు ప్యాసు అయి, టైపింగ్ వగయిరా పరీక్షలలో కృతార్థుడయి ఒకకంపెనీలో పోస్టు పొందు టైపిస్టుగా ఉన్నాడు.

మేనేజరు— ఏ. కే. బి. లిమిటెడ్ కంపెనీ ఉద్యోగస్థుడు. మహాగర్వి. వయస్సు ౩౦ సంవత్సరాలుండవచ్చు. ముఖంలో అహంకారం, కఠినత్వ స్వభావం కనిపిస్తూఉంటాయి.

తల్లి— కామేశ్వరరావు, రామారావుల తల్లి. వితంతువు. స్థూలకాయురాలు. కొంచెం పాతకాలపు మనిషి. కోపం ఎక్కువ. సంపాదిస్తూఉన్న కొడుకంటేనూ, అతనిభార్య కమలంటేనూ చాలా ప్రేమ. అది వాళ్లమీద ప్రేమ కాకపోవచ్చు, సంపాదనపరుడు కాబట్టే, అతని కా గౌరవం.

రాధ— కామేశ్వరరావుభార్య. చామనచాయ. లక్షణమైన ముఖము. వయస్సు ౨౦ సంవత్సరాలు. ముఖంలో ఒకవిచారరేఖ ఎప్పుడూ పొడగట్టుతూ ఉంటుంది. సర్వవిధములా కామేశ్వరరావుకు తగినభార్య, ఒకకుమారుడు.

కథాకాలం — ప్రస్తుతం.

స్థలం— ౧, ౨, ౩, ౪, ౫, ౬ రంగాలు. కాకినాడలో; ౭, ౮ రంగాలు మద్రాస్‌లో.

---

* ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ వారు బ్రాడ్‌కాస్ట్ చేసిన నాటిక యిది. వారి అనుమతితో.

## ౧-వ రంగం

[కామేశ్వరరావు యింటిలోపల వసారాలో తల్లి చిరాకుగా]

తల్లి—రాధా! ఒసేవ్! అబ్బ! వినిపించుకుంటేనా? వాడొచ్చాడు కాబోలు! గదిలో దూరింది... రాధా!

రాధ—(దూరాన్నుంచి) ఆఁ.. వస్తున్నా అత్తయ్యా!

తల్లి—(కటువుగా) ఎక్కడికి దయచేశావ్? అబ్బ! ప్రతీపనీ చెప్పాలంటే అమ్మో! ఎంగిళ్లిలా ఉన్నాయ్, రామం భోజనముచేసి లేచాడు, అసహ్యంగా యిల్లు యిలా వుంది ఏం పాటపడదామని వెళ్లావు అవతలకి అప్పుడే?

రాధ—(ప్రవేశించి నెమ్మదిగా) అదికాదండీ. ఇప్పుడే వచ్చారు ఎండనపడి తిరిగి తిరిగి. కాస్త కాళ్లు కడుక్కునేందుకు నీళ్లిద్దామని వెళ్లాను. కాకా, కమల యిక్కడే వుంది నే వెళ్లేటప్పటికి. మరిదిగారింకా భోం చేస్తూనేవున్నారు.

తల్లి—అవును. కమ లిక్కడే వుంది, ఉండదూ మరీ! తమ రవతల కూచుంటేనూ. ఏం మించిపోయింది అవతల యిప్పుడు? ఇంటి కొచ్చినవాడు ఏమయి పోతాడు? కాస్సేపు కూచుంటాడు. ఆఫీసుతోందరా ఏమన్నానా? పాపం రామానికి కాస్త రెండు తమల పాకులేనా చుట్టివ్వకుండా కమల ఎంగిళ్లెత్తుకూ కూనో వాలా, నా డాఫీసు కెడుతూంటే! పోనీ, నేనే చేసుకుంటాను, మీ రెవ్వరూ నాకు చెయ్యక్కరలేదు, నాకు రెక్కల్లో దార్ఢ్యం ఉన్నన్నాళ్లు. నాయింటి పని నే చేసుకోడానికేం, మహారాజులా చేసుకుంటాను. మీరూ, మీ మొగుళ్లూ గదిలో కూచుందురుగాని కులుకుకుంటూ.

రాధ—అదేమి టత్తయ్యా? నే నేం చెయ్య నన్నానా యేమిటి? ఒస్తూంటినిగా. ఏదో పోనీ వాళ్లనీ వీళ్లనీ చూసివచ్చారుగదా, ఏమయినా ఉద్యోగం దొరికే టట్టుందేమో, అని కనుక్కోడానికి వెళ్లాను. మీకు మాత్రం లేదా ఏమిటి ఆదుర్దా.

తల్లి—చాలు! ఉద్యోగం!... మూణ్ణెల్ల నుంచీ ప్రయత్నమే. వీడిమొహం చూస్తే యివ్వదలుచుకున్న వాళ్లుకూడా యివ్వరు.

[కామేశ్వరరావు ప్రవేశం. చెమటకి తడిసి ముద్ద యిన బనియను, పంచ సుండారు పోసుకుని, చేతి మీద కువాలు, ముఖం వాడిపోయి ఉంటుంది. జుట్టు తడిసి ముఖంమీదికి పడుతూ ఉంటుంది. నిస్పృహతో]

కామే—దానికి నే నేం చెయ్యమన్నావ్ మరీ, నాఖర్మం. అడ్డమైనవాళ్లనీ చూస్తున్నాను - ఒకచోట కాకపోతే ఒకచోటేనా సంపర్కపడుతుందేమో అని.

తల్లి—ఏమయింది యీవాళ వెళ్లినచోట?

కామే—ఏముం దనేందుకు? మామూలే. కాని కొందరకంటే నయం యితను. కాస్సేపు సరసంగా కబుర్లు చెప్పాడు, కాఫీ యిచ్చాడు, అంతా అయింతరు వాత మొండిచెయ్యి చూపించాడు. ఇంతకీ జనవమేస్టరీ ఉద్యోగానికి. ఎకనామిక్స్ ఆనర్స్ ప్యాస్ అయి హైస్కూల్లో మేష్టరీపనికి ప్రయత్నం చెయ్యడం ఎలా వుందో ఆయన ఉద్యోగం లేకపడం అలాగే వుంది.

తల్లి—మరి మేష్టరు కావా లని చెప్పాడంటే ఆ హెడ్ మాస్టరు రామంలోటి?.

కామే—ఇప్పుడు అక్కర్లేదనా? వాళ్ల వా డెవరో ఉన్నాడు కాబోలు. అందుకే యీ వంకలన్నీ. నీకు ఎక్స్‌పీరియన్సు ఉందా అంటాడు, ట్రెయినింగ్ అయిందా అంటాడు. ఫస్ట్, సెకండ్ ఫారములకి జాగ్రఫీ, థర్డ్ ఫారముకి హిస్టరీ, ఫోర్త్ ఫారమ్‌కి కాంపోజిషన్ పుస్తకాలు దిద్దడం. ఇంతోటి ఘనకార్యానికి ట్రెయినింగ్ కావాలి, ఎక్స్‌పీరియన్స్ కావాలి! అంతకంటే నీ కీ వుద్యోగం యివ్వను మావాడున్నాడొకడు అని చెప్పరాదూ?

తల్లి—(అపహాస్యంగా) బాగుంది. వాళ్ల మీద కోప్పడితే ఏం లాభం? కొంచెం ఆశ్రయించాలి. రెండు మూడు రోజులు వాళ్లచుట్టూ తిరగాలి.

కామే—ఛా! ఈఅడ్డమైనవాళ్ల చుట్టూ ఎవరు తిరుగుతారమ్మా! కాక ఏమని మళ్లీ వెళ్లడం, యివాళకీ, రేపటికి నా క్వాలిఫికేషన్స్ ఏమన్నా మారుతాయా? రేపటిలోపుగా నాకు ఎక్స్‌పీరియన్స్ వస్తుందా? ట్రెయినింగ్ అవుతానా? ఎందుకు మళ్లీ వెళ్లి మొహం చూపించి తే దనిపించుకురావడం. నిన్న చెప్పాగా మళ్లీ ఎందుకు వచ్చావంటే ఏమనేది?

తల్లి—అన్ని జవాబులూ నువ్విక్కడే చెపుతావు రా నాయనా! పోనీ-నీకే శ్రద్ధలేకపోతే ఉద్యోగం ఎలా వస్తుంది—లే. కాళ్లు కడుక్కో. స్నానం చేస్తావా? నీళ్ళు లయిపోయినట్టున్నాయి.

కామే—నీళ్లెందుకమ్మా. హాయిగా చన్నీళ్లే పోసుకుంటా.

[తల్లి నిష్క్రమించును.]

రాధ—పోనీ స్నానం మానేయండీ. వంటిమీద పోసుకోండి. నిన్న భారకింపుగా ఉందన్నారు కూడాను....పోనీ వేణ్ణీళ్లు పెడతాను.

కా—ఏమక్కరలేదు....

[అలాగే నూతిదగ్గరకి నడిచి వెళ్లిపోతాడు. రాధ కొంచెంసేపు అతనివైపు చూస్తూఉండి మళ్లీ ఏమి జ్ఞాపకం వచ్చిందో చటుక్కున వంటయింటివైపుకు తొందరగా వెళ్లిపోతుంది.]

౨-వ రంగం

[కామేశ్వరరావు పడకగది. ఒకమూ మూల మంచం - ఒకకుర్చీ. భోజన మయినతర్వాత కామేశ్వరరావు కుర్చీలో కూర్చునిఉంటాడు. రాధ తమలపాకులు దగ్గరపెట్టుకుని పక్కన క్రింద కూర్చుని ఉంటుంది.]

రా—తమలపాకులు రాసి యిమ్మన్నారా?

కా—తమలపాకులూ వద్దు ఏమీ వద్దు. నే సంపాదించే సంపాదనకి తమలపాకులే తక్కువ.

రా—అదేమిటి, సంపాదనకీ తమలపాకులకీ సంబంధ మేమిటి? సంపాదన మనచేతుల్లో వుందేమిటి? మీకు చేతనయింది మీరు చేస్తున్నారు. ఉద్యోగం కాలేదు అంటే - వస్తుంది ఆరో జొచ్చేటప్పటికి. ఆలాగ తిండి మానకుంటారా. ఈ రెండు మూడు రోజులనుంచీ సరిగా తిండేనా తినడంలేదు.

కా—ఏమిటో భోజనందగ్గర కూర్చునేసరికి అసహ్యమేస్తుంది. కాకా, అప్పుడే సరిగ్గా ఉద్యోగం గొడవొస్తుంది. దాంతోటి నా కసహ్యం పుడుతుంది. ఆ అన్నం అలా వదిలేసి చక్కాపోవా లనిపిస్తుంది.

రాధ—బాగుంది. ఆలాగని తిండి మానుకుంటే ఎలాగ? పోనీ అక్కడికీ యిక్కడికీ తిరగడానికేనా ఓపికుండాలా? ఉద్యోగం పేరుపెట్టుకుని వళ్లు పాడు చేసుకుంటే ఎలాగ? రేపు ఉద్యోగం వస్తే పోయిన ఆరోగ్యం అంత సులాగ్గా వస్తుందా?

కా—నా ఆరోగ్య మేం పాడవదు. దుంగ ముక్కలా వున్నాను. నాకేం పనా పాటా? ఇంటిదగ్గర తింటూ కూచోడమేగా ఏదో ఉద్యోగం పేరెట్టుకుని వాళ్లింటికీ వీళ్లింటికీ తిరిగి వస్తుంటాను అక్కడో యింత కాఫీ యిక్కడో యింత కాఫీ ఎగబోస్తుంటాను. నాకేం?

రా—పోనిద్దురూ అత్తగారిమాటల కేం... మీ రెప్పుడు విన్నా రిది. ఏదో అలా అంటూంటారు.

కా—అది కాదు రాధా! ఉద్యోగం మనిషి తాహతులో ఎంతమార్పు కలిగిస్తుందో అని ఆలోచిస్తూ ఉంటాను. రెండు సంవత్సరాల క్రిందటివరకూ నే నింట్లో పెద్దకొడుకునీ, ...ఆనర్స్ చదువుతున్నాను

కాబట్టి. రామం అప్పుడు ఇంటర్‌లో ఉన్నాడు. కాస్త భోజనానికి ఆలస్యం అవుతే ఏమి మూర్ఛపోతానో అన్నట్లు చూశేవారు నన్ను. కాలేజీకి వెళ్లడానికి సైకిలు. మధ్యాహ్నం నాకు టిఫ్ఫిన్ తేవడానికి నౌకరు. ఎంత దర్జాగా ఉండేది...ఇంక కాలేజీలో కావలసినంత మంది స్నేహితబృందం...

రా—వాళ్లంతా ఏమయ్యారు యిప్పుడు? ఏమన్నా పనులు చేస్తున్నారా, అంతా యిలాగే వున్నారా?

కా—వాళ్లకేం అదృష్టవంతులు. పై పుదో్యగాల్లో వాళ్లవాళ్లెవరో ఉన్నారు. వాళ్లని పైకి లాగారు. మనఖర్మమే యిలా కాలింది. మొన్న నా క్లాస్‌మేట్ ఒకడు కనిపించాడు. ఏం చేస్తున్నావురా అంటే ఏదో ఫర్మ్‌లో వున్నాను అన్నాడు.

రా—అతని కెలా వచ్చింది మరి ఆ ఉద్యోగం?

కా—వీలా సేమిటి వాణ్ణడిగితే ప్యూర్ మెరిట్ అంటాడు. "ఇంటర్వ్యూకి పిలిచారు. చాలా యిదిగా పరీక్షచేశారు. వాళ్లు హడలిపోయేటట్టుగా సమాధానాలిచ్చేప్పటికి వీడేరా మనకి కావలసినవాడు అని మరునాడు ఆర్డరు పంపారు" అని చెపుతాడు.

రా—అదృష్టం.

కా—అదృష్టం. అవును అదృష్టమే. అభిమానం, నీతీ లేకపోవడమూ అదృష్టమే. ఫర్మ్ మేనేజరుకి ౫౦౦ పోస్తే ఉద్యోగం వచ్చింది.

రా—ఏదో ఏ సంటూలూ పడకపోతే ఎలాగ? అయిదువందలు పోస్తేనేం, నెలకి ౬౦ రూపాయల ఉద్యోగం దొరికింది. ఆ అయిదువందలూ అప్పే చేశాడో ఏం చేశాడో-దేవుడు రక్షిస్తే మూడు, నాలుగేళ్లలో తీర్చుకోవచ్చు. ఉద్యోగంఅంటూ దొరికింది చూడండి.

కా—రాధా! నువ్వుకూడా యిలా అంటావను కోలేదు. అటువంటి ఉద్యోగం నాకువద్దు. మనస్వార్థపరత్వం, ధనలోభం, మనని ఎంత నీచులనుగా చేస్తోందో చూశావా? లంచం యిచ్చి ఉద్యోగం సంపాదించమనా నీసలహా?

రా—లంచం అనండి ఏమనండి. దానివల్ల ఎవరికి నష్టం? ఆమానేజరుకి ౫౦౦ రూపాయలు ముట్టాయి. అతను సంతోషించాడు. మనకి ఉద్యోగం దొరికింది. మనం సంతోషించాము. అలాగని పనికిరానివాళ్లని తీసుకోలేదే. దానివల్ల కంపెనీకి నష్టం కాలేదు. అందులో ఏం తప్పుంది?

కా—చాలా సంకుచితంగా ఆలోచిస్తున్నావు దానివల్ల నష్టం ఎవరికంటావు, అందరికీ నష్టమే. ఒకటే, ప్రాపంచికంగా ఆలోచిస్తే ఎవరికీ లేకపోవచ్చు కాని నీతి న్యాయం అనేరెంటినీ చంపేశాం దానివల్ల. ఆ మానేజరుయొక్క ధనాశని ఆధారం చేసుకుని అతన్ని లంచగొండిగా చేశాం. ఎందుకు? మన ఉద్యోగంకోసం, మన స్వార్థంకోసం, యింకోళ్ల నీతిని చెరిచి, నీచత్వానికి వెరవనివాళ్లనుగా చేస్తున్నాం. అది ఏమంత ఘనకార్యం?

రా—ఇవన్నీ ఆలోచిస్తే ఎలాగ? పోనీ మనం ఆలోచిస్తాంగాని అంతా అలా అనుకుంటారా? ఈవాళ మీరు కాకపోతే రేపు యింకోడు, ఆకాస్తపనీ చేసేస్తాడు. దానివల్ల మనకి నష్టమేకాని, జరిగేది జరక్క మానిందా?

కా—ఏదో సామ్యం చెప్పినట్టుంది. ఎప్పటికేనా జరగవలసిందేగదా అని మనం ఎవరిప్రాణమేనా తియ్యడమేనా? నువ్వు యిన్ని చెప్పు అన్ని చెప్పు, నా ఉద్యోగంకోసం అని, నా తిండికోసం అని, నా ఆశయాలనీ, అభిమతాలనీ చంపుకోలేను. ఈఅవస్థలో చితికిపోయి నా వరే వేలుపెట్టి చూపకుండా ఉండే ప్రవర్తనతోనే అంతరించిపోతాను. అంతేకాని నా ఆత్మని చంపుకుని నీచప్రవర్తనకిమాత్రం వడికట్టుకోను.. (సాలోచనగా) ఒకటి, నాధ్యేయాలన్ని నా ఐడియల్స్ మూలాన్ని మీకు పాపం యిబ్బంది కలుగుతుంది...

రా—చాల్లెండి. ఇంతేనా నామనస్సు మీరు గ్రహించింది? నేనుమాత్రం యీ పాడుపనులు మీచేత చేయించాలనా. ఇంట్లో అందరూ మిమ్మల్ని పట్టి ప్రపంచకజ్ఞానం లేనివారు, అతిన్యాయంగా వెళ్లాలి అని పిచ్చి, ఎలా పయికొస్తారు? చెపితే నచ్చదుకూడాను

అంటూఉంటే వినలేక పోనీ అని చెప్పాను కాని, పస్తున్నా సరే, అన్నం లేక మాడినా సరే నా దొక్క చే కోరిక, మన మానాన్ని మనశీలాన్ని రక్షించుకుని నలుగురిలో ఓహో అనిపించుకోవాలి. మీ రేం చెయ్య మన్నా సరే, మీ స్థితిలో వున్నా సరే మీ తోటి వాళ్ళే చేసాను.

కా—నాకు తెలియదూ రాధా! నీ ధైర్యము. ధర్మచింత ఆరెండే నా కెప్పుడూ బలాన్నిస్తాయి... చూద్దాం, రోజు లెప్పుడూ ఒకేరీతిగా ఉంటాయా, మనకి మంచిరోజులే రాకుండా వుంటాయా?

రా—అన్నట్టు ఎవరో ఫర్మ్ మేనేజర్ని చూడ్డానికి వెళ్లా లన్నారు.

కా—అవును రేపు పదిగంటలకి వెళుతున్నాను ...ఏమవుతుందో.

రా—నే వెళతాను; మళ్లీ అత్తగారు కేకలేసుకుంటారు.

త—(లోపలినుంచి) రాధా...

రా—ఆ! వస్తున్నా అత్తయ్యా....

[తమలపాకులు ఎవరూ వేసుకోనేలేదు. అలాగే ఉన్నాయి. రాధ అత్తగారి పిలుపు వినడంతోటే ఆతమలపాకుల పళ్లెం ఆపళంగానే అక్కడ ఉంచి, చరచరా లోపలికి వెళ్లిపోతుంది.]

## 3-వ రంగం

[ఏ. కే. బి. ఆఫీసు; మేనేజరుగారిగది. కుర్చీలో మేనేజరు సిగరెట్టు కాల్చుకుంటూ కూర్చుంటాడు. ఎదురుగుండా పెద్దబల్ల, బల్లనిండా కాగితాలు. రెండవప్రక్కన రెండుకుర్చీ లుంటాయి. ఆఫీసుగది ఎలా ఉండాలో అలాగే ఉంటుంది. బల్లమీద కాల్ బెల్.]

మేనేజర్—(బెల్ వాయిస్తాడు.)

ప్యూన్—యస్ సర్ (లోపలనుంచి ప్రవేశం.)

మే—ఎవరు ఈ కార్డు పంపింది?

ప్యూన్—ఎవరో ఒక ఆయన తమర్ని చూడాలని కూచున్నాడండి.

మే—ఎంతసే పయింది?

ప్యూన్—ఒకగం టయిందండి.

మే—లోపలికి రమ్మను. పొద్దున్న లేస్తే యిదే గొడవ. ఉద్యోగం, ఉద్యోగం, ఉద్యోగం.

(తలుపుతట్టిన శబ్దం.)

మే—యస్. కమిన్...

[ప్రవేశం: కామేశ్వరరావు - సూటు వేసుకుని ఉంటాడు. ముఖంలో ఒక ఆత్రం కనిపిస్తూ ఉంటుంది.]

కామే—నమస్కారం అండి.

మే—నమస్కారం. కూర్చోండి, ఏమిటి మీరు వచ్చినపని?

కా—చిత్తం. నేను బి. యే. ఆనర్స్ ఎకనామిక్స్‌లో ప్యాసయినానండి. రెండేళ్లయింది. యూనివర్శిటీలో నాల్గవవాడుగా నిలబడ్డానండి. ఈ రెండు సంవత్సరాలనుంచి ఉద్యోగప్రయత్నం చేస్తున్నానండి. కాని యింతవరకు ఎక్కడా ఏమీ సందర్భపడలేదండి.

మే—అయితే యింతవరకు ఎక్కడా ఎక్స్‌పీరియన్స్ లేదన్నమాట.

కా—లేదండి. కాని ఏ పనిలోనైనా చేరితే ఎన్నాళ్లు పడుతుందండి నేర్చుకోవడానికి.

మే—(వేళాకోళంగా) అవును అలాగే అంటారు; అనరు మరి. ఏదోవిధంగా ఉద్యోగం దొరకడమే కావలసింది...ఏమిటి మీ సబ్జక్టు ఆనర్స్‌లో?

కా—ఎకనామిక్స్ అండి.

మా—ఎకనామిక్స్. ఎకనామిక్స్ అయితే ఏం లాభం? మేథమెటిక్స్ అవుతే ఒక మోస్తరు. కామర్స్ అవుతే యింకా మంచిది. కాకా, మీచదువు లంతా ఎందుకూ పనికిరాని చదువులు. పట్టిపుస్తకాల చదువు. అంతా థియరీయే కాని వర్కింగ్ నాలెడ్జ్ ఉండదు.

కా—కాలేజీల్లో అలాగే ఉంటుందండి తర వాత ఏ పనిలోనైనా చేరింతర్వాత మా బుద్ధిబలాన్ని, మా ఎడ్యుకేషన్ని ఆధారం చేసుకుని పనిలో తర్ఫీదు కావచ్చును, చూడండి.

మే—ఆc. అనేంతా నేను నమ్మను. ఏమిటే మీరు చదువుకున్న థియరీస్ అన్నిటి ఉపయోగం? ప్రాక్టికల్ లైఫ్‌లో ఒకటి ఏదేనా క్లిష్టసమస్య వచ్చిం దంటే దాన్ని గురించి 'వా డిలా చెప్పాడు', 'వీ డిలా చెప్పాడు', యింకో 'డిది కాదన్నాడు' అని విత ర్కించడమే కాని, అంతకన్న మీకు చేతనయ్యేది ఏమిటి? మీస్వంత ఆలోచనాశక్తిని చంపేసుకుని, మాట్లాడితే 'వాడు', 'వీడు' అనడమే గాని 'నేను యిలా అంటాను', 'నా ఆలోచన కిలా తోచింది, 'యీ పరి స్థితిలో యిది యీవిధంగా పరిష్కారం చెయ్యాలి' అనే నిర్ధారణకి చస్తే రాలేరు—ఈ కాలపు పెద్దపెద్ద చదువులు చదివినవాళ్లంతా. ఏంచదువు లివి?

కా—మీ రలా అంటే ఎలాగ? చదువు ఎక్కు వయినకొద్దీ అది ఏచదువైనాసరే, బుద్ధిబలం ఎక్కువయి, వికాసం ఎక్కువయి ఆలోచనాశక్తి ఎక్కువవుతుంది కాని, స్వతంత్రంగా ఆలోచించేశక్తి తగ్గుతుందనడం న్యాయమేనా చెప్పండి?

మే—మీ రిన్ని చెప్పండి అన్ని చెప్పండి. నా అనుభవంమీద నాకు తోచిన దేమిటంటే – ఏదేనా బాధ్యత కలిగినపనికి వెంటవెంటనే అప్పటి పరిస్థితులని బట్టి కార్యాకార్యాలు నిర్ణయించవలసిన పనులకి యీ కాలపు పెద్ద పెద్దచదువులవాళ్లు ఎందుకూ పనికిరారు. ఎందుచేతంటే, వాళ్ల చదువులవల్ల వాళ్లకున్న ప్రపంచ జ్ఞానం కాస్తా నశించిపోతుంది. ఏ ఆలోచనా తెగదు వాళ్లకి. ఇంత తక్కువపనులకి, అంటే గుమాస్తాపనులకి- వాళ్లు అసలే పనికిరారు. ఎందుచేత-పై అధికార్లు యింత చదువుకున్న వాళ్లు కాకపోవచ్చు. పూర్తిగా అనుభవం మీద కొన్ని సంగతులు గ్రహించినవాళ్లు కాబట్టి పుస్త కంలో ఎలా వున్నా ఆచరణలో యిలా వుండాలి అని వాళ్లబుద్ధికి తోస్తుంది. అలా చెయ్యమంటారు. అటు వంటిసమయంలో కిందవాళ్లు ఎలాటివాళ్లయి వుండా లంటే అదే వేదవాక్యంగా నమ్మి పనిచేసేవాళ్లయి ఉండాలి. అంతేకాని 'పుస్తకంలో యిలా ఉందే, యీయన యిలా అన్నాడే' అని వితర్కించేవాళ్లుగా ఉండకూడదు. మాకు పని జరగడమే ప్రధానం మాడండీ!

కా—ఎక్కువ చదువుకున్నవాళ్లుమాత్రం పై అధికారి 'యిలాగ' అని చెప్తితే కాదంటారండీ? మంచి కేనా, చెడ్డకేనా అధికారి చెప్పినమాటే వేదవాక్యం తక్కినవాళ్లకి...

మే—కష్టం బాబూ! అలాగని పరిపెట్టుకోడం.

కా—నే నలా నడుచుకుంటానని వాగ్దానం చేస్తున్నాను.

మే—దానికేంగాని, అసలు యిప్పుడు కాళీ లేమీ లేవు. ఏమయినా వస్తే అప్పుడు కబురుచేస్తాను.

కా—(కొంచెం దీనంగా) తమరు అనుగ్రహిం చాలి. రెండు సంవత్సరాలనుంచి ఉద్యోగం లేకుండా కూర్చోడం చాలా కష్టంగా వుంది. వెనక ఆసరాకూడా తక్కువ. మాతమ్ముడు తెచ్చిన ౫౦రూపాయలు మాకు ప్రస్తుతం ఆధారం.

మే—నిజమే, పాపం కష్టమే. ఈరోజుల్లో యీ నిరుద్యోగబాధ చాలా తీవ్రంగానేవుంది...మీకు వివాహం అయిందా?

కా—అయిందండి.

మే—పారె! పిల్లలుకూడానా?

కా—ఒక కొడుకండి.

మే—మనదేశంలో యిదొకగొప్పచిక్కు. మించి పోయినట్టు చిన్నప్పుడే పెళ్లి చేసుకోవడమూను - పిల

లని కంటూ ఉండేవాడను. నీకే తిండిలేక ఉద్యోగం లేక దేవుళ్ళాడుతూవుంటే పెళ్ళామూ పిల్లలూకూడా ఏమిటి ?...

కా—ఏదో యిప్పుడు ఏమనుకుంటే ఏంలాభం? ఎప్పుడో వెనక అయిపోయింది. కాకా, వాడు పాపం వాళ్ళేమీ భారంగా లేరు. ఉన్న దేదో వాళ్ళకూడా నాతోపాటు తింటారు; లేకపోతే నాతోపాటే పస్తుం టారు. తిరిగి, తిరిగి విసిగి చిక్కి మొగం వేసుకుని యింటికి చేరేసరికి కిలకిలలాడుతూ యిద్దరూ నా కాళ్ళని చుట్టుకుని నవ్వుతూంటే నావిచారాలన్నీ మరిచిపోతాను.

మే—ఇదంతా తిండి వున్నప్పటిమాట.

కా—(అభిమానంగా) పోనీలెండి. ఆ సంగతి యిప్పుడు మీ కెందుకు...ఏదేనా అవకాశం ఉంటే నా మాట జ్ఞాపకం ఉంచుకోమని మనవి.

మే—(హేళనగా) అహో! చాలామందిని జ్ఞాపక ముంచుకున్నాను. కొత్త పైకొచ్చినవాళ్ళ కదేపనిగా. తనచుట్టూ తిరిగేవాళ్ళని జ్ఞాపక ముంచుకోడమే.

కా—(కటువుగా) మిమ్మలిని నే నేమీ దానం ధర్మం చెయ్యమని అడగడంలేదు, పని చేయించుకుని కూలి యిమ్మని అడుగుతున్నానుగాని ... తమ రంత హేళనగా మాట్లాడవలసిన అగత్యం నా కేం కనిపించదు. మీరు పెద్దలే కావచ్చును.

మే—అబ్బో, ఎంత అభిమానం? ఇది దయా ధర్మభిక్షం కాకపోతే నా కింతమంది నుమాస్తా లెందుకు? వళ్ళు వంచి పనిచేసేవాళ్ళు పదిమంది చాలరూ? ఇప్పుడు నా ఆఫీసులో ౨౦ మంది ఉన్నారు. నువ్వు యిరవై ఒకటోవాడివి. ఈపదకొండుగురికి ఎందు కిస్తున్నాను జీతం? పోనీ పాపం పదిరాళ్ళు తిననీ మన కేం పోయింది అని; లేకపోతే రేపు వీధులో తిరగవలసినవాళ్ళేగా.

కా—మిమ్మల్ని ముష్టికని ఎవరూ ప్రార్థించరు. మీకింద పనిచేస్తున్నారు కదా అని అంత నిరసనగా చూడ నవసరంకూడా లేదు. మీ అదృష్టంకొద్దీ...

మే—(కోపంతో) అనవసరప్రసంగం మాని అవతలకి దయచెయ్యండి.— ప్యూన్!

కా—(కోపం అణుచుకుని) మీరు ప్యూన్‌ని పిలవక్కరలేదు. నేనే వెడతాను — మీ అదృష్టం కొద్దీ యీ మేనేజరుపదవి దొరికిందికదా అని తక్కిన వాళ్ళని నీచంగా మాత్రం చూడకండి. మీ పదవినికాని మిమ్మల్ని గౌరవించేవా డెవడూ లేడు మీ ఆఫీసులో. స్కూలు ఫైనలేనా ప్యాసుకానివాడికి అంతకంటె గౌరవం ఎక్కడ తెలుస్తుంది? బయటికి వస్తే మా వంటి వాళ్ళ కాలిగోరికి పోలనివాళ్ళు ఆఫీసర్లవడంతోటే కళ్ళు నెత్తికి వస్తాయికాబోలు మాఖర్మం కాలి యీరోజులు యిలా నున్నాయి కాబట్టి మీ దగ్గిర కొచ్చాం కాని...

మే—(కోపంతో) ప్యూన్!

కా—(కోపంతో) ఈకలకు ఎన్నాళ్ళో! రోజులు ఎప్పుడూ యిలాగే ఉంటా యనుకోకండి... శెలవు... (చరచరా బయటికి వెళ్ళిపోతాడు.)

ప్యూన్—(ప్రవేశం) సార్!

మే—వీడిపని యిలా కాదు - చెపుతా - చూడూ సెక్రటరీని ఆ కామేశ్వరరావు అప్లికేషను తీసుకురమ్మను.

ప్యూన్—చిత్తం (నిష్క్రమించును.)

## ౪-వ రంగం

[లోపల కామేశ్వరరావు కొడుకు ఏడుపు. రాధ చిరాకుగా కొడుకుని కోప్పడుతూ]

రా—ఎప్పుడూ వెధవగోడవ. వేపుకుతినేస్తున్నావురా నాయనా! ఏం అల్లరి ఏం అల్లరి. కాస్సేపు యిల్లు స్థిమితంగా వుంటుం దేమో అంటే, అబ్బే, ఛీ ఛీ వెధవసంత. నాన్నగా రొచ్చేవేళకే అన్నీని. పో అవతలకి.

[ప్రవేశం కామేశ్వరరావు. ఎండన పడివచ్చిన చిహ్నాలు, నిస్పృహ, ఆశాభంగం ముఖాన కన బడుతూ ఉంటాయి.]

కా—(నెమ్మదిగా) రాధా! ఏమి టది. ఎప్పుడూ ఏదో తిడుతూనే వుంటావు వాణ్ణి. వాళ్లు ఏడుపులేవో ఏడుస్తారని ఊరుకోరాదూ? నువ్వుకూడా వాళ్లతో సమానంగా...

రా—(విసుగుతో) మీ కేం తెలుసు యింట్లో ఎంత బాధపెడుతున్నారో. వెధవ దెబ్బలాటలూ, వెధవ సామాజికం. ప్రాణం విసికిపోతోంది వీళ్లతోటి.

కా—అందుకనే ఆ మేనేజరు అలాఅన్నాడు. నీ ఉద్యోగం లేకపోడానికితోడు నీకు పెళ్లాం పిల్లలూ కూడా ఏమిటని.

రా—ఏడవలేకపోయాడు. అతను బ్రహ్మచారి ముండావా డేమిటి? ఏం అడ్డొచ్చారు పెళ్లాం పిల్లలూను మీకు...అవునుగాని ఏమయింది మీ ఉద్యోగప్రయత్నం? ఏమంటాడు ఆయన...

కా—(చిరాకుగా) ఏదో అంటాడు, ఛండా లుడు. వాలుగా ఝాడించి వచ్చాను.

రా—అ దేమిటండీ—ఉద్యోగం యిస్తాడేమో అడగడానికి వెళ్లి ఆయనతో దెబ్బలాడావన్నా? బాగానే వుంది. అలాగవుతే ఉద్యోగం ఎలా యిస్తాడు?

కా—వాడు నాకు ఉద్యోగం ఎలాగా యివ్వడు. ఇచ్చినా నాకు వద్దు.

రా—అ దేమిటి మళ్లీ, యిచ్చినా వద్దూ? ఏం?

కా—వాడు స్కూల్ ఫైనలు కూడా ప్యాసయాడో లేదో వాడు—నాకు నీతులు చెప్పుతాడు.

రా—పోనీండి నీతులేగా చెపుత. విం టే తప్పే మొచ్చిందీ?

కా—అంతేనా. ఎలాగయితే ఖర్మం చాలక, తా నా ఉద్యోగంలో ఉన్నానని కళ్లు నెత్తికి వచ్చి, మిగిలినవాళ్లందరికీ తాను ఉచితంగా పాపంగదా అని జీతాలు యిస్తున్నా నంటాడు. వాడి కేమైనా బుద్ధుందా? వాడి సెక్రటరీ ఒకరోజు ఆఫీసుకి రాక పోతే ఒక్క ఉత్తరానికి జవాబు రాయడం రాదే; అలాంటిది పాపంగదా, వీళ్లు పైకి వెళ్లితే వీళ్లగతెలాగని దయ తలిచి జీతా లిస్తున్నా నంటాడు-వీడి కేమైనా కృతజ్ఞత వుందా? ఆ సమస్తాలంతా కట్టుకట్టి మానేస్తే వీడిపనేం గాను...ఏమీ కాదు లే. ౧౦ మంది మానేస్తే ఆ పనులకి ౧౦౦ మంది కాచుకుని ఉన్నారు. అందుచేతే మనం యిలా వుంటున్నాం. ఈ నిరుద్యోగం మనుష్యుల మానాన్ని అభిమానాన్ని చంపేస్తోంది. ఏదో పోనీ గదా అని ఊరు కున్నాను గాని, వాణ్ణి రెండుదవడలూ యిటూ అటూ వాయించి వద్దామా అనిపించింది.

రా—(దీనంగా) మీకు పిచ్చిగాని, అభిమానం తో బతకాలని కూచుంటేను, మానం కాపాడుకోవాలంటేను ఎలా గడుస్తుంది భుక్తి, మీ కేం తెలియదు. మీ మానం అభిమానంకోసం యింకా రెణ్ణాళ్లు యిలా వుంటే నామానం కాస్తా గంగలో కలుస్తుంది.

కా—ఏం మళ్లీ ఏమొచ్చింది?

రా—ఏ మొస్తుంది. చాతకాని సంపాదనలేని వృద్ధుడి పెళ్లాని కేం రావాలో ఆమర్యాదే వస్తుంది. ఇంటాకా గొడవంతా అదే. చిన్నపిల్లలకి సైతం నేర్చి పెట్టారు. నా కాశ్చర్యం వేస్తుంది. ఇందాకా అక్ర వెధ వంటాడూ......

ఆస లేమైందంటే మనకుర్రాడున్న, మరిదిగా రబ్బాయి ఆడుకుంటున్నారు. బాగానే వుంది, అంత వరకు. ఇంతట్లోకి కమల వాళ్లబ్బాయిని ఎందుకో పిలి చింది. కొంచెంసేపటికి లోపలికి వెళ్లి వచ్చాడు. రావ డంతోటే అదివరకు మనవాడిచేతిలో ఉన్న మోటారు బొమ్మ మాట్లాడకుండా లాక్కున్నాడు. వీడి కేం తెలుసు కుర్రకుంక; 'బొమ్మ నాకీయ్యవూ' అన్నాడుట. అప్పుడు వా డంటాడు ఆశ్చర్యంవేస్తుంది నాలుగేళ్లకుంక— "యిది నాదీ మానాన్నగారు కొనిచ్చారు. మీనాన్న గార్ని కొనివ్వమను ఉద్యోగం ఆయాక" అంటాడూ... అబ్బాయి నిలతల కిచ్చి నాలుగు వాయించాను—నాకు ఉక్రోష మొచ్చి.

కా—పిచ్చిదానవు రాధా! నువ్వు. ఏ మొచ్చింది కొడితే. వాడి కర్థమయిందా? పైపెచ్చు వాళ్లేమనుకుం టారు, వాళ్లమీద కోపంకొద్దీ కుర్రాణ్ణి కొట్టిం దను కుంటారు.

రా—అనుకోవడం ఏం, అనకే అన్నారు. ఏం తక్కువవాళ్లా ఏమిటి, మీ అమ్మగారూ కమలానూ! మాట్లాడకుండా సడీచప్పుడూ కాకుండా కమల వెళ్లి ఆవిడతో ఏం చెప్పిందో, అమ్మట్టుని నానామాటలు జాడించేశారు.

(బయటనుంచి బంట్రోతు సార్ అంటాడు.)

రా—ఎవ రది?

ప్యూన్ (బయటనుంచి) కామేశ్వరరావుగారిల్లు యిదేనాండి...(రాధ బయటికి వెళ్తుంది.)

రా—(బయటనుంచి) అవును ఏం?

ప్యూన్ — (బయటనుంచి) ఉత్తరం ఉంది ఏ. కే. బి. కంపెనీనుండి...వెళ్తానుండి.

కా—(రాధప్రవేశం ఉత్తరంతో) ఏ. కే బి. నుంచా, రాధా! ఏదీ?

రా—(సంభ్రమంతో) నేను చూస్తాను ఉద్యోగం అయిందేమో?

కా—ఇమ్పాసిబిల్! వాణ్ని అన్ని తిట్టింతర్వాత నా కింకా ఉద్యోగం యిస్తాడా?

రా—(కవరు చింపి సంతోషంతో) అవునండి. ఇదుగో "అపాయింటెడ్ ఏజ్ క్లార్క్ ఆన్ రుపీస్ ఫిఫ్టీటు జాయిన్ ఫోర్త్‌విత్" (వేళాకోళంగా) యింకేం తిట్టి సంపాయించారు మీరు, మీ స్నేహితుడు లంచమిచ్చి సంపాయిస్తే...

కా—ఈ ఉద్యోగం నేను చేసినప్పుడుకదా.

రా—(చకితురాలై) అదేమిటి మళ్లీని—ఏదో ఉద్యోగం వచ్చిందిగదా అని నేను సంతోషిస్తూ ఉంటే.

కా—(సావధానంగా) కొంచెం ఆలోచించు రాధా! నాతో అంతనీచంగా మాట్లాడినవాడిదగ్గిర మళ్లీ ఉద్యోగం చెయ్యమంటావు. ఆ, వాడిదయాధర్మ భిక్షం ఆశించమంటావా? నేను చెయ్యను వాడికింద ఉద్యోగం.

రా—పోనిద్దురూ ఊరికేను...ఏదో మనస్సులో పెట్టుకుని గౌరవం, అభిమానం, మానం అని కూచుంటారు. దయాధర్మభిక్షం అవగానే అది దయాధర్మభిక్ష మయిపోయిం దేమిటి? అతను ఏమంటే మీకేం? మీ మనస్సుకు సమాధానం అయితే చాలదూ. పనిచేస్తారు. జీతం సంపాదిస్తారు. అంతేకాక ప్రతిదానికీ శంకలు పెట్టుకు కూర్చుంటే ఎలాగ?

కా—నువ్వు అట్టేదూరం ఆలోచించలేదు. అంత నీచమయిన మనసు కలవాడు ఎంతయినా చెయ్యడానికి సాహసించేవాడే. నా కిదంతా ఒకపన్నుగడగా తోస్తోంది.

రా—మీ కన్నీ విపరీతానుమానాలే పోనిద్దురూ.

కా—కాదు నాచేత అన్ని మాటలు పడి, అంత నీచమయిన మనస్సు కలవాడు ఊరికే ఉండలేడు. చూశావుగా మనిషి తరహా. తగని అహంభావంగల మనిషి. రేపు నాకు ఉద్యోగం యిచ్చి, నా అసహాయతని ఆధారంగా చేసుకుని నన్ను రాచిరంపాన్ని పెట్టి అవమానిద్దామని ఊహ. నేను స్వతంత్రుణ్ణిగా ఉండగా యీ ఆటలు సాగవు. అందుకు యీ ఎత్తు. ఏదో వంకని నన్ను ఆతర్వాత డిస్మిస్ చేసి... చూశావా, నీ వంటివాళ్లను పదిమందిని ఆదరించగలను, పదిమందిని తగిలెయ్యగలనని నన్ను చెప్పాలి. పాపం వెర్రివాడు. — ఈ కామేశ్వరరావు యీ మాత్రం గ్రహించలేనివాడుకాదు. నీకంటె అహంభావం ఎక్కువ వుంది. నీ తరంగాదు నన్ను వంచడానికి. నీ లెక్కేమిటి నాకు - నీ ఉద్యోగం ఎవడికి కావాలి.

(తల్లి ప్రవేశం.)

త—ఏమిటిరా అబ్బాయ్. ఎవరితో మాట్లాడుతున్నావు?

కా—ఏమీ లేదమ్మా - ఎవరితోనూ కాదు మాట్లాడుతూంట.

త—(కోపంతో) పోనీలే నాయనా చెప్పకు నా కెందుకు. తెలిసి తక్కువదాన్ని గనక అడిగాను-

కా—ఎందుకమ్మా అంతకోపం యింతట్లోకేని

త—కోపంకూడా ఎందుకు నాయనా. ఆబంట్రో లేదో ఉద్యోగం వచ్చింది అని చెపితే పోనీఅని ఆశకొద్దీ అడిగాను...

కా—నిజమే. ఏ.కే.బి. కంపెనీలో ౫౦రూపాయల ఉద్యోగం. గుమాస్తాపని యిస్తా మన్నారు. కాని నాకు యిష్టం లేదు.

త—ఏం! ఎందు కిష్టంలేదు. రు. ౫౦. లు చేదా ...మహారాజులా ఉద్యోగం చెయ్యడానికేం?

కా—అది కాదమ్మా నీకు తెలియదు. నాకూ ఆ మేనేజరుకి పెద్ద దెబ్బలాటయింది మొన్న. ఆకసి కొద్దీ ఏం చెయ్యలేక నా కీ ఉద్యోగం యిచ్చి నన్ను అవమానించి డిసిప్లిన్ చెయ్యడానికి ఈ ఎత్తంతాను.

త—(వెటకారంగా) బాగుంది నాయనా! యిష్టంలేకపోతే ఎన్నైనా కారణాలు దొరుకుతాయి. అసలు నీకు ఉద్యోగం చెయ్యాలనివుంటే ఏ ఉద్యోగం దొరక్కుండా ఉంటుందా ఏమిటి. ఎందుకు వెధవ ఉద్యోగం...రోజులు గడిచిపోతున్నాయిగా పోయిగా.

కా—ఏం మాట లంటావమ్మా. నాకుమాత్రం యింట్లో కూర్చోడం బాగుందనా. అడ్డమైనవాళ్ల చుట్టూ తిరుగుతున్నాను. నానామాటలు పడుతున్నాను. ఎండనక కొండనక తిరుగుతున్నాను. ఏం చెయ్యను.

త—ఏం చెయ్యను? వెళ్లి నవాళ్లందరిదగ్గిరా కాస్సేపు కబుర్లు చెప్పడం, కాస్త కాఫీ తాగడం, అంతేనా? అసలూ అయిది పట్టుదల ఉండాలి. ఏ ఉద్యోగమవు తేసేం సంపాదించుకోవాలి, మగాడయిన తరవాత. ప్రతిదానికీ ఏదో ట్రాం పొడుస్తావుంటే...వెళ్లి ఆ హోద్దు మాస్టరును చూడ్డానికి పనికిరాదు. అది చిన్న ఉద్యోగంట. మనదర్జాకి తగదు. పోనీ ఏదేనా రెండు డబ్బులు ముట్టచెపితే...ఏదేనా సంపర్ఛపడుతుందేమో అంటే...న్యాయం...అన్యాయం...నీచం...నా శ్రాద్ధం. కుర్రకుంక తెచ్చిపెడుతూంటే తినడం. ఏమిటో ...ఏమన్నా అంటే అన్న వాళ్లతో దెబ్బలాట......

కా—అమ్మా! ను వ్వన్నను. నేనుమాత్రం నా ఉద్యోగంకోసం నీచంగా ప్రవర్తించలేను. నా అభిమానాన్ని చంపుకోనూలేను ... రామం సంపాదిస్తూంటే నేను తింటూకూచున్నానని నీకే కాదు నీకంటె వెయ్యిరెట్లు నాకూ కష్టంగానే ఉంది. ఎందుకు అనవసరంగా మాట లంటావు. రేపు నేను మదరాసుకు వెళుతున్నాను. అక్కడ నాతంటాలు నే పడతాను. మళ్లీ ఏదేనా సంపాదించేదాకా మీకంటికి కనపడను...మీదారి మీది, నాదారి నాది...

త—చూడబోతే అహంకారం జాస్తి. అప్రయోజకులకి అహంకారం అని...వెళ్లు ఉద్ధరిస్తావా? పోనీ, ఆవిధంగానేనా ఉద్యోగం సంపాదిస్తే చూద్దాం. అక్కడ యింకా ఎంతమందితో దెబ్బలాడాలో... వెళ్లు నాయనా! వెళ్లు...(వెటకారంగా) అన్నట్టు యీ విషగారో పుట్టింటి కెడుతుందా?

కా—ఆ గొడవ నీకెందుకులే. ఇక్కడుండదు. అంతేగా నీకు కావలసింది.

[మాట్లడుతూండగానే తల్లి వెళ్లిపోతుంది. కామేశ్వరరావు, రాధ ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు సాభిప్రాయంగా.]

## ౫-వ రంగం

[కామేశ్వరరావు, రాధ తమగదిలో బట్టలు సర్దుకుంటూ ఉంటారు. రామం ప్రవేశం. రాధ మరిదిగారు రావడంతో బయటికి వెళ్లిపోతుంది.]

రా—అవును గాని ఏమిటీ అర్ధాంతరపు ప్రయాణం. ఈ ఉళ్లోకంటె మద్రాసులో ఎక్కువ అవకాశా లుంటాయనా? కాకా, యింకా కొంచెం యిక్కడే ఉండి ప్రయత్నం చేస్తే ఉద్యోగం దొరకకేం చేస్తుంది?

కామే—నీకు తెలియదు రామం! నావంటి వాడికి ఉద్యోగం దొరకడం ఎంత కష్టమో నీకు తెలి

యను. ఇంతచదువూ చదివి ఏదో చిన్న గుమాస్తా గిరీలో ప్రవేశించడం నా కిష్టంలేదు. ఉద్యోగం లేకుండా యింట్లో నువ్వు సంపాదిస్తూంటే తింటూ కూర్చోడం అసలే యిష్టంలేదు...

రామ—ఆ మాటంటేనే నాకు కష్టంగా ఉంటుంది. నేను సంపాదిస్తున్నాను, నువ్వు తింటున్నావు, అనుకోవడం ఎందుకు. ఏదో మనకుటుంబానికి యింత ఆదాయం వస్తోంది. ఇంతవంటిమి తింటున్నాము. అంతే. నువ్వు సంపాదిస్తే నేను తినకూడదా, నేను సంపాదిస్తే నువ్వు తినకూడదా? ఆ భేదా ఉండడం నా కేం బాగా లేదు.

కా—నీకూ నాకూ బాగుంటే సరా, పైవాళ్లు ఏమనుకుంటారు— నిరుద్యోగినై యింట్లో కూర్చుంటే. చాతకానివాణ్ణా? కాలూ చెయ్యీ వంకరుండి, పరాధీనంగా బతకవలసివస్తే సరే, మనం ఏమీ చెయ్యలేము. కాని స్వతంత్రంగా...

రామ—మళ్లీ ఆ మాటేనా!...

కా—నీకు తెలియదు రామం! మనం మొగాళ్లం ఎంత సరిపెట్టుకున్నా ఆడవాళ్లల్లో మనస్పర్థ లుండక మానవు. ఇవన్నీ ఆలోచించే నేను కొన్నాళ్లపాటు మద్రాస్‌లో ఉంటే ఏదేనా గట్టిప్రయత్నంచేసి ఉద్యోగం సంపాదించా లనుకుంటున్నాను. అది నీమీద ఏమీ కోపంచేతా కాదు, నువ్వన్నేమీ అవమానించావనీ కాదు. నాది చాలా సున్నితమైన మనస్సు. నా మూలాన్ని ఎవరికి ఏమి బాధ కలిగిపోతుందో అని ముందే నేను విచారిస్తూంటా. ఏం చెయ్యను. అంచేత నన్నేమీ అనుకోవద్దు.

రామం—అయితే యిక నే నేం చెప్పనుమరి. మనస్ఫూర్తిగా చెపుతున్నాను. నువ్వు యిప్పుడు మద్రాస్ వెళ్లడం నా కేమీ సమ్మతంగా లేదు. పోనీ ఒదిన్నీ పిల్లల్నీ నా యిక్కడుంచకూడదూ? నీతో వాళ్లు కూడా అక్కడ అవస్థపడ్డం ఎందుకు!

కా—అది నా చేతుల్లో లేదు. నాకంటే నీవదినే ముందంజవేస్తోంది. నిన్నరాత్రి తన నగలన్నీ తీసి నా చేతులో పెట్టి "యివి నావి కావు, మీవే, మీ యిష్టం వచ్చినట్టు వీటిని వినియోగించి ఉద్యోగం సంపాదించండి. కాని ఒక్కటే కోరిక; మీరు ఎక్కడున్నా ఏం కష్టసుఖా లనుభవిస్తున్నా మీతో తప్ప నే నెక్కడా ఉండను" అని కళ్లమ్మట నీ ళ్లెట్టుకుంది. పోనీ మంచో చెడ్డో నాతోనే ఉంటారు వాళ్లు. ఇంకెక్కైన భగవంతు డున్నాడు. నేను యిలా చేస్తున్నానని నువ్వేమీ కించపడకు.

రామం—అయితే యింక నే నేం చెప్పను మరి. నీ అడ్రెస్ ఎక్కడ చెన్నపట్నంలో?

కా—ఏమో యింకా నాకూ తెలియదు. కేరాఫ్ పోస్ట్‌మాస్టర్, ట్రిప్లికేన్—యిప్పటికట్లాగు.

రా—సరే, నీ యిష్టం. అప్పు డప్పుడు ఉత్తరం మాత్రం వ్రాస్తూండు. నాఆఫీసుకి టయిమ్ అయింది— వెళ్తున్నాను.

కా—వెళ్లిరా. నేను మధ్యాహ్నం బండికి వెళ్లుతున్నాను.

రా—సరే మరి.

(నిష్క్రమించును.)

## ౬-వ రంగం

[మద్రాస్‌లో ట్రిప్లికేనులో, చిన్నసందులో యిల్లు. వీధి చాలా అశుభ్రంగా ఉంటుంది. యిళ్లు అన్నీ నేలమట్టానికి ఉంటాయి. అదీ కామేశ్వరరావు బస. వీధిలో ఒకగది. ఇంటి లోపలిభాగంలో వంటిల్లు. వీధిగదిలో ఒక చాప. ఒక ట్రంకుపెట్టి, కొన్నిబట్టలు తాడుని వేలాడుతూ ఉంటాయి. కామేశ్వరరావు, రాధ. కామేశ్వరరావు అప్పుడే తిరిగి తిరిగి వచ్చి ఉంటాడు. చాలా చిక్కిపోయి ఉంటాడు.

రాధ—మాసిన చీర, చాలా చిక్కిపోయిన ముఖం విచారగ్రస్తురాలయి ఉన్నట్టుగా ఉంటుంది.]

కా—రెణ్ణెల్లైంది యివాళ్టికి మనం యీ వూరొచ్చి. ఏమిటి మనకి కలిసివచ్చింది. నీ వంటినివున్న నగలు ఒకటొకటే కనశేరుతున్నాయి. ఉద్యోగం దొరికే ఎత్తుమాత్రం కనబడదు. అబ్బ! తిరగలేక తిరగలేక కాళ్లు పడిపోతున్నాయి. ఎండనక వాననక అడ్డమైన వాళ్ల చుట్టూ తిరిగి తిరిగి విసిగిపోతున్నాను. ఎప్పటికేనా యీ అవస్థ తప్పేనా అనిపిస్తుంది.

రా—పోనీ ఖర్చులో ఖర్చు — ఎక్కడికేనా వెళ్లేటప్పుడు బస్ మీదో ట్రామ్ మీదో వెడితేం? రోజూ యిలా ఊరంతా తిరుగుతూ సరిగా తిండేనా లేకపోతే పడెయ్యదూ? ఇక్కడ అదికూడా అయితే యింక చెప్పక్కరలేదు. ఈ బాధల్లో నయినా ఏదో నలుగురూ కులాసాగా ఉన్నాం కాబట్టి ఏకలో గంజో తాగినా కాలక్షేపం అవుతోంది. యీ అవస్థలకి సాయం...

కా—జీవితం తిన్నగా చూస్తే అన్నీ సవ్యంగానే ఉంటాయి. ఏది మన చేతుల్లో ఉంది చెప్పు? మనుష్యుడు ఎప్పుడూ తనకు చాతనయినంతవరకు ప్రయత్నం చెయ్యాలి. దాని ఫలాఫలాలు దైవాధీనాలు. ఇంతవరకు మన జీవితం సవ్యంగా నడిచింది అంతవరకు మనం అదృష్టవంతులమనే చెప్పాలి.

రా—నిజమే! లేకపోతే—ఎవరు మాలిగినా ఏమున్నా ఉందా ఆధారం యిక్కడ? అంగబలం అర్థబలంకూడా లేదాయను. అబ్బ, ఆ మాట తలుచుకుంటే కూడా వళ్లు జలదరిస్తుంది. నిజంగా ఒక్కొక్కప్పుడు మిమ్మల్ని చూస్తే భయంవేస్తుంది. అప్పటికీ యిప్పటికీ ఎంత మారిపోయారో? తెలుసునా. నేను కాపురానికొచ్చేటప్పటికి — అప్పటిదాకా ఎందుకు మొన్న మీరు పరీక్షప్యాసయి టీపార్టీ యిచ్చారే అప్పుడు చూసినవాళ్లు మిమ్మల్ని యిప్పుడు చూస్తే ఆ మనిషేనా యీ మనిషి అనిపిస్తుంది. శల్యంలా అయిపోయారు. ఈ రెండేళ్లలో ౧౦ ఏళ్లు పెద్దవా రయ్యారు.

కా—మనిషికి వయస్సు కాదు రాధా! ముసలితనాన్ని తెచ్చేది, మనోవ్యథలు. తిని తిన్నగా యింటి దగ్గర కూచుని హాయిగా చీకూచింతా లేకుండా ఉన్నవాళ్లు ఎంతయినా డెబ్బయినా మంచి యౌవనంలో ఉన్నట్టే ఉంటారు. అసలు మాకు చదువులే ఒకపీడ. చదివి చదివి మనస్సుని అరగదీశేసిన తర్వాత యింక మనిషి ఎలా ఉంటాడు....

రా—దానికి తోడు యీ ఉద్యోగం బాధలాయెను.

కా—నిజంగా యీ బాధ అన్నిటిని మించుతుంది. నువ్వు ఇమేజిన్ చెయ్యగలేనా చెయ్యలేవు. ఇంటిదగ్గర ఉన్నన్నాళ్లు మబ్బులమీద ఉన్నట్టుగా ఉండేది. ఇంత అస్వతంత్రపు బతుకా అనిపించేది. పాపం, రామానికేం ఉన్నట్టుగా ఉండేదికాదు.

రా—నిజంగా మరిదిగారు చాలా యోగ్యులు. తాను సంపాదిస్తున్నానని గాని కళ్లంతా తింటున్నారనిగాని ఏమీ లేశలేదు పాపం. మనం యిక్కడికి వచ్చేయడం ఎంతమాత్రం యిష్టంలేదు. నాతోకూడా తరవాత చెప్పారు. ఆఖరికి నన్నూ కుర్రాన్నైనా ఉండమని బతిమాలారు.

కా—అవును పాపం- నువ్విక్కడికి నాతో రావడము నాకూ యిష్టంలేదు. కాని నీబాధ పడలేక తీసుకు వచ్చాను. ఏం సుఖం యిక్కడ. ఒకపూట తిండి వుంటే రెండోపూట లేనిరోజులుకూడా వస్తాయి త్వరలోనే. ఎందుకు నాతో నువ్వూ పిల్లలూ యింత బాధపడాలి?

రా—ఈ బాధ ఎవరు పడాలి? ఎవరికోసం పడాలి? నేను లేకపోతే మీ ఒక్క పొట్టకి భుక్తి గడవకపోతుందా? మీకు యీ పెంటంతా లేకపోతే ఏ బాధా లేదుగా. మాకోసం మీరు బాధపడుతూ ఉంటే మేము ఏమొహమేసుకుని కులుకుతూ యింటిదగ్గిర కూర్చుని తింటూంటాం?

కా—ఉద్యోగం ఏదేనా వచ్చిందాకానైనా? కొంచెం ఎక్కడో కాలక్షేపం చెయ్యకూడదూ, ఎందుకీ అవస్థంతా.

రా—ఆడవాళ్లని మీ రర్థంచేసుకోలేదు. అది సుఖం అనుకుంటూన్నారా? అందులో మనిల్లంటి ఇంట్లో ఉండడం రామ రామ...

tion?—yes...yes, Triplicane—you know my house......yes......that corner house...... straight away, yes. Thanks awfully - bye, bye."

## ౭-వ రంగం

[ఐసొలేషన్ హాస్పిటల్. దూరాన్న మంచం మీద కామేశ్వరరావుకొడుకు ప్రాణావశిష్టుడై ఉంటాడు. మనభోరణి లేదు. ౧౦ గజాల దూరంలో డాక్టరు, కామేశ్వరరావు; రాధ కొంచెం వెనకగా]

కా—(ఆత్రంగా) డాక్టరుగారూ! ఏం ఎలా వుంది ?

డా—డెఫినిట్ కేస్ ఆఫ్ మెనింజైటిస్. చెప్పలేం. ఫైనల్ స్టేజెస్‌లోకి వచ్చేసినట్టుంది.

రా—(భయపడుతూ) ఏమిటీ ?

డా—ఏమీ లేదమ్మా. కేసు చాలా గడ్డయినకేసు. మీ అదృష్టం ఎలా వుంటుందో. ఇంతవరకూ వచ్చాక—నూటికి ఒకటి రెండు బతకడం. ఏం చెప్పమంటారు.

రా—(కన్నీళ్లు కారుస్తూ) అయ్యో! అయ్యో! ఇం కాళ్ళ లేనట్టైనా. ఇందుకేనా నే నీవూరొస్త. ఏడీ ఏడీ మా వాయ నేడీ.

[కొడుకు పడుకున్న మంచంకేసి పరిగెత్తుతుంది. డాక్టరు వారిస్తాడు.]

డా—అమ్మా! ఉండండి ఉండండి. మీ రా మంచందగ్గిరకి వెళ్లకూడదు. చాలా అంటుజాడ్యం. తొందరపడకండి.

కా—(బాధతో, ఉద్రేకంతో) ఎందుకు తొందర. సంఘం నామీద కసితీర్చుకుంటోంది. తీర్చుకోనీ. ఇంతకంటె ఏం చెయ్యగలదు? అడ్డమైనవాళ్ల దగ్గిరా నీదఆర్పులు ఆర్పించింది. నానామాటలు అనిపించింది. నాశరీరానికి, నామనస్సుకి, నా ఆత్మకికూడా తగని బాధ కలిగించింది. నాతోపాటు, నా పెళ్లాం బిడ్డలని బాధపెట్టింది. చివరకి, చివరకి నాకొడుకుని బలి తీసుకుంది. ఇంతకంటె ఏం చేస్తుంది.

రా—(ఏడుస్తూ, రొమ్ము బాదుకొంటూ) నాన్నా! నాన్నా...

డా—అమ్మా...యిక్కడ మీరు విచారించకూడదు. ఇప్పుడే ఆఖరుమాపు. ఇంక దహనకృత్యాలకికూడా అవకాశాన్ని మీకివ్వరు. అంత అంటుజాడ్యం యిది. నాతో రండి యింటికి తీసుకువెళతాను. కామేశ్వరరావుగారూ...

[ఒకనర్సు వచ్చి రాధను అవతలకితీసుకువెళ్తుంది.]

కా—(విచారంతో కళ్లనీళ్లతో) ఇం కేముంది యిక్కడ...అంతా అయిపోయింది. ఇందుకా యిక్కడికి వస్త (ఏడుస్తూ); రాధా! నాఉద్యోగానికి, యీ పాడుశరీరాన్ని పోషించుకోడానికీ నీవంటిమీదినగలు యిచ్చావు. నీశరీరంలోంచి కోసి నీకొడుకుని యిచ్చావు. (పిచ్చిగా) ఉద్యోగం...ఉద్యోగం...నాకు మతిపోతోంది. (దీనంగా) డాక్టరు... డాక్టరు... మీరు కొంచెం వివరూ నాబాధ వినరూ ?

డా—కామేశ్వరరావుగారూ......... మీరు కొంచెం విశ్రాంతి తీసుకోవాలి...మీకు యిప్పుడు మతి చలించి పోతోంది.

కా—(బాధతో, ఏడుపుతో) అబ్బ...తలనొప్పి ...రామా... నువ్వు చెప్పినప్పుడు విన్నా గాను. ఏమిటో గౌరవంగా బతికాలి అభిమానం చంపుకుని ఎలాగ నైనా ఉద్యోగం చెయ్యాలని, బింకంమీద యిక్కడికి వచ్చాను. ...అంతేకాని యిక్కడ నాకొడుకుని బలియివ్వడానికి వచ్చాననుకోలేదు...నాన్నా! నాన్నా...

[వెక్కి వెక్కి ఏడుస్తాడు].

[ఇంతలో పైన కారు ఆగిన చప్పుడు. అందులో నుంచి దిగి ఒక్క దుముకులో కామేశ్వరరావుతల్లి వచ్చి కామేశ్వరరావుని కౌగలించుకుని ఏడుస్తూ]

తల్లి—అన్యాయ్య ... టెలిగ్రాం చూశాగాని యింతపనైం దనుకోలేదురా నాయనా! ఎంతపని జరిగిందిరా బాబూ! ఏదో పోనీ...ఏదో ఉద్యోగం దొరుకుతుంది, పోనీ, చన్నీళ్లకి వేన్నీళ్లు సాయమవుతా యనుకున్నానుగాని యిలా గవుతుందనుకోలేదురా నాతండ్రీ!

కా—(పిచ్చి కేకలు వేస్తూ) నాకు ఉద్యోగం కావాలి...కావాలి. నా కొడుకును, నా శరీరాన్ని బలి యిచ్చాను. లంచం మాత్రం కాదు. బలి.. నరబలి... యీనిరుద్యోగ మనేరాక్షసికి బలి .. బలి .. బలి కావాలెం..

[బయటికి వెళ్లిపోతాడు.]

డా—అమ్మా...యీయన యింక యిక్కడుంటే పిచ్చెత్తుతుందేమో, వెంటనే తీసుకోపోవాలి. మీవూరు తీసుకెళ్లండి. కొంతకాలానికైనా మరిచిపోతారేమో...

తల్లి—(విచారంతో)అలాగే నాయనా...యివాళ రాత్రి మెయిల్లో వెళ్లిపోతాం, యిం కెందుకు — మా కోడలేదీ.

డా—పాపం ఆవిడ చాలా నీరసంచేత సొమ్మసిలి పడిపోయింది. నర్సు నిచ్చి యింటికి కారులో పంపేశాను.

తల్లి— మంచిది బాబూ! శలవు. అయ్యో, నాయనా! యిక్కణ్ణుంచి యీమోస్తరుగా వెడతా వనుకోలేదు. రా! నాయనా...

[మెల్లిగా ఏడుస్తూ బయటికి వెళ్లిపోతుంది.]

## ౮-వ రంగం

[కాకినాడలో వాళ్ల యింటి అరుగుమీద: కామేశ్వరరావు. ఒక చిరుగుల చొక్కా. గెడ్డం కొంచెం మాసి ఉంటుంది. అరుగుమీద మకాం వేసుకుని కూర్చుంటాడు, వీధంట పోయే వాళ్లని పిలుస్తూ. ముఖంలో ఒకవిధమయిన పిచ్చికళ.]

కా—నానాయనకి ఉద్యోగం అయింది. వెళ్లిపోయాడు. నాకూ ఆర్డర్సు వస్తాయి, వెళ్లాలి నేనూను. వెధవలు యిక్కడి విధవలికి.. అన్నీ అడ్డులే...లంచాలు కావాలి...నే నివ్వను...నరబలి కావాలి... రాక్షసులు...నేను చస్తే ఉద్యోగం చెయ్యను ఆవెధవ కింద...ఎంత అహంభావం...నాకు ఉద్యోగం యిచ్చి డిస్మిస్ చేద్దామని (వికారంగా నవ్వు) ... అహహ్హా ...నా కక్కర్లేదు ఉద్యోగం...పైన ఉంది నా ఉద్యోగం...అక్కడ నేనే లక్షమంది కిస్తా...నాతల కిం దెట్టుకుని పడుకుంటా నాడిగ్రీ...మా రాజ్యంలో అందరికీ ఉద్యోగాలే, (కోపంతో) ఆ మేనేజరుకి తప్ప. హెడ్మాస్టరుకి లేదు.. (జాలిగా) పాపం... ఉద్యోగాలులేక ఎంతమంది మాడుతున్నారో యీ లోకంలో ... మారాజ్యంలో అలాంటివాళ్లందరికీ ఉద్యోగాలే. మా నాయన కిచ్చాం... మేం వెళ్లిపోతున్నాం ...(రోడ్డుమీద వాళ్లవైపు చూస్తూ) ఏయ్ ఎవ రక్కడ...యిక్కడ ఉద్యోగా లిస్తారని చెప్పు. ఏమండోయి, మీ కుద్యోగం కావాలా? రండి పాపం మీరంతా పరీక్షలు ప్యాసయారు. బాధపడుతున్నారు......అహహహ్హా......

[వికటంగా నవ్వుతాడు.]

[రోడ్డుమీద నడిచేయిద్దరు పెద్దమనుష్యులు]

ఒకటవ—ఎవరోయి అతనూ?...

రెండవ—అదేమిటి? ఎరగవూ, కామేశ్వరరావు. పాపం, ఎంత తెలివైనవా డనుకున్నావ్. ఆనర్సు ఫస్ట్ ఇన్ ది ప్రెసిడెన్సీగా ప్యాసయాడు. కాని అబ్బా యీవెధవ అన్ఎంప్లాయ్మెంటు ఎంతటివాళ్లని ఎలా చేసేస్తోందో చూశావు. పాపం మతి చెడిపోయింది. నానాబాధలు పడ్డాడు...చివరకి కొడుకు మెనింజైటిస్తో చచ్చిపోయాడు. దాంతో పిచ్చెత్తిపోయింది.

ఒకటవ—పాపం.........

కా—(ఆలోచనగా) ఆశ్చర్యంవేస్తుంది రాధా! అమ్మకూడా అంతకఠినంగా నిర్దాక్షిణ్యంగా ఉంటుందని, అంతనిరసనగా చూస్తుందని నేను కలలోనేనా అనుకోలేదు. ఆడవాళ్లలో ఆడవాళ్లు తగవులాడుకుంటూ ఉండటం మనకుటుంబాలలో సహజమే. అందులో ఒక్కడే సంపాదనపరుడవుతే చెప్పనే అక్కర్లేదు. "నీకేం అమ్మా, మీ ఆయన సంపాదిస్తున్నాడు" అని దెప్పేనా వస్తుంది, లేకపోతే "ఏపనీ పాటు లేకుండా తినికూచునేవాళ్లకి" అని అవతలపక్క నించి సాధింపేనా వస్తుంది - అమ్మలక్కల్లో.

రా—పాడు ఆడజాతి ఎప్పుడూ యింతే. అందుకే ఎవరో అనుభవజ్ఞులు ఊరికే అన్నారా—33 జుట్టుముళ్లు యిమడుతాయిగాని, 3 కొప్పులు యిమడవనీ?...పోనిద్దురూ, మనకాబాధ లేమీ లేకుండా హాయిగా ఉన్నాం.

కా—ఎన్నాళ్లు? నీవంటిమీద నగ లయిపోయేదాకానేనా?

రా—ఇంకో నెల గడుస్తుంది— ఆతరవాత మా రెండుకు. ఈలోపుగా ఏ ఉద్యోగమేనా అవులే...

కా—ఏమో? ఆసూచన లేమీ కనబడవు. మొన్న ఆఫీసు సూపరింటెండెంటుని చూడ్డానికి వెళ్లాను. "తెలుగువాడవా" అని అడిగాడు. అప్పుడే అనుకున్నాను లాభంలేదని. అంతే అయింది. హైస్కూల్లో ఏమన్నా ఖాళీ లున్నాయేమో అని తిరిగాను. ఎక్కడే నా వుంటే "నువ్వు బ్రాహ్మడవు. నీకు ఎలా యివ్వను" అని ప్రైవేటుగా చెపుతాడు. మీటింగులో పెట్టినపుడు ఎక్స్పీరియన్స్ లేదు అని కొట్టేస్తారు. నా కంఠ కంఠకి మతి పోతోంది.

రా—అవునుగాని మీరు కూడా అధైర్యపడితే ఎలాగ?

కా—(ఉద్రేకంతో) నామనస్సులో బాధ నీకు తెలియడంలేదు. నేను ఏం చేశానని యీ సంఘం నన్నిలా బాధపెడుతోందో నాకు అర్థంకావడంలేదు. పొట్టకోస్తే అక్షరంముక్క లేనివాడు మోటారుకారులో తిరుగుతూంటే ఎంత ఉక్రోషంగా ఉంటుందో తెలుసా. ఒక్కొక్కప్పుడు అనుకుంటాను. వీడవాళ్లు హత్యలు చేశారంటేను, దొంగతనాలు చేశారంటేను వాళ్లది కాదు తప్పు అనిపిస్తుంది. సంఘమే వాళ్లని దోషులుగా చేసింది. పిల్లపాపలకి పెళ్లాలకి తిండిలేక మాడుతూంటే చూస్తూవున్న మగవాడు ఏపనికి వడికట్టుకోడు...అన్నట్టు కుర్రాడు ఏడి?

రా—కుర్రాడేమిటో తలకాయ నొప్పి, మెడలు కొంచెం లాగుతున్నాయి అని పడుకున్నాడు. కొంచెం వొళ్లు వెచ్చగా ఉన్నట్టుంది. ఇప్పుడెలావుందో-నేడేమో-నిద్రపట్టింది కాబోలు. కాని చాలసేపయింది. చూసివస్తాను...ఆ వంటింటి వసారాలో పడుకొన్నాడు, లోపల పడుకోపెట్టాలి.

[నిష్క్రమించును.]

కా—ఛీ. వెధవప్రపంచం. దయాదాక్షిణ్యాలు లేని ప్రపంచం. కొంతమంది తిండిలేక మల మల మాడుతూంటే యింకా కొంతమంది తమకున్న డబ్బును ఖర్చుచెయ్యడానికి మార్గాలు తెలియక దేవుళ్లాడుతుంటారు—ఏ కుక్కలకో, గుర్రప్పందాలకో, లేకపోతే భోగంవాళ్లకో తగలేస్తూ. పొట్టకోస్తే అక్షరం ముక్కలేనివాళ్లంతా ఘనులున్ను. చచ్చి చెడి చదివి ఏదో మహా పొడిచేద్దా మనుకుని పెద్దపెద్ద ఆశయాలు పెట్టుకుని బాధపడే యువకులు తిండిలేక మాడుకుంటారు. కలియుగధర్మం. విద్యకి గౌరవంలేదు. డబ్బుంటేచాలు ప్రపంచకంలో చలామణీ అవడానికి.

[రాధ కొంచెందిగులు పడుతూ ప్రవేశిస్తుంది.]

ఏం ఎలా వుంది, లేచాడా?

రా—లేవలేదు. పలకరిస్తే పలకలేదు. కాని చాలా బాధపడుతూ ఉన్నట్టు కనిపిస్తాడండి. ఏదేనా మందు వేస్తే కాని...

కా—పోనీ, డాక్టరుని పిలుచుకురానా?

రా—వద్దొద్దు. రేపు యింకా నా మెళ్లో గొలుసొకటే తాకట్టుపెట్టో అమ్మేసో ఏ ఐదురూపాయలేనా తెచ్చుకుంటే...

కా—రే పిక్వద్ఘ్రలెద్దు డబ్బు. తీసుకొస్తాను. తలకాయనొప్పి, వొళ్లు వెచ్చగావుంది అన్నావు, భయం వేస్తోంది నాకు. నే వెళ్లుకున్నా.

[పైమీద తువాలు వేసుకుని బయటికి వెడతాడు.]

రా—వెళ్లిరండి—(విచారంతో) ఇదేం ఖర్మం బాబూ! అంతా తిన్నగా ఉన్నారనుకుంటే, ఇ దెక్కడొచ్చిపడింది. అంతా కులాసాగాఉంటే వెంకటేశ్వర స్వామీ, తండ్రీ! నీకు మళ్లీశనివారం దీపారాధన చేసుకుంటా. రక్షించు బాబూ!

[కామేశ్వరరావు వివర్ణమయిన ముఖంతో డాక్టరుతో ప్రవేశం.]

కా—పొద్దుణ్ణుంచీ తలకాయనొప్పి అని అంటున్నాదుట. ఇంతవర కేం తగ్గినట్టు కనబడదు. కొంచెం చూసి ఏదేనా...

డా—ఎక్కడ. ఈ అమ్మాయేనా... (నిదానించి చూసి) ఊఁ! మొట్టమొదట తలకాయనొప్పి అని చెప్పి ఎంతసే పయింది?

కా—(రాధవైపు తిరిగి) ఎప్పుడు తలకాయనొప్పంట ?

రా—(తలుపువెనకనించి) నిన్న రాత్రే అన్నాదు కాని యీవాళ పొద్దున్నుంచి ఎక్కువయి మెడల్లాగడం అవీ కనబడ్డాయి — వొళ్లు ఇప్పుడు బాగా వెచ్చగా ఉంది.

కా—ఏమి టంటారు?

డా—ఆమెడలు లాగడం అట్టే మంచిదికాదు. సరే, ఎందుకేనా మంచిది, హాస్పిటల్ కి ఫోన్ చెయ్యండి. హాస్పిటల్ లో అడ్మిట్ చేస్తే మంచిది... నే కబురుచేస్తాలెండి. పోనీ...మీరుమాత్రం ఎవరినీ దగ్గిరకి వెళ్లనివ్వకండి. ఎందుకేనా మంచిది.

కా—(కొంచెం అనుమానంగా) అయితే యిది

............

డా—నాకూ మెనింజైటిస్ ఏమో అని కొంచెం అనుమానంగా ఉంది...కాకపోవచ్చు. సాధారణంగా సస్పెక్టెడ్ కేసెస్ అన్నీ ఐసొలేట్ చెయ్యడం మంచిది... ఊళ్లో ఉంది. ఎగ్మోరులో కొంచెం కనిపించింది.

కా—(ఆత్రంగా) అయితే...అయితే...

డా—మీరు కంగారు పడకండి. కాకపోవచ్చు. మీ రేమీ అధైర్యపడవద్దు. ఒకటి. ఎందుకేనా మంచిది. ఈ లొకాలిటీ చాలా కన్ జెస్టెడ్ గా ఉంది! శానిటరీ కండిషన్స్ ఏమీ బాగా లేవు. ఏదయినా అడ్మిట్ చేయడమే మంచిది. మళ్లీ వస్తాను.

[డాక్టరు చెయ్యయినా చూడకుండా వెళ్లిపోతాడు. కామేశ్వరరావు ఆదారివైపే చూస్తూఉంటాడు.]

రా—(కొంచెంసేపు నిదానించి) ఏమంటాడు డాక్టరు?

కా—(లేనిధైర్యం తెచ్చుకుని) ఏకో మామూలు జ్వరమేను. "కాని హాస్పిటల్ లో ఉంచితే మంచిది. ఇక్కడ చుట్టుపట్ల ఆరోగ్యంగా లేదు" అంటాడు.

రా—(భయంతో) ఎవరినీ దగ్గిరికి వెళ్లవద్దన్నాడెందుకు ?

కా—అచ్చే, అది ఎందుకేనా మంచిదే. మరేం పెద్ద యిదేం కాదు.

రా—(విచారంగా) ఏమో. అన్నింటికి పైన భగవంతుడే ఉన్నాడు...

[డాక్టరుగారి యింట్లో, ఫోనుదగ్గర డాక్టరుగారు టెలిఫోను నెంబరు డయల్ చేః]

"Hullo. Is that the Corporation...... yes, could you kindly put me on to the Health Officer......yes please. Dr. Rama Rao here......please.

Yes......Good evening Doctor......in the neighbouring lane a few yards from my house there is a suspected case of Menin. jitis. Could you kindly arrange for isola-

# కొందఱు తెలుగు కవులు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ప్రత్యక్షజీవితముతో, అవ్వలిప్రపంచముతో, కాలగతితో, నూతన సంచలనముతో చుట్టఱికమును గలుపుకొని, విశ్వదృష్టి నాకర్షించిన పాత్ర నెద్దానినైన సృష్టించిన సాహితి మనలో నింకను దలయెత్తలేదు. జగదీశు డిచ్చిన నైసర్గిక ప్రతిభను దిడ్డిగంతిలోని దీపమట్లు గుండెలోనే వెలుంగనిచ్చి, అనువాద అనుకరణ అనుసరణములను ముపురమ్మల గావించుకొని, వానికే జేజేలుపాడిన రచయిత లెందఱో మన నేలలో గోచరించిరి. బహుళ సాంఘిక రాజకీయ చారిత్రక పరిస్థితు లీ శోచనీయ దృశ్యమున కుత్తరవాదు లయ్యెను. మన రచయితలు తమభాషకు అంతర్జాతీయమైన ప్రతీతి జేకూర్పజాలరైరి. తాము ప్రపంచప్రశస్తి నందలేకపోయిరి. ఇట్లనిన గొన్నియుత్కృష్ట సాహిత్య లక్షణముల నలవరచుకొనిన ప్రజ్ఞాధురీణులు మనలో లేరనుట సత్యమునకు తలవంపులు తెచ్చుటే![1]

భావబంధురముగ కవిత జెప్పజాలిన మన పెద్దలలో వడ్డాదివా రొకరు. రమారమి ఏడుదశాబ్దులను గ్రంథరచనమునకై వినియోగింపగలిగిన అదృష్టవంతులు వీరు. అయినను వీరి స్వంత రచనలు మిక్కిలి తక్కువయైయుంట ఆంధ్రుల దురదృష్టము. వీరి భావనాశక్తి ఒక్కొకపుడు రవికవిప్రతిభను దలపించును. చూడుడు:

నానాప్రాణిసమూహముల్ మనఁగఁ గ్రిం
    దన్ మీఁద విశ్వంపుఁబె
న్నాశ్రీ నందంబగు నభ్రపత్రవితతిన్,
    నక్షత్రపుష్పావళిన్
భానుస్వచ్ఛమయూఖసత్ఫలములన్,
    బ్రస్ఫారదిక్శాఖలన్.
ధ్యానింతు న్నిను మూలకందము ముకుం
    దా! భక్తచింతామణీ.'

వ్యోమంబున్ గ్రహతారకావళి, నిలం
    బుష్పాళిఁ గైచేసి ముక్
స్వామీ! నీవు గృహప్రవేశ మిట చే
    నాఁ డైతివో కోవిదన్
నీ మాహాత్మ్యము మహో! యలంక్రియయటే
    నేఁడున్ గనన్ వచ్చుఁ ద్వ
ద్ధామం బారయ నిత్యశోభన; మనం
    తా! భక్తచింతామణీ.

ప్రాలేయాచలతుంగశృంగముల పై
    భాగంబునందుండి యీ
భూలోకంబున దూఁకు వాకఝరిఁ దుం
    పుర్లెన్ని సంధిల్లెనో
యా లెక్కన్ పరిదేల్చు మేటిగణకుం
    డర్హుండో కా, కేఁ డికన్
జాలుం దేవ! భవత్కృతోపకృతు లెం
    చన్? భక్తచింతామణీ.

---

1. "ఆంధ్రమహాపురుషులు" అను నా గ్రంథమున కొండొకభాగమందు మనరచయితల ప్రజ్ఞావిశేషములను విపులముగా విమర్శింప నుద్దేశించుచున్నాను.

పాదుపుంగొండను నిండుఁజందురుఁడునం
 బోలెన్ మనోపీఠి ని
ష్పాదు చూపట్టుచు, దేవ! నన్ను జడధిం
 బొంగించుచున్నావు...

గగనంబం దుడుబృంద మంధతమసా
 క్రాంతింగదా భాసిలున్!
సుగుణంబుల్ వరునందు నాపదల చే
 శోభిల్లునత్యంత....

మకరందంబును గ్రోలఁ జెట్టుకొనకో
 మ్మందోఁచు పువ్వుమ్మెదం
తముఁ బోవన్ మొద లెక్కుచీమవలె, నా
 నందామృతాస్వాదనాం
ధకమై యాత్మ పరాత్పరుండ వగునీ
 సాన్నిధ్యముం జేర ని
ష్ఠ కడంగెం బసివట్టి...

ఉడుబృందం బెటులో విహాయసమునం
 దుల్లంబునన్ శాంతమా
వడుకే, యీశ! త్వదీయదివ్యగుణర
 త్నస్తోమ మామాడ్కి దోఁచెడు...

వికచంబుల్, కనకాభముల్, పరిమళో
 పేతంబులై యున్నఁ జం
పకముల్, వానివి నాని, తేనియ కరుల్
 పద్మంబులన్ మూఁగు; నై
హికభోగంబుల దోగిమానసముల
 ట్లై నిచ్చ వర్జించి తా
పసముల్ శ్రీపదముల్ భజించు రహిఁ; దే
 వా! భక్తచింతామణీ.

వింటం జుక్కలసంఘ కేవెలుఁగు వే
 వెల్గుం గనుంగొంచు విం
టింటన్ వేఁడివెలుంగుఁ గన్గొనుచు...

చైతన్యార్కమరీచిగుచ్ఛశిఖలన్,
 సమాశ్రితం బయ్యెశుక్
శతకోర్మితమఃపరాగము ... ... ... 2

సుమారు మూడుశతాబ్దులలో ముప్వరు మహాకవులు కావించినక్రియను రెండు దశాబ్దులలోపున నొక్కరుండు నిర్వహించి మాతృకలోని గుణమహత్త్వమును స్వీకూరాం

---

2 రవీంద్రుని, వచనములను గూడ బరిశీలింపుడు:

"Beautiful is thy wristlet, decked with stars and cunningly wrought in myriad coloured jewels. But more beautiful to me is thy sword with its curve of lightning like the outspread wings of the Vishnu perfectly poised in the angry red light of the Sun-set."

"Light, my light, the world-filling light, the eye-kissing light, heart-sweetening light!

Ah, the light dances, my darling, at the centre of my life; the light strikes, my darling, the chords of my love; the sky opens, the wind runs wild, laughter passes over the earth.

The butter-flies spread their sails on the sea of light, Lillies and jasmines surge upon the crest of the waves of light.

The light is shattered into gold, on every cloud, my darling, and it scatters gems in profusion.

Mirth spreads from leaf to leaf, my darling, and gladness without measure. The heaven's river has drowned its banks and the flood of joy is abroad."

(—Vide Tagore's "Gitanjali.")

ద్ధీకరణమున జూపి, శ్రీకృష్ణభారతము నాంధ్రుల చేతుల బెట్టిన శ్రీపాదవారు తమ వజ్రసంకల్పమును, యిచ్ఛాశక్తిని, ఘనపాండిత్యిని ప్రకటించిరి.

"నళినగర్భ మరందపాన ప్రమత్త
భృంగ సంగీత నాద మెసంగె దెసల
భూమిపతిశిష్ట మేటి లింజామరములఁ
నాగఁ దగ జెల్లుఫూల్ శరదాగమనమున!

మున్నగు పంక్తులందు వీరి కవితాశక్తి ప్రకాశమైనది

తెలుగులో సాటిలేని పాండితినందిన మహోపాధ్యాయులు గిడుగువారు. భాషాంగణమున మతే భారతపండితుని ప్రక్క గుబుచగా నిలువని మహాపురుషులు వీరు. ఎదుటి కురుక్షేత్రమున ననేక యోధముఖ్యులు విజృంభించుచుండ దమ కర్మక్షేత్రమున దామొక్కరై భయరహితులై సింహారవమొనరించిన మహారథికు లీ కళాప్రపూర్ణులు. తార్కికసూత్రములను పాటించి వీరు వాదింపనేర్చియుండినచో, ఎదుటివారి నుడువులకు వీను లొగ్గజాలు సామర్థ్యము వీరి కుండినచో, తేటమాటలకై తపించుచు దోడ్తోడన గభీరభావసింధువున సిదంజాలు గంధసింధురము కాజాలుశక్తిని వీరు చూపజాలియుండినచో, వీరి యనుచరసంఖ్య నేడు బలవత్తరమై, ఘనతరమైయుండెడిది; కోతి కొమ్మచ్చులుకాక వీరి కట్టెదుట భావబంధుర నృత్త గీతములు జోరు కలంగెడివి. వీరును సుప్రసిద్ధ పరిశోధకుడైన జయంతి కళాప్రపూర్ణుడును చేతులు కలుపుకొను మంగళముహూర్త మెపు డాసన్న మగునో!

కందుకూరివారివలె నాంగ్లమున గొంత పరిజ్ఞానమును సంపాదించి, ఆంధ్రమున గొంతదనుక నూతన వాఙ్మయసృష్టికి గడంగిన ప్రజ్ఞాధురీణులు చిలకమర్తివారు. ఆంగ్ల నవలాసాహిత్యమును చక్కగ పరిశీలించి, స్కాట్ బంకించంద్రుల ప్రజ్ఞావిశేషములను దలపించు ప్రతిభావైభవమును ప్రకటించుచు కడుంగడు చక్కని నవలలు రచించిన మహనీయులు వీరు. కథాసృష్టియందును, కథనకౌశలమందును, శైలిమాధుర్యమందును, శిల్పనైపుణ్య మందును వింధ్యపర్వతముల కివ్వల వీ రద్వితీయ ప్రజ్ఞగలవారు. హృద్యమైన గద్యమందు కవిత్వమహత్త్వమును జూపజాలిన ప్రథమాంధ్రులు వీరే! వీరి "కర్పూర మంజరి" రెండుభాగములను పరిశీలింపుడు. బహూళోదాహరణముల బడయగలరు. ఉపనిషత్తులనుండి కొన్ని రతనములను గైకొని, శుక్తి బోలు నిజప్రతిభనుండి కొన్ని మౌక్తికములు దీసి, వానితో వీనిని సహకరించి మేలిదామము సృష్టించి, "కృపాంభోనిధి"కి వీరు సమర్పించిరి.

వీరివలె నాంగ్లపరిజ్ఞాన మంది, చక్కని నాటకములు వ్రాసి, పానుగంటివారు మన నేలలో తమ విజయభేరిని మ్రోగించిరి. లయను, శబ్దవైచిత్ర్యమును వలచినకవులు వీరు. శ్రీనాథునివలె వీరికి సీసపద్యము నెడల మిక్కిలి మక్కువ కలదు. వీరి గద్యశైలి సెలయేరువలె నడచునని వీరి 'సాక్షి' చెప్పక చెప్పుచున్నది.

సంగీతమందును, సాహిత్యమందును, నృత్యమందును, వివిధభాషా పరిజ్ఞానమం

దును ఆఱితేఱిన ప్రజ్ఞావంతులు ఆదిభట్ల వారు. భారతభూమిలో వీరికి సాటి వీరే.

తమిళమునగూడ తగినంత పాండితిని పడసినగాని తెలుగుపాండితి నిండుకుండ శాజాల దని గ్రహించిన ఏకైక ఆంధ్ర రచయితలు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. సంస్కృతాంధ్ర ద్రావిడభాషలందు సమానాభిజ్ఞానమును జూపజాలిన పండితవరేణ్యులు వీరు. ఆంగ్లమున నుచితపరిచితిని పడసి సర్వసంప్రదాయములను సమానాదరముతో పరిశీలించు విశాలహృదయులు. వీరు ముద్రణాయంత్రము ముఖమును చూడని గ్రంథములను ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున పెక్కేండ్లనుండి పఠించుచు నాంధ్ర భాషాస్వరూపమును సమగ్రముగ గ్రహించిన విద్వాంసులగుడు జానుతెనుగు వీరి చిరసంగిణియై వీరి రచనమున సౌందర్య సందీప్తవాణియై వెలయుచుండును. వీరి "కపోతకథ" "మీనాన్నగారి ముచ్చట", "విశ్వాసము", "కడుపుతీపు", "మత్తవిలాసము", "భగవదజ్జుకము" మున్నగు గ్రంథము లీ యంశమును దృష్టాంతీకరించునవి. మిల్టన్ మహాకవి గ్రంథములను మెకాలే మహాశయుడు కంఠస్థ మొనరించుకొనినట్లుశ్రీనాథ కవినాథుని యుద్గ్రంథములను శాస్త్రీజీ గళస్థము గావించుకొనిరి. జాన్సన్ పీఠికలవలె వీరి పీఠికలు గ్రంథస్థములగుచో ఆంధ్రభారతికి అమూల్యములైన భూషణములు కాజాలును. కట్టమంచి మనీషివలె వీరును దమ యుపోద్ఘాతములను ప్రత్యేకమైన సంపుటియందు ప్రకటింపబూనెదరుగాక! మూలబడియున్న గ్రంథములను పరిశోధించి,తమోయవనికనుండి తప్పించి వీరు పున్నెమును గట్టుకొను చున్నారు. అముద్రితమైయున్న రంగనాథ రామాయణమును వీరి సాహాయ్యముకతన పునరుద్ధరించు చున్న మన విశ్వకళాపరిషత్తువారు వందనీయులు. వీరి రచనములే కాక ప్రసంగములుకూడ నుపమ యర్థాంతరన్యాసాది యలంకారములతో తుందిలములై యుండును. వీరివలె నాధ్యాత్మికదృష్టిగల పండితకవుల నాథు నికయుగమున నెందఱినో కానము. ఏమి తలచినను, ఏమి తెలిపినను, ఏమి చేసినను ఈశ్వరప్రీత్యర్థమై నెఱపు భక్తప్రవరులు వీరు. యోగనిష్ఠాగరిష్ఠులై, పరార్థజీవులై, బహుసంఖ్యాకులకు, బహుభంగుల సాహాయ్యము సలుపు మహనీయులు వీరు. శారీరక స్వాస్థ్యమును గోల్పడినవారును, మానసికశాంతికి దూరస్థులైనవారును, అతులైశ్వర్యసంపన్నులును, నిష్పచ్చరమునకు మిగులగూర్చు నెచ్చెలులును, పండితులును, పామరులును అనుదినము ప్రభాత సాయంసమయములందు వీరి చరణోపాంతమున జేరి, ధ్యానమగ్నులై, ఆనందమున నోలలాడుచుందురు. వీరి హృదయము కరుణాశరధి యనుట స్పష్టాంశమే కదా! కష్టము కట్టెదుట దోచినంతన శిలావిగ్రహము లగువారెందఱో ప్రత్యక్షమగు ప్రస్తుతకాలమున, ఉపకారము చేయకపోయిన పోవుదురు గాక అపకార మొనరింపక, తమదారిని తాము తరలిపోవువారి నెందఱినో చూడజాలని ప్రస్తుతసమయమున శాస్త్రీజీ బోలువారు మఱికొందఱున్నచో, మానవసంఘమును గుఱించి నిట్టూర్పులను విడనక్కఱలేదు. లెక్కలేని తమయిడుములను కన్నెత్తి చూడక కట్టెదుటివారి కడగండ్లను కాంచి భగవతి

వలె విలసించు మహాత్ములు వీరు. ఎదుట బడిన అభాగుల నుద్ధరించిగాని నిదురపోని దీనబంధువు ప్రభాకరశాస్త్రిలుగారు. "నీ వెవరిని మెచ్చెదవో తెలుపుము ; నీ వెవండవో తెలిపెదను " అను వాక్కు లాంగ్ల సాహితియందు సుప్రసిద్ధములు. శాస్త్రిజీ గాంధిజీ ననవరతము మెచ్చుచు, వారియెడల బద్ధానురాగులై వర్తించుచుందురు. యుగములనుండి క్రమసిద్ధి నందుచున్న ఈశ్వర మహత్త్వము గాంధిమహాత్మునందు మూర్తీభవించిన దని శాస్త్రిజీ విశ్వసించుచుందురు. సర్వాంశములందు మహాత్మ్మ ననుకరింప వీరువిళ్ళూరుచుందురు. మహాత్ముని ప్రశంసించి, మహాత్మ ననుసరించువారి యాశయము లెట్టివై యుండునో గ్రహించుటకు పతితల కాలస్యము కాదు. శాస్త్రిజీ ఎట్టి యుత్కృష్ట క్రియ నైనను రహస్యముగ నిర్వర్తింపవలె ననియే ఆతురపడుచుందురు. వీరి పాండితి పారావారమునకు సహపాఠినైనను, వీరి హృదయము దొడబెట్టశిఖరముకంటె నున్నతమైనదయ్యు సదా మఱుంగున నుండవలె ననియే వీరు ముక్కువపడుచుందురు. ఆకుమూకలనడుమ నడగు పూవునెచ్చెలివలె, మొగులువెన్క దాగు జాబిలిలీల, మలయహిల్లోలమున నదృశ్యమై మసలు మధురగీతికరీతి, చిఱుతరగలందు కలహంసతో దాగిలిమూతలాడు సరోజదళముచాడ్పున అందంపు నానతాననమున నడగియు నడంగియుండని సిగ్గువెలుగువలె, తల్లి పయ్యెదలోని ముద్దు నిసుంగు లీల, సూనవనమున దాగు భృంగిభంగి, మింటియం దెందో మిన్కుమిన్కుమను చిట్టిచుక్కవలె స్మృతిపథమున నస్పష్టముగ దలసూపు మధురానుభవము మాడ్కి, నడినిశిలోని తియ్యని గుసగుస పోలుపున, వ్రజనారి వేనలిలోని కృష్ణాంగుళి కరణి, చూతపత్రాగారమున కులుకు కలకంఠమిథునముకైవడి, శతపత్రములందలి శిశిర బిందుసుందరిచందమున, స్వీయసృష్టియందడంగియుండు కవిచంద్రునిచాడ్పున, మబ్బుదొంతరలందలి కనకంపు తళ్కులీల, కారుణ్యవనధిలోని సద్భావరత్నముభాతి, కడలేని యడకువయం దడగిమడగియుండ మహాపురుషు డాతురంపడుచుండును. తన నమ్రతయందు తా నడగియుండ నువ్విళ్లూరు మహానీయుడు శాస్త్రిజీ.

తమ రచనమందలి ప్రత్యక్షరమును రసపూరిత కలశము గావింపజాలిన ప్రతిభావంతులు తిరుపతి వేంకటకవులు. ప్రశాంతమైన కాసారమున గులకరాయి పడుట యెట్లో రసపూరితకావ్యమున క్లిష్టశబ్దము పడుటయు నట్లే; ఈ కవుల పద్యములు ముత్తెపు జేరుల గుంపని, మల్లెమాలల కలయిక యని తెలుపు టొప్పు. వీరి పద్యములు చదువుచుండ దియ్యనైన రవము చెవులబడును; చెలువంపు జిత్రములు మానస నేత్రముమ్రోల దళ్కొత్తును; హృదయనందనమున మలయహిల్లోల మల్లనల్లన వీచును. తెలుగుకైత యెట్టి కైసేతలతో వెలయగలదో తెలిసికొనవలె ననిన వీరి రచనలను పరిశీలించిన జాలును.

తమ్మిపూరేకు చందముగల్గి చెవి దాకు
నిడుదకన్నుందోయి బెడఁగుతోడ
నిండుజాబిల్లి వెన్నెలవంటి చిఱునవ్వు
దొలకించు కెమ్మోవికులుకుతోడఁ

గోదమచందురుఁబోలెఁ గొమరారు కుదురైన
 చదురుగల్గిన సోగ సుదురుతోడ
గండుతుమ్మెద తెక్కుగమి చెల్వమును బిల్వ
 సాఁగు నూనూఁగుమీసములతోడఁ

జక్కఁదనమున కెక్కుడై చంద్రబింబ
మునకు సహపాఠియైన నీ మొగము నింకఁ
బసయు సేరని పరమనిర్భాగ్యురాలి
తనము నేయునె దయమాలి తమ్మిమాలి?

జగ మెల్ల సుప్రకాశము చేయఁగాఁ జాలు
 చంద్రుఁ బాసిన యాకసంబుమాడ్కిఁ
బనివానితనము తోఁపఁగఁ బిగించిన రత
 నంబు జాఱిన వలయంబుపగిదిఁ
బ్రతిబింబమును జూపు పటిమంబుగల మించు
 తళ్కు గోల్పడిన యద్దంబుభాతి
నెంతైన విలువ చేయింపఁజాలు నీ
 రంబుఁ గోల్పడిన హీరంబురీతిఁ

బ్రాణనాథుఁడు లేని తల్పంబు చూచి
కలలు నిక్కులలా? యందుఁ దలఁచు నాకు
నేఁడె సిద్ధించె నీనాఁటి పాడుకలభ
లం బనుచు నెంచి సుండియు ల్లుల్ల రసఁగ.

మేలిక డానిఁబోలు నను మేనిహారంగు,

... ... ...

సరిగంచు నెఱిమించు చల్వవల్వలు దాల్చు
 లలితుండు కావికాటులు ధరించెఁ

... ... ...

—బుద్ధ చరిత్ర.

మున్నగు పద్యములను పరిశీలింపుడు.

సంస్కృత శబ్దముల చెంత బోక తెలుగులోని తేటదనము జూపి, పదవిజృంభణము నుండి దూరస్థులై, నుడితేనియలనే చెవులందు బోసిన అల్ప సంఖ్యాకులైన ఆంధ్రకవులలో వీరి కున్నతస్థానము గలదు. తిక్కన, చేమకూరకవి, తిరుపతి వేంకటకవులు తొలిభవమున లలితరసాలసాలనవపల్లములందే విడసిన పికిరములై యుందురు. కళాప్రపూర్ణులైన తిరుపతి వేంకటకవులవలె పూరేకులతో పద్దెము లల్ల నేర్చినవారు వీరి శిష్యులు పింగళి కాటూరి కవులే!



# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

## విమర్శపరామర్శము

శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

"సూర్యరాయాంధ్రనిఘంటువు" అను శీర్షికముతో "ఆంధ్రపత్త్రికా ప్రమాథిసంవత్సరాదిసంచిక"లో శ్రీ వడ్లమూడి వేంకటరత్నముగా రొక వ్యాసము వ్రాసినారు. తమమిత్రు లొకరు మహాభారతమునకుఁ బ్రత్యేకముగా నొకనిఘంటువును రచించినారనియును, దానిలోఁ గలపదములును సూర్యరాయాంధ్రనిఘంటువులోనిపదములును దా మెత్తి వ్రాయఁగా మహాభారతనిఘంటువు నిచ్చినవి సూర్యరాయాంధ్రనిఘంటువులో వకారాదిపదములలోనే యయిదువందల పదములు కనఁబడలే దనియును, కనుక సూర్యరాయాంధ్ర నిఘంటువు సమగ్ర నిఘంటువు కాదనియును దమకుఁ దోఁచిన యావిషయమును లోకమునకుఁ దెలుపుటకై యావ్యాసమును వ్రాసినారఁట. ఇది వీరి వ్యాసములోని సారాంశము.

వీరు సూర్యరాయాంధ్రనిఘంటువులో లేక మహాభారతనిఘంటువులో మాత్రము కలశబ్దములను గొన్నిటిని మచ్చునకై చూపియున్నారు. వానిని బరిశీలించువారికిఁ దచ్ఛబ్దములను గ్రహింపకపోవుటవలన సూర్యరాయాంధ్రనిఘంటువునకు లోపము లేకపోవుటయే కాక సవిమర్శముగా నది రచింపఁబడిన దను విషయము గూడ గోచరించును.

"నిఘంటువువారు గ్రహించినపదముల కైనను సమగ్రముగా నర్థములు వ్రాయలే"దని యింకొక యారోపణము చేసినారు. "వ్యావహారికశబ్దముల నన్నిటిని నిఘంటువులో గ్రహింపలే"దని మఱియొక యారోపణము గూడఁ జేసినారు. వీని కన్నిటికి నీ వ్యాసమున సమాధాన మియ్యఁబడును.

వ్యావహారికశబ్దములు భిన్న భిన్నరూపములతో వ్యవహారమునఁ గలవు. ఉదాహరణమునకై సూర్యరాయాంధ్రనిఘంటువులో లేదని విమర్శకు లాక్షేపించిన "ఉకము" అను పదమునే గ్రహింతము. దీనిని "ఉహము" అని పెక్కురును, "ఉగము" అని కొందఱును, "ఉఘము" అని మఱి కొందఱును వ్యవహరించుచున్నారు. విమర్శకులు "ఉకము" అని వ్రాసియున్నారు. ఇప్పు డీ నాలుగురూపములలో నేది గ్రహింపవలయును? ఒకటి గ్రహించినఁ దక్కినవి గ్రహింపకుండుటకుఁ గల కారణ మేమి?. అన్నియును గ్రహించిన నేవి సాధువులు? ఏవి యసాధువులు? వీని సాధుత్వాసాధుత్వములకుఁ బ్రమాణ మేమి? శిష్టవ్యవహారము ప్రమాణమనుటకు శిష్టులెవరో శిష్టులు కానివా రెవరో తేలనప్పుడు దానినిఁ బ్రమాణముగాఁ దీసికొనుట యెట్లు? ఒకవేళ శిష్ట నిర్ణయము జరిగినను వారుగూడ బహురూపములను వ్యవహరించుచున్నప్పు డం దేది ప్రమాణము? ఇత్యాద్యనేక సాధక బాధకములు విశేషముగాఁ జర్చించియే నిష్ప్రమాణములు సందిగ్ధార్థరూపములు నగు వ్యావహారికశబ్దముల నీ నిఘంటువున గ్రహింపలేదు. ఇది గ్రాంథిక భాషానిఘంటువు కాని వ్యావహారికభాషానిఘంటువు కాదుగదా! మఱియు నీ నిఘంటు వసందిగ్ధార్థ రూపములు సప్రమాణములు నగు వ్యావహారికశబ్దములను బెక్కింటిని గ్రహించియేయున్నది.

విమర్శకులు సూర్యరాయాంధ్రనిఘంటువులో లేవన్న గ్రాంథికశబ్దములను "అపశబ్దములు, అనావశ్యకములు, గృహీతములు" అని మూఁడురకములుగా విభజింపవచ్చును.

### ౧. అపశబ్దములు.

"అవాక, ఎడగర" మున్నగునవి యపశబ్దములు. కనుకనే నిఘంటువులో వానిని గ్రహింపలేదు. వానినిగూర్చి ముందుముందు సవిస్తరముగా వ్రాయఁబడును.

## ౨. అనావశ్యకములు

ఇవి కవులు సమానార్థక పదములను గలిపి సృష్టించుకొనునవి. ఇట్టి వీని నెన్నింటి నిచ్చినను నిఘంటువునకు సమగ్రత యుండదు. వీ రాక్షేపించినవానిలో మూఁడు వంతులకుఁ బైఁగా నిట్టివియే కలవు. చూడుఁడు.

అంగజన్ముఁడు:—'ఈ పదము గ్రహింపలే'దని యాక్షేపము. 'అంగజుఁడు, అంగభువు, అంగభవుఁడు' మొదలగునవి గ్రహింపఁబడియుండఁగా నిది గ్రహింపఁబడకున్న నేమి లోపము?. అట్లుగాక యిట్టివాని నన్నిటిని గ్రహింపవలయునన్న "అంగజాతుఁడు, అంగజాతి, అంగజనుఁడు, అంగసంభవుఁడు, అంగసముద్భవుఁడు, అంగసంజాతుఁడు" మొదలగు ననేకశబ్దములను గ్రహింపవలసివచ్చును. మఱియు 'అంగ'శబ్దపర్యాయశబ్దము లన్నింటియొద్దనుగూడ నిట్టివి చూపుట కారంభించిన మొదల ననవసరముగా నింకను గ్రంథము పెరుఁగును. కనుకనే యిట్టిపట్టులందుఁ బ్రసిద్ధములగు సంస్కృత నిఘంటువులలో నిచ్చినపదములు కొన్ని చూపినఁ దక్కిన వన్నియు నూహింప శక్యము లగునని నిఘంటుకర్త లట్లు చేసినారు. ఇట్లే 'అనిలజుఁడు' అనుపదమును గ్రహింపలేదని యాక్షేపించినారు. "అనిలాత్మజుఁడు" అనుదానిని గ్రహించియున్నారుగదా, దీనిని గ్రహింపకున్న నేమి?. 'అంగజన్ముఁడు'దగ్గఱలోలె నిక్కడఁగూడ సమాధానము చూచుకొందురు గాక. "అనిమిషగురువు" ఇది లేదట. 'అమరగురువు' కలదుగదా, చాలదా? ఇట్టి వాని నెన్నిటిని గ్రహించిన సంతుష్టి గలుగును?. కనుక వీరు చూపిన యితరానావశ్యకశబ్దములనుగూర్చి సమాధాన మిచ్చుట యనావశ్యక మని తలఁచి తక్కినవానికి సమాధాన మిచ్చెదము.

## ౩. గృహీతములు

(నిఘంటువులో నున్నను లేవని విమర్శకు లను కొనినపదములును, తత్తుల్యములును.)

(౧)అకా—ఇది గ్రహింపలేదని యాక్షేపము. దీనిని "కా!" గా గ్రహించి 'అని' అనునవ్యయమువలెఁ బూర్వోక్త విషయమును సూచించును. ఇది యీయర్థమునఁ దఱచుగా ఏ వార్థకమునకు అకారమునకుఁ దర్వాతఁ గనఁబడుచున్నది" అని వ్రాసి ప్రమాణములు చూపియున్నారు. అట్లుకాక 'అకా'అని యొకపదము గ్రహించిన 'వ...అది తనసైన్యాపరాధంబున వర్యోగ్గా వగచి...'—భార,అర. ౩-౧౬౮. ఇక్కడ అకారపూర్వకము కాకున్నను 'అని' అను నర్థము నిచ్చుచున్నది గదా! ఇది యెట్లు కుదురును? కావుననే దీనిని 'కా!' గా గ్రహించినారు. 'అకా నిరర్థకము' అను ప్రౌఢవ్యాకరణము ప్రాయికాభిప్రాయము. అందుచేతనే శబ్దరత్నాకరమున "అకా" అని గ్రహింపక "కా"గానే సీతారామాచార్యులవారు గ్రహించినారు.

(౨) అగ్ర్యము— ఈ పదము లేదని యాక్షేపము. "అగ్ర్యుఁడు" అను పదమును గ్రహించియుండగా దీనిని గ్రహింపలేదని యాక్షేపించుట సమంజసము కాదు. ఇట్టి విశేషణశబ్దములలో నముహన్మహన్మహతీ రూపములు మూఁడును గ్రహింపక యేదే నొకటియే గ్రహించుట నిఘంటుసంప్రదాయము.

(౩) అంపపెట్టు, అంపసెల — ఇవి గ్రహింపలేదని యాక్షేపము. "అమ్ము[1]" లో (వ్యుత్పత్తియందుఁ దఱచుగా 'అంప' అగును) అని వ్రాసి యుదాహరణార్థము 'అంపకట్టె, అంపవెల్లి' మున్నగునవి కొన్నిమాత్రమే గ్రహించినారు. "అంపపెట్టు" మున్నగువాని కన్నిటికిని 'అమ్ము[1]' లో వ్రాసిన విశేషమువలననే సిద్ధి సులభగ్రాహ్యము. కావుననే యిట్టివాని నన్నిటిని గ్రహించి వృథాగా గ్రంథమును బెంచలేదు.

(౪) అంతశ్చరము, అంతఃపరివారము:— ఇవి లేవని యాక్షేపము. సూర్యరాయాంధ్రనిఘంటువులోని "అంతర్" అనుపదమును జూచికొనిన నిట్టివి ప్రత్యేకముగా గ్రహింప నక్కఱలేదని తోఁచును.

(౫) అంబుజాక్షి, అంబుజాక్షుఁడు, అబ్జాక్షి :- ఇవి లేవని యాక్షేపము. ఇట్టివి "అక్షి" శబ్దములో సవిమర్శముగాఁ జూపఁబడినవి. ఇట్టివానిని మేము చూపినట్లే ప్రధానశబ్దములలోఁ జూపినఁ జాలవఱకు గ్రంథవిస్తరము తగ్గుటయేకాక యట్టివాని ననేకములను

కల్పించుకొను తెలివికూడఁ గల్గును. లేనిచో గ్రహించి నవే లెక్కకు దడితరములు తెలియవు.

(౬) అబ్జముఖి — ఇది లే దని యాక్షేపము. ఇక్కడ "అబ్జముఖు" అను రూపాంతరము గూడ నుండును. ఈ విషయము 'అబ్జముఖుఁడు'లోఁ జూపఁ బడినది. ముఖశబ్దమునఁ గూడఁ జూపఁబడును.

(౭) అలుఁగుటమ్ము — ఇది లేదని యాక్షేపము. ఇది విశేషార్థాభిధాయకము కాకపోవుటచేత "అలుఁగు2"లో నుదాహరణముగాఁ జూపఁబడినది.

(౮) అల్లఁగనము — ఇది లేదని యాక్షేపము. ఇది "అల్ల2" లో నుదాహరణముగాఁ జూపఁబడినది. కొన్నిచోట్లఁ దప్పఁ దన ప్రత్యయాంత శబ్దములు ప్రత్యేకముగా గ్రహింపఁబడక 'అల్ల2' మొదలగు శబ్దములలో వలెనే ప్రధానశబ్దములలో నుదాహరణములుగాఁ జూపఁబడును. ఇది నిఘంటుసంప్రదాయము.

(౯) అవసథము — ఇది నిఘంటువులో గ్రహింపఁబడ లేదని యాక్షేపము. ఇది కల దనుటకు దృఢతరప్రమాణములు లేకపోవుటచేతఁ బరిత్యజింపఁ బడినది. అమరమున,

శ్లో. ధిష్ణ్యమోకోనివసనం స్థానావసథ వాస్తుచ|

అని కలదు. ఇది యధికపాఠ మని యమరవ్యాఖ్యాతలు వ్యాఖ్యానము చేయక వదలినారు. ఐనను

శ్లో. రమ్య మావసథం కృత్వా—( రామాయణము బాల. ౧. ౩౦.) లో (ఆవసథం = పర్ణశాలారూపం గృహం- ధిష్ణ్యమోకో నివసనం స్థానావసథవాస్తు చేత్యమరః) అని గోవిందరాజీయవ్యాఖ్యలో "ఆవసథ ముగా" భేదింపంబడియున్నది. ఇట్లే వైజయంతీనిఘంటువులోఁగూడఁ బ్రామాణికులచేత భేదింపఁబడియున్నది. మఱియు సూ. ఉపసర్గే వసేః. ఆవసథో గృహమ్. సంవసథో గ్రామః— సిద్ధాంతకౌముది. ఉణాది. ౩. ౧౧౬.-అని పాణినీయమున 'ఆవసథ' శబ్దమే సాధింపంబడినదిగాని 'అవసథ' శబ్ద మెక్కడను సాధింపంబడ లేదు. ఇట్టి బహుప్రమాణములను, ప్రామాణికప్రయోగములను బరిశీలించియే శ్రీరంగాచార్యప్రభృతి నిఘంటుకర్తలుగూడ 'అవసథ'శబ్దమును గ్రహింపక 'ఆవసథ' శబ్దమునే గ్రహించినారు. సూర్యరాయాంధ్రనిఘంటువు కూడ నీ ప్రామాణికమార్గమునే యనుసరించి 'అవసథము' ను గ్రహింపక 'ఆవసథము'నే గ్రహించినది. ఇట్లు సవిమర్శముగాఁ బనిచేయుచున్న సూర్యరాయాంధ్రనిఘంటువు నిందార్హమో స్తుత్యర్హమో విమర్శకలోకమే నిర్ణయించుఁగాక. ఇప్పటికి మీ రిచ్చిన మొదటిపట్టిక లైనది. ఇఁక రెండవపట్టికకు మీరు వ్రాసిన యుపోద్ఘాతమును గొంచెము విమర్శించిన దాని పస బయటఁ బడును. చూడుఁడు: "శ్రీరామయ్య పంతులు వారు పీఠికలో "ఉపసర్గశతంతాది శబ్దములు గూడ నిందు గ్రహింపఁ బడినవి" (పీఠిక. 3 పారట) అని వ్రాసియున్నారు. శబ్దములు అను మాటకు 'కొన్ని' అనువిశేషణ మున్నచో నది యథార్థమే యగునుగాని ఆ విశేషణము లేక 'అన్నియు' అనుభావము కలుగవలయునను తలంపుతో వ్రాసినయెడల నది ఘోరాసత్యమే యగును. పంతులవారి మాటలో 'ఉపసర్గ' అనుటకు ఉపసర్గపూర్వకములు అనియే గదా వారిభావము. చూడుఁడు: ఆంధ్రమహాభారతము నుండియే కొన్నిపదములు :

| | |
|---|---|
| అకలంకము | అవధీయమానుఁడు |
| అకాలకౌముది | అనవిత్త్వము |
| అచిత్తు | అనింద్యము |
| అజరామరము | అనీహమానుఁడు |
| అధశ్శయనము | అఫల్గువు |
| అధోనీవి | అవివాభవత్ |
| అవిద్ధను | అశ్లథము |
| | ........." |

అని విమర్శకులు వ్రాసినారు. కాని యీ పదములలో నేదియును నుపసర్గపూర్వకము గాదు. ఏమాత్రపు సంస్కృతవ్యాకరణజ్ఞానము కలవాఁడైనను "అ, అధస్" అనునవి యుపసర్గము లని చెప్పఁడు. మఱియు "తెనుఁగులోఁ బృథక్ప్రయోగార్హములు గాకున్నను సమాసములలో నుపయోగింపఁబడును గనుక ఉపసర్గశతంతాది శబ్దములుగూడ నిందు గ్రహింపఁబడినవి" (పీఠిక, 3 పారట) అని శ్రీరామయ్యపంతులవారు వ్రాసియుండఁగా దీనినంతను సరిగా నర్థము చేసికొనక యీ

వాక్యమునందలి యేకదేశమును గ్రహించి విమర్శకులు దానికి విపరీతవ్యాఖ్యము చేసినారు. శ్రీపంతులవారు 'ఉపసర్గ'శబ్దమును "ప్ర, పరాదు" లనునర్థముననే ప్రయోగించిరిగాని విమర్శకులు వ్రాసిన ట్లుపసర్గపూర్వకము లనుభావమునఁ బ్రయోగింపలేదు. ఉపసర్గములకుఁ దెలుఁగునఁ బ్రత్యేకముగాఁ బ్రయోగము లేకున్నను సమాసములలో నుండును గనుక మేము "ప్ర" మొదలగు నుపసర్గముల నన్నింటిని గ్రహించి వానికిఁగల యర్థములు నుదాహరణములను జూపినా మని పంతులవారి వాక్యమునకు భావము. అట్లు ప్రాదులను బ్రత్యేకముగా గ్రహించి యర్థాదులు వ్రాయుటచేత విమర్శకులు నిఘంటువులో నీయలే దని యాక్షేపించిన "అపక్రాంతము, అపకృత్రిమము, అవజన్మ, అవజాతి, అభిఘట్టము, అభిదారణము" మొదలగు నుపసర్గపూర్వకపదములు తత్తదుపసర్గములలో వ్రాసిన యర్థములకే యుదాహరణాంతరము లగును. కనకనే యుపసర్గపూర్వకపదముల నన్నింటిని గ్రహింపక కొన్నింటిని (ముఖ్యములగువానిని) మాత్రమే గ్రహించినాము. వాచస్పత్యాది సంస్కృతనిఘంటువులుగూడ నీమార్గమునే యనుసరించినవి. అట్లుగాక యుపసర్గపూర్వకపదముల నన్నింటిని గ్రహింపవలయు నన్నచో నొక్కొక్క యుపసర్గమున కొక్కొక్క సంపుటము కాఁగలదు. అది నిరర్థకపరిశ్రమము. కనుకఁ బరిత్యజింపఁబడినది. విమర్శకులు పై విషయమును గమనింపకపోవుట యటుంచి పీఠికనైనను సరిగా నర్థము చేసికొనక తమ కలము నిక్కడ యథేచ్ఛముగా సాగించుట మిక్కిలి శోచనీయము.

మీరు చూపిన 'అకలంకము' మున్నగునవి "ఆ. సం. అవ్య." లో గతార్థము లగును. అక్కడ నఞ్కు సంబంధించినవిషయము విపులముగాను సోదాహరణముగాను వ్రాయఁబడినది.

ఇట్లు మీ రిచ్చిన రెండవపట్టికలోని శబ్దములుగూడ గతార్థము లైనవి. ఇఁక మూఁడవపట్టికలోని శబ్దములు చూడుఁడు.

"ఒక్క మహాభారతము నుండియేకాదు మీరు శబ్దములను విడిచిపెట్టినది. తక్కిన వాఙ్మయమునుండియు వదలివైచినారు. ఎన్నింటిని వదలిపెట్టినారో ఆదేవునికే యెఱుక. ప్రబంధములనుండి నేను గుర్తువ్రాసికొన్న పదములలోనుండి కొన్నింటిని ఈ సంపుటములో లేని వానిని మచ్చునకు ఉదాహరింతును" అని విమర్శకులు వ్రాసి కొన్ని పదము లిచ్చినారు. విమర్శకులు తా మిచ్చిన పదము లేయే గ్రంథములలో నున్నవో వానిపేర్లు మాత్రమే వ్రాసినారు కాని యాశ్వాసాదులను, పద్యసంఖ్యను వ్రాయలేదు. ఇది మిక్కిలి యన్యాయ్యము. ఏల యన, "ఎడగర" అనుపదము భారతమున నున్నదని విమర్శకులు వ్రాసినారు. పదునెనిమిది పర్వముల మహాగ్రంథములోనీ నాలుగక్షరములపద మెక్కడ నున్నదో తెలిసికొనుట యెట్లు? దాని మంచిచెడ్డఁ గూర్చి విచారించుట యెట్లు? ఇట్టివానిని వెదకవలయునన్న నెంతయో కాలము పట్టును. ఐనను నేను వీని నన్నిటిని వెదకినాఁడను. తత్తత్పదములయొద్దఁ దత్తత్పద్యములను వాని సంఖ్యాదులను జూపియే సమాధాన మిచ్చెదను చూడుఁడు:

అనాక:—

గీ. అనియశష్టంభసంరంభ మతిశయిల్లఁ
బలుకుటయు నాత్మ గర్హించి వలువపట్టి
యొండనాక యొక్కింతసే పూరకుండి
యుస్సురంచును వేఁడి నిట్టూర్పు వుచ్చె

—కాశీఖండము, ౧.౧౦౧.

(వావిళ్ల ప్రతిపాఠము.)

ఇందలి "అనాక" అను పదమును గ్రహింపలేదని విమర్శకుల యాక్షేపము. ఇక్కడ "అనాక" అనునది ముద్రణ ప్రమాదపతితము. "నా. అనునకు అనుకనులకు ముజీక్తులు పరంబులగునపుడు కానా కానలు విభాష నగు" అను బాలవ్యాకరణసూత్రముచేత "అను" ధాతువునకు వ్యతిరేకక్త్వార్థక రూపములు "అనక, నాక" అని రెండుమాత్రమే యగును. కనుకనే "ఒండునాక" అని ప్రాఁతముద్రణమునను, తాళపత్రగ్రంథములలోను గలదు. ఇంతమాత్రమేని సవరించుకొనలేని మీ రొక గొప్పనిఘంటువును విమర్శింపఁబూనుట మిక్కిలి సాహసము.

# టాకీ తీసి చూడండి!

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

ఇక ఈ దిక్కుమాలిన టాకీ లైనులోకి ఎన్నటికీ అడుగుపెట్టను. వాళ్ల "ప్రభావతీ ప్రద్యుమ్నం" నామూలంగా చెడిపోయిందని వాళ్లు దేశమంతా చాటుతున్నారు. వాళ్లు చాటకపోయినా అటువంటిటాకీలో వేలు పెట్టినతరవాత నన్నెవరు చేరనిస్తారు మళ్లీ ?

కాని ఆ దిక్కుమాలిన టాకీ అట్లా కావటానికి నేనే కారణ మంటేమాత్రం నేను సహించలేను. నా తెలివితేటలలో విశ్వాసం ఉన్నవాళ్లూ నా స్నేహితులూ నన్ను చూడగానే పెట్టేమొహాలు చూస్తే నాకు ఆత్మహత్య చేసుకో బుద్ధిపుడుతున్నది. నేను జరిగిందంతా చెప్పేస్తాను. నాకు శక్తిలేదు కాని నేను పనిచేసిన కంపెనీ డైరెక్టర్ల నందరినీ 'డిప్పి బొమ్మలల్లే వేళ్లాడగట్టి' 'తలా తోకా తెలియకుండా టాకీలు తీస్తామని బయలుదేరినవారందరికీ ఈగతే పడుతుంది' అని చాటింతామని ఉంది.

మాకంపెనీలో భాగస్తులలో ఒక్కణ్ణి కూడా నేను స్వయంగా ఎరగను. అందులో ఇద్దరు కంపెనీతరఫున బాడుగకు తీసుకున్న మోటారుకారులో మా ఇంటికి వచ్చారు. వాళ్ల వెంట మాసూర్యనారాయణ కూడా ఉన్నాడు. వాడి కా కంపెనీతో ఏమిసంబంధమో, వాడి సలహా కంపెనీవారు ఎట్లా ఆమోదించారో, ఆఖరుకు వారికీ వాడికీ ఎట్లా తెగిపోయిందో — ఇవేవీ నా కీ నాటికీ తెలియవు. ఆ కంపెనీవారు నన్ను ప్రొడక్షను మేనేజరుగా బుక్కు చెయ్యటానికి నిమిత్తమాత్రుడుగా వాడు రంగం మీదికి వచ్చి ఆపని కాగానే బయటికి వెళ్లి తన ప్లీడరు గుమాస్తాగిరీలో నిమగ్నుడైపోయినాడు.

నాదగ్గిరికి వచ్చిన పెద్ద లిద్దరూ నాదరిద్రస్థితి చూచారు. నేను చవుకగా వస్తానని తెలుసుకున్నారు. వారికి నే నేం చేస్తానో, చెయ్యగలనో, చెయ్యాలో తెలియదు. నన్ను ప్రొడక్షనుమేనేజరుగా పెట్టుకోం డని నేనే చెప్పాను. వారు నా అనుభవం అడిగారు; నాకు తెలియవలిసిన అవసరం లేని విషయాలనుగురించికూడా ప్రశ్నించారు. ప్రతివిషయాన్నిగురించీ కొంతకొంత మాట్లాడగల శక్తి భగవంతు డిచ్చిఉండటంవల్ల వాళ్లకేవేవో సమాధానాలు చెప్పాను. వాళ్లు నన్ను అనేకవిషయాలను గురించి సలహాలు కూడా అడిగారు; అవికూడా ఇచ్చాను. వాళ్లు నామాటలు సంపూర్ణంగా అర్థం చేసుకుని వాటితో తృప్తిపడ్డట్టు కనిపించారు. ఒక్క డబ్బు ఖర్చుపెట్టడంవిషయంలోనే నేను ఆ ఇద్దరిలోనూ ఒకరికి కోపం తెప్పించాను.

నేను మరేమీ అనలేదు; 'ఈలైనులో అనుభవం లేనివారు సామాన్యంగా దుర్వ్యయం చేస్తారు. ఒక్కొక్కరకం ఖర్చు అవసరమైనదల్లే కనిపించినా గిట్టదు; ఒక్కొక్కదానికి ఎంత ఖర్చు చేస్తే అంతకు పదింతలు

ప్రతిఫలం ఉంటుంది. అది తెలుసుకుని ఖర్చు చేస్తే వృథావ్యయం చాలా తగ్గించుకో వచ్చు' అన్నాను. ఆమాటమీద ఒకాయన కొంచెం అతిశయంగా, "మనం అటువంటి కక్కుర్తిపడ నవసరం లేదు లెండి! లక్ష రూపాయలు అవుతవనే అంచనా వేశాం!" అన్నాడు.

ఈ విషయంలోనే కాదు, నేను మాట్లాడినదానికంతా వారు ఆమోదం కనబరచినప్పుడల్లా నేనన్నది వారి తలకు ఏమాత్రమూ ఎక్కలేదని క్రమంగా తెలుసుకున్నాను.

చక్కని సాంఘిక సమస్య తీసుకుని కథ రాయించమన్నాను. కథాగ్రటా తయారు చేసుకుని నటులను బుక్కు చెయ్యమన్నాను. లేకపోతే చాలా ఇబ్బంది పడిపోమా అన్నారు!

ఆఖరుకు "ప్రభావతీప్రద్యుమ్నం" నిశ్చయం చేశారు. నిశ్చయం చెయ్యటమేమిటి నటులను బుక్కు చెయ్యటమేమిటి? ప్రభావతి వేషానికి ఆరుగురు ఆడవాళ్లను బుక్కు చేశారు. ఆరుగురికీ అడ్వాన్సులిచ్చి పిలిపించి రిహార్సల్సు ప్రారంభించారు. రిహార్సల్సంటే మరేమీ లేదు, హార్మొనిస్టును కుదిర్చి సంగీతం అభ్యాసం చెయ్యటం. ఆహార్మొనిస్టుకు బొంపట్ల లక్ష్మీకాంతయ్యగారికీర్తన లన్నీ వచ్చును. ఇంతమంది ప్రభావతులూ ఆ ఒక్క ప్రద్యుమ్నుడిమీద పడ్డారు. అందుకని అతన్ని వెళ్లగొట్టి మరొక హార్మొనిస్టును పిలిచారు. బుక్కయిన ఆడవాళ్లకు ఏహార్మొనిస్టయినా ఒకటేనని నేను కంపెనీవారికి చెప్పాను. కాని నామాట ఎవరికీ అర్థం కాలేదు. కవిని తెచ్చి కథ రాయించేలోపల ముగ్గురు హార్మొనిస్టులయినారు.

ఆకవి నేను పుట్టకపూర్వం ప్రసిద్ధుడైన నాటకకర్త అని చెప్పారు. ఆయనదగ్గర అచ్చుపడని ప్రభావతీప్రద్యుమ్ననాటకం ఉందిట. దానిసమస్తహక్కులూ మా కంపెనీవారు నిపుణతతో బేరమాడి ఎనిమిదివందలరూపాయలకు కారుచౌకగా పుచ్చుకున్నారు. వేరే డబ్బు పుచ్చుకోకుండా ఆకవే ఆనాటకానికి 'అనుబంధాలు' రాయటానికి ఒప్పుకోవటంవల్ల కంపెనీకి మరింత కలిసివచ్చింది!

ఆనాటకంలో పద్యాలూ అనుబంధాలూ కలిసి నూటఇరవైరెండయినై. అందులో పది అంకాలు; ఇరవైమూడురంగాలు.

ఈటాకీలో పాల్గొనటానికి బుక్కయిన నటీనటసముదాయం మొత్తం నలభైఇద్దరు. ఇదికాక వంటవాళ్లూ పనివాళ్లూ ఇంకో పదిమంది. ఈ బాపతులోవచ్చిన ఒకవ్యక్తినిగురించి ఒక్కముక్క చెబుతాను. అతనెవరో ఎవరికీ తెలియదు. అతను మాలాడ్జికి (తాత్కాలికంగా కంపెనీవారు ఉన్న ఊళ్లో ఏర్పరచుకున్న ఠికాణాకు) రావటం నేనెరుగుదును. ఎవరు కావాలని అడిగితే "గోపాలస్వామితో కొంచెం మాట్లాడాలి పిలుస్తారా?" అన్నాడు.

గోపాలస్వామి ఎవరో ఎవరికీ తెలియదు. "నువ్వే పిలుచుకో!" అని వాడికి సమాధానం చెప్పారు. ఆతరవాత వాడు నలుగురితోపాటు లాడ్జిలో అటూ ఇటూ అర్జంటు పని ఉన్నట్టు తిరగసాగాడు. వాడు లాడ్జిలో అడుగుపెట్టిన అరగంటలో ఆడవాళ్లంతా తలా ఒక పనీ వాడి కంటగట్టారు.

ఉమ్మస(న):— కేయూర బాహు చరిత్రలోని యీ పదమును గ్రహింపలే దని యాక్షేపము.

'ఉమ్మస' అనియే గ్రంథమున నున్నది. అది సరి యగునో కాదో యని తలఁచికాఁబోలు విమర్శకులు (న) కుండలీకరణములో నుంచినారు. ఈపదము కల పద్యమును జూడుఁడు.

(ఒకసమయమున దీర్ఘకాలము వఱపు పట్టినది. అప్పు డొకసర్పము డప్పిచేఁ గంఠగతప్రాణమై సమీప మున నొకనూతిలో)

క. మండూకనినాదము విని,
నిండిన సంతసముతోడ నీరుండనిచో
నుండ విని యచట నుదకము
లుండఁగఁబోలు నని మేన నుమ్మసలారన్.

— కేయూరబాహుచరిత్రము, ౩. ౧౫. (కడియవచ్చెను.) ఇక్కడ "ఉమ్మ + అసలారన్" అని పదచ్ఛేదము. "ఉమ్మ=ఉక్క. అసలారన్=అతిశయింపఁగా" అని యర్థము. విమర్శకు లనుకొనినట్లు "ఉమ్మస(న)" అనుపదము లేదు. ఈ విషయము వీరికిఁ దెలిసినచో నిఘంటువు వారిపై నాగ్రహింపకుందురు. ఉమ్మ, అసలారు శబ్దములు నిఘంటువులో సప్రమాణముగా గ్రహింపఁబడియే యున్నవి. ఇక్కడ విమర్శకులు "ఉమ్మస (న)లు + ఆరన్" అని పదచ్ఛేదము చేసికొనిరో? "ఉమ్మస (న) + లారన్" అని పదచ్ఛేదము చేసికొనిరో? లేక మఱి యేవిధముగాఁ బదచ్ఛేదము చేసికొనిరో? వారికే యెఱుక.

అట్టహాసము:— భీమఖండములో నున్న యీపదమును గ్రహింపలే దని యాక్షేపము. ఇది సూర్యరాయనిఘంటువు ౯౯ పొరటలో "పెద్దనవ్వు" అనునర్థముతో నీయఁబడియున్నది. వీరు లే దనుటకుఁ గారణము తెలియదు. ఈ పదము భీమఖండములో ౧-౮౩, ౧౦౪, ౩-౧౪౯, ౪.౬౫. లలోఁ గలదు. కాని వీనిలో నెచ్చటను నిఘంటువులో నిచ్చినయర్థము కన్న విశేషార్థమైనను లేదు. కనుక విమర్శకులు నిఘంటువును మరల నొకమాఱు సరిగాఁ జూచుకొందురుగాక.

ఆటకూటము:— భీమఖండములోని యీపదము నీయ లేదని యాక్షేపము.

'వ...కుంతీమాధవదేవునకు విశ్రాంతిప్రదేశంబును హుంకారిణీమహాదేవికి విహారసంకేతభవనంబును బీఠాంబికాలక్ష్మి కాటకూటంబును... అనఁదగి...'
—భీమ, ౨.౫౫.

ఇం దీపదము కలదు. "ఆట=క్రీడకొఱకైన, కూటము=గృహము" అని దీని యర్థము. పై రెండు శబ్దములను వేఱువేఱుగా గ్రహించి వానిలోఁ బై రెండర్థముల నిచ్చియున్నాము. మఱియు నీ యర్థము కల "ఆటగీము" అనుసమస్తపదము నొకదానిని మచ్చుకై చూపియున్నాము. అందుచే నీ పదము పై వానిలో గతార్థమగును. ఇట్టిసమస్తపదములలో నొకదానిని జూపినచోఁ దత్సదృశములగువానిని బాఠకులూహించుకొనవలెనేకాని నిరుపయోగములగు నిట్టివాని నన్నింటిని నీయలేదనుట సమంజసము గాదు. ఈయిక తప్పదన్నచో "ఆటగృహము, ఆటవేశ్మము, ఆటసద్మము, ఆటనికేతనము" మున్నగు పదములనుమాత్ర మేల యీయనక్కఱలేదు? అట్లీయదొరఁకొనినచో నంత మెక్కడ?. కావుననే యిట్టిసమస్తపదములవిషయమున ముఖ్యములగునవి కొన్ని చూపి వదలుచున్నాము.

ఏకభోగము:— భీమఖండములోని యీ పదము నీయలే దని యాక్షేపము.

గీ. ఏకభోగంబుగాఁగ నేలేలుఁగరుసు
గడలిసీమయు గౌతమీగంగ మేర
కప్పరపుఁగ్రోవి గాశ్మీరఖండ మవధి
యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు.
—భీమ, ౫.౮౮.

ఇక్కడ 'ఏక', 'భోగ' శబ్దములకున్న యర్థము కన్న విశేషార్థ మేమియును లేదు. కనుకఁ బ్రత్యేక పదముగా గ్రహింపవలసినయవసరము లేదు.

అధఃప్రపంచము:— పాండురంగమాహాత్మ్యములోనియీపదము లేదని యాక్షేపము. ఇది యపశబ్దమో సుశబ్దమో విమర్శకులు గ్రహింపలేదు. ఏల యన "అధస్" అనుదానిలోఁ దవర్గచతుర్థవర్ణ మేకాని ద్వితీయ

వర్ణము లేదు. కనుక వీరు తవర్గ ద్వితీయవర్ణముతో నిచ్చుట తప్పు. ముద్రితపాఠమునుబట్టి తవర్గ చతుర్థవర్ణ ఘటిత మనుకొన్నచో సూర్యరాయాంధ్రనిఘంటువులోని "అధస్" శబ్దములో గతార్థమగును. వ్రాతప్రతులలో

చ.........వినిపింతు నీకు నేఁ,
గని వినియున్నగోప్యము న
గమ్యము నైన యదఃప్రపంచముల్.

—పాండు, ౨.౨౧౯.

అని తవర్గ తృతీయవర్ణముతో నున్నది. అప్పుడు నిఘంటువులోని 'అదస్' శబ్దములో గతార్థమగును. వ్రాతప్రతులపాఠమునందే యర్థము సరిగాఁ గుదురు చున్నది. ఇట్టిచోట్ల విమర్శకులు తమ శ్రద్ధతోఁ బరిశీలనము చేయక సూర్యరాయాంధ్రనిఘంటువుపై నాగ్రహించిన నేమిలాభము ?.

అదికపి:— పాండురంగమాహాత్మ్యములోని యీ పదమును గ్రహింపలే దని యాక్షేపము.

ఉ....విరించినందనుఁడు...కనిరెల్...
సంచితసత్కృపారసద
శంకరు నాదికపిన్ వృషాకపిన్.

—పాండు, ౨.౧౯౦.

ఇక్కడ "ఆదికపి" శబ్దము "వృషాకపి" శబ్దమునకు విశేషణము. కనుక — ఆదిశబ్ద కపిశబ్దములు చూచికొనిన వానిలో నిది గతార్థమగును. ఇట్లే "అయ్యలదొడ్డి" అను మఱియొకపదము లేదని యాక్షేపించినారు. అది పాండు. ౨.౯౭లో నున్నది. కాని యక్కడఁగూడ నెట్టి విశేషార్థము నను లేదు. "అయ్యశబ్ద, దొడ్డిశబ్దములు చూచికొనిన వానిలో గతార్థమగును. సరియగు శబ్దములు నిఘంటులో వదలిపెట్టఁబడినచో నట్టివాని నెవరు చూపినను కృతజ్ఞతాపూర్వకముగా సూర్యరాయాంధ్రనిఘంటువువారు గ్రహింతు రనియును, ఇట్టి నిర్విశేషసమస్త శబ్దములు గ్రహింప నక్కఱలేదని తెలిసియుండియే మాని వేసినా రనియును విమర్శకలోకము గ్రహించుఁగాక.

అరణాలు:— శివరాత్రిమాహాత్మ్యములోని యీ పదమును గ్రహింపలే దని యాక్షేపము.

గీ. త్రిసరకాస్వాదధిషమదోద్రేకలహరి
ధరణిదేవుఁ డా రెరాజ పత్తా వహించి
యారణాలు పఠింపంగ నాలకించి,
శంబరారాతి రతిఁజేయి చఱచి నవ్వె.

—శివరా, ౩.౧౪.

ఇక్కడ 'అరణాలు' అనవలెనుగాని 'ఆరణాలు' అనరాదు. ఏల యన, అరుణముతోఁగూడ నాలుపన్నములు వేదములోఁ గలవు. వీనిలో "అరణ్యేఽధీయీత" అని యుండుటచేత "ఆరణ్యకము" లనియును, అరుణసంబంధము కలవగుటచేత "ఆరుణము" లనియును వీనికి రెండుపేర్లు వచ్చినవి. 'అరుణాలు' అనుటకు బదులు 'అరణాలు' అని తప్పుగా వ్యవహారమునఁ గలదు. అదియే ముద్రాపకులు ప్రమాదవశమున ముద్రించినారు. దానిని జూచి మనవిమర్శకులుగూడ భ్రమపడినారు. కనుక నే......ఆరుణం, ఋల......ఆముక్తమాల్యద. ౩ ౧౧. లోను, "అరుణము లనెడు భాగములలో" అని వేదం వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యలోను గలదు. మొదటిసంపుటమున లేని 'అరుణము', 'ఇరుచఁబడు' మొదలగు శబ్దములను రెండవ సంపుటమున ననుబంధముగఁ జూపెదఁచి సుమారు రెండుసంవత్సరములకుఁ బూర్వమే ప్రత్యేకముగా నొక యనుబంధము తయారు చేసి యుంచినాము. ఇట్లే దాఁటిపోయినవానిని పైసంపుటముల యనుబంధములలోఁ జేర్చుచుందుము.

ఎడగర:— ఇది భారతమునఁ గలదనియును నిఘంటువులో గ్రహింప లేదనియును విమర్శకులయాక్షేపము.

సీ. మాకు నీపూన్కి సమ్మత మేము దీనికి
నీతోడివారము నీవు డస్సి,
యున్నవాఁడవు నిద్రయును లేకయున్న నీ
వెడగరపడిరెడు దీయడవిలోన
నెమ్మి డప్పిదేఱ నిద్రించి...అడరిన
నరిగణంబు గెలుతు వశ్రమమున.

—భార. శాం. ౧.౬౦.

అని వావిళ్ల, ఆనందవారి ప్రతులలో నున్నది. ప్రాఁతముద్రితప్రతులలోను, భారతము లక్ష్మీపతి

సోమయాజులుగారి వ్యాఖ్యలోను "లేకయున్నది జేగిరపడిరెద వేల యింత" అను పాఠము కలదు. ఈ పాఠమును వావిళ్ల, ఆనందవారుగూడఁ బాఠాంతరముగాఁ జూపియున్నారు. కాని యీ పాఠమున నఖండయతి నంగీకరింపవలెను. కవిత్రయములో నిట్టియఖండయతి లేదనియే పాఠములఁ బరిశీలింపఁగాఁ దేలినది కనుక నీ పాఠము మంచిది గాదనుట స్పష్టము. ఇఁకఁ దాళపత్త్రిగ్రంథములు పరిశీలింపఁగా "...నిద్రయును లేకయున్నెని వెడఁగురుపడిరెదు దీయుడని లోన, నిల్చి డప్పిదేఁటి నిద్రించి..." అను సాధుపాఠము కాన్పించినది. కావున దీనిని "వెడఁగురు"గా గ్రహించి యచ్చుట మంచిదౌను. ఇట "వెడఁగురు" అనునదియే సరియగు రూపమనుటకు

చ. ఉడుగక కన్నునీరఁ గడు నొప్పటి
చాయలు చెడ్డకన్నులన్,
వెడఁగురువడ్డమోముఁ బటువేసనఁ
గందినయంతరంగమున్,
బడుగయియున్న మేను నయిభామిని...
—హరివంశము. పూర్వభాగము, ౮.౧౫౫.

ద్వి. అక్కలిపఱపక యఱగన్నుఁ గొనక,
వెక్కక పీఁగక వెడఁగురుపడక...—
—పండితారాధ్య చరిత్రము. దీక్ష, ౯౧ పా.

మొదలగు సాధకప్రయోగములు గలవు. ఇఁక "ఎడ గర" అనుటకు సరియగు ప్రయోగ మొక్కటియే నియుఁ గాన్పింపలేదు. కనుకనే సూర్యరాయాంధ్ర నిఘంటువులో నీపదము గ్రహింపఁబడలేదు. ఇట్లు సవిమర్శముగాఁ బనిచేయుచుండుటచేతనే సూర్యరాయాంధ్ర నిఘంటువు తయారగుటకు హెచ్చుకాలముపట్టుచున్నది. అట్లుకాక కనఁబడిన దెల్ల గ్రహించి యేదియో యొక యర్థము వ్రాయుచుండినచో నింతకుఁబూర్వమే పని ముగిసియుండును.

ఎలపాసెము:— హరవిలాసములోని యీ పదముు గ్రహింపలేదని యాక్షేపము.

ఉ. పల్లియచోటనుండి యెలపాసెము నడ్కలుఁ
జక్కిలంబులున్...నంబివియ్యములు... కుమారసిరి
యాళునకున్ గొనితెచ్చి రర్మిలిన్.—
—హర, ౨.౯౧.

సూర్యరాయాంధ్రనిఘంటువులో "ఎల!"లో "అభినవము" అనునర్థము సోదాహరణముగా నిచ్చియున్నాము. అందుచేత నీపదము దానిలో గతార్థమగును. "ఎలపాసెము=అభినవపాయసము, క్రొత్తగాఁ జేసిన పరమాన్నము" అని యర్థము. పర్యుషితపాయసము భక్షణార్హము కాదని ధర్మశాస్త్రములో నుండుటచేత శ్రీనాథుఁడు పాసెమునకు 'ఎల' అను విశేషణము నుపయోగించినాఁడు. మఱియు నిక్కడ "ఎలప్రాసఁగుటడుక్కలు" అను పాఠాంతరము కలదు. అప్పుడీ పదమే లేదుగదా. "ఎలప్రాసఁగు టడుక్కలు = క్రొత్త ప్రాసంగుధాన్యపుటడుకులు" అని యర్థము. కనుక నిదియు గ్రహింప నక్కఱలేదు.

అయదము:— హరవిలాసములోని యీ పదము నీయలేదని యాక్షేపము.

క. హయముల నూఱుసవర్ణము
లయుతంబు వహింప నూతుఁడై మాతలియు
న్నియమింపఁ దనరునరదము
నయదము నెక్కంగఁబనిచి హర్షం బెసఁగన్.
—హర, ౪. ౧౫౧.

నిఘంటువులో "అయము" అనుపదమును గ్రహించి దానిలో "౨. మంగళము, శుభము" అను నర్థము వ్రాసియున్నాము. "ద" లో (ఇచ్చునది—ఈ యర్థమున సమాసాంతముననే యుండును. ఉదా:— సుఖదము, దుఃఖదము మొ.) అని చూపఁబడును. ఈ విధముగానే యిట్టికేవల యౌగికశబ్దముల నన్నిటిని గ్రహించుట యుక్తము. ప్రత్యేకముగా గ్రహింప నక్కఱలేదు.

అధ్వానము:— హరవిలాసములోని యీ పదము నీయలేదని యాక్షేపము.

(రతివిలాపము)

మ. ...ఎన్నండును లేని చందమిది ల
క్ష్మీపుత్త్రి నీయందు న,
న్నతిదుఃఖాన్వితఁ జేసి పోవఁ దగవా
యధ్వానపుంబట్టునన్ .—
—హర. ౩.౭౬.

"అధ్వానము = ధ్వనిలేనిది, నిశ్శబ్దము" అని యర్థము. ఇది "అ. సం. అవ్య" లో గతార్థము. అక్కడ నఞ్ఞునకు సంబంధించిన విషయము విపులముగా వ్రాయఁబడినది. ఐనను "అధ్వని' అశబ్దము, అరావము, అరవము" మొదలగు నఞ్ సమాసఘటిత శబ్దముల నన్నింటి నీయవలయు నన్నచో వానికే ఎన్ని సంపుటములైనను జాలవు. కనుకనే వీలయినంతవఱ కిట్టి సులభ మార్గము లనుసరింపఁబడినవి.

అవాదల :— హరవిలాసములోని యీపదము నీయలే దని యాక్షేపము. హరవిలాసములో నా కీపదము కనఁబడలేదు. ఎక్కడ నున్నదో విమర్శకులు తెలిపినయెడల సమాధాన మిచ్చుటకు వీలగును.

ఇక్కడకు వీరు వ్రాసియుంచుకొనిన శబ్దములకు సమాధాన మిచ్చుటయైనది. విమర్శకులు మఱికొన్ని శబ్దముల నిచ్చి వానికిఁగల యన్ని యర్థములు నీయలేదని యాక్షేపించినారు. వానిని బరికింపుఁడు.

అయ్య :— "దీనిని శ్రీనాథుఁడు తన శృంగార నైషధములో పురుషసామాన్యవాచకముగాఁ బ్రయోగించినాఁడు. కాని నిఘంటువువా రీయర్థమును గ్రహింపలేదు" అని యాక్షేపము.

చ. .......................ధట్టహా
ర్షనికవితానుగుంభనులు ...కొందఱయ్య, లౌ
నని కొనియాడ నేరరు...

—నైష, ౧. ౧౩.

ఇక్కడ విమర్శకుల యర్థము సరియైనది కాదు. "అయ్యలు = పూజ్యపురుషులు" అనియే యర్థము. ఈ యర్థము నిఘంటువులో నీయఁబడినది. ఈ ప్రయోగమున మాత్రము వ్యతిరేకలక్షణచే "నింద్యపురుషులు, తెలివితక్కువపురుషులు" అని యర్థము చెప్పుకొనవలయును. ఇట్లు కాక యిక్కడ "పురుష. సామాన్యవాచకము" అనిన నింద గమ్యమానము కాదు. ఇట్టివ్యతిరేకలక్షణాలబ్ధార్థములను నిఘంటువునఁ బ్రత్యేకార్థములుగా గ్రహింపరుగాని తత్ప్రయోగము నుదాహరణముగా గ్రహించినప్పుడు దానిక్రిందఁ జూపుచుందురు; అనఁగా నిట్టి సామాన్యవిషయములను బాఠకు లూహించుకొనవలయు నని నిఘంటుకర్తల యాశయము. మఱియు "అయ్య" లో "౩. పురుషవాచకము.— వాఁడు." అని యొకయర్థము వ్రాసియుండఁగా నిఘంటువువారు "పురుషసామాన్యవాచకము" అనునర్థము నీయలేదనుట యసత్యము గాదా? పురుషసామాన్యవాచకము లగు నయ్యశబ్దము లన్నియు దానికి నుదాహరణము లగును. కొన్నిచోట్ల "వాఁడు" అనుశబ్ద మాయర్థమున సరిగా నతుకు నని తెలుపుటకై "—వాఁడు" అని చూపినారు. అట్లు కాక యీ రెండును సమానార్థకములే యనుట యిష్టమైనయెడల "పురుషవాచకము, వాఁడు" అని కామాగుర్తుతో నిచ్చియుందురు. "కామాచే విభజింపఁబడిన పదములు సమానార్థకములు" అని పీఠికలో వ్రాసియున్నారు. విమర్శకులు నిఘంటురచయితల యుద్దేశములు సరిగా గ్రహింపక యాక్షేపించినట్లు వారి వ్యాసము స్పష్టము చేయుచున్నది.

"ఆమ్రేడితము, అనుప్రాసము, అధ్యాహారము' ఇత్యాది పదములను శ్రీనాథకవిచంద్రుడు తన వాక్యములలో ప్రయోగించియున్నాడు.

'ఆమ్రేడితమొ కాని యద్రిజావకు.—కాశీ .౮.'

దీనికి లక్ష్యార్థములు చెప్పవలయును గాని శాస్త్ర పరిభాషతో నర్థములు పొసగవు. కాని నిఘంటువుకర్త లాజోలికి పోలేదు" అని యాక్షేపము. కాని నిఘంటువులో "ఆమ్రేడితము" రెండవయర్థము క్రింద

సీ. వీప్సయో కాని పూవిల్తుకాని సఖునకు
నామ్రేడితమొకాని యద్రిజావకు.

—కాశీ. ౮. ౧౯౧.

(ఇట ప్రతిబింబము, పాటి-అని భావము.) అని వ్రాసియుండఁగాఁ గాశీఖండములోని "ఆమ్రేడిత" శబ్దమునకు నిఘంటుకర్త లర్థము వ్రాయలేదని విమర్శకులు వ్రాయుట సత్యదూరము. అనుప్రాసము మొదలగు శబ్దములలోఁ గూడ నిట్టి ప్రయోగముగా నీభావమునే వ్రాయుట న్యాయ్యము. వాని ననుబంధములోఁ జూపితిమి.

అక్షయ్యము:— "ఇది గ్రాసమాత్రభిక్షము అను నర్థమునఁ గాశీఖండమునఁ బ్రయోగింపఁ బడియున్నది.

కాని పరిష్కర్తవారు దానిని చూడనేలేదు" అని విమర్శ కులయాక్షేపము. చూడుఁడు:

గీ. హంతకారం బనంగఁ బదాఱుగఱ్ఱ
గలశభవ! నాల్గుగఱ్ఱ పుష్కల మనంగ,
గ్రాసమాత్రంబుభిక్ష యక్షయ్యమంద్రు,
మానిబృందారక! తదన్నదానఫలము.
—కాశీ., ౫. ౨౧౯.

ఇక్కడ "తదన్నదానఫలము, అక్షయ్యము, అంద్రు" అని యన్వయింప వలసియుండఁగా "గ్రాసమాత్రంబు భిక్ష, అక్షయ్యము, అంద్రు" అని యన్వయించిన వీరి సమన్వయశక్తికి విద్వాంసులు నిశ్చేష్టులు కావలసినదే! వీరి సమన్వయమున నాల్గవ పాదమున కన్వయము సున్నయేనా? ఆంధ్రభాషలో నిట్టి పాండిత్యముకల మన విమర్శకులు సూర్యరాయాంధ్రనిఘంటువు నాక్షేపించుట యాశ్చర్యకరము. ఇక్కడ మూలమును బరికింపుఁడు.

శ్లో. హంత షోడశభి ర్గ్రాసై,
శ్చతుర్భిః పుష్కలం స్మృతమ్
గ్రాసమాత్రా భవే ద్భిక్షా
గృహస్థసుకృతప్రదా.
—సం. కాశీ., ౩౫. ౨౦౪.

కూర్మపురాణమునఁ గూడ నీవిషయ మిట్లున్నది.

శ్లో. భిక్షామాహు గ్గ్రాసమాత్ర
మన్నం తస్మా చ్చతుర్గుణమ్,
పుష్కలం హంతకారంతు
తచ్చతుర్గుణ ముచ్యతే."
మఱియొకవిషయమును జూడుఁడు.

"పరిష్కర్తవారు ప్రకరణార్థమును గమనింప లేదనుటకు దృష్టాంతముగా మహాభారతపదములనే నాలుగయిదింటిని ఆంధ్రమహాభారతనిఘంటువు సంగ్రహించినవానినుండి యుదాహరింతును.

" అసు=ఆధారమను, ప్రాపను.

" అధికతాపతప్తమైనది నాచిత్త
మెంతర వతనితోడ నొకట నునికి
యెన్నఁడొక్కొ మనకు నిందఱ కసునాతఁ
డేల మసలెనొక్కొ యిన్నియేండ్లు.
—భార. అర., ౩. ౨౯౦.

"ఇచటి అసుధాతువునకు ఆశ్రయమను అనియే యర్థము చెప్పవలయును. మూలము చూడుఁడు.

" శ్లో. సర్వేషా మాశ్రయోహ్యాత్మకం
రణేఽరీణాం ప్రమర్దితా.
—సం. భార. ఆరణ్య., ౧౮౩. ౧౬.

" మూలములోని 'ఆశ్రయ' అనుమాటకే తెలుఁగు భారతమున 'అసు' ప్రయోగింపంబడినది"

అని విమర్శకులు వ్రాసినారు. వీరియన్వయమున 'ఎన్నఁడొక్కొ' అనుచోటఁ గ్రియ నధ్యాహారము చేసికొనుటయు, ఈయొక్క ప్రయోగమునుబట్టి 'అసు'ధాతువునకుఁ గ్రొత్తయర్థ మొకటి కల్పించుటయు ననవసరములగును. మఱియు సీసపాదము ౫ నాలుగింట వర్ణనవకుఁగల గుణవిశేషములు చెప్పి ముగించి మరల నాతని గుణవిశేషమునే యిక్కడఁ బ్రస్తావించుట సాభిప్రాయము గాదు. కనుక 'మనకు నిందఱ కసునాతఁ' డరకునొక వాక్యముగా నన్వయించినఁ బై దోషము లుండవు. "అసునాతఁ= కలుగుము" అనియే యర్థము.

మూలమునుబట్టి వీరు కల్పించిన క్రొత్తయర్థమునకు మూలమేమాత్రమును సాధకము కాదు. ఏల యన, ౧౮౩-వ యధ్యాయమున ౨౯ శ్లోకములు గలవు. వీని కన్నిటికిని గలిపి యొక సీసపద్యమును భట్టారకుఁడు రచించినాఁడు. అందును గొంతవఱకు మూలమున లేని దానిని జెప్పినాఁడు. ఇట్టిచో సరిగా నీపదమునకే యీ తెనుఁగుపదము ప్రయోగింపబడిన దని చెప్ప వీలులేదు. అట్లుకాక వీ రన్నట్లు

శ్లో. సర్వేషా మాశ్రయోహ్యాత్మకం
రణేఽరీణాం ప్రమర్దితా,
ఆహర్తా సర్వరత్నానాం
సర్వేషాం వస్సుఖావహః.
—సం. భార. వన., ౧౮౩. ౧౬.

దీని మొదటిపాదమునందలి 'ఆశ్రయః' అనుదానికే 'అసు' తెనుఁగునఁ బ్రయోగింపఁబడిన దను నెడలఁ జతుర్థపాదమునందలి "సుఖావహః" అనుదానికే యేల ప్రయోగింపఁబడఁగూడదు?. అప్పుడు 'అసు' నకు 'సుఖావహుఁ డను' అను నర్థమునే చెప్పవలయును గాని, 'ఆశ్రయమును' అనునర్థమును జెప్పఁగూడదు గదా! ఇక్కడ వీ రేమి సమాధానము చెప్పఁగలరు?. కనుకనే యిట్టివిమర్శనక్షమములుగాని యర్థములు సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్పలేదు.

"అసు=జీవించు.

"వ. నేడు రణభూమియందు నర్జునుం డొండెఁ త్రిగర్తులొండెం గావలయు"—భార. ద్రోణ., ౧ ౨౨౦.

ఈ 'అసు' ధాతువునకు 'జీవించు' అనునర్థము చెప్పుటయే సమంజసము. మూలమును జూడుఁడు.

శ్లో. అద్యాస్త్వనర్జునా భూమి
రత్రిగర్తాథవా పునః.
—సం. భార. ద్రోణ, ౧౭. ౧౩."

అని విమర్శకులు వ్రాసినారు. కాని యిది "అసు" లోని "౧౮. ఉండు" అను నర్థములో గతార్థమగును. రణభూమియందు (కావలయు౯=) జీవింపవలయునని విమర్శకులు చెప్పినవిధముగా నర్థము చెప్పుట బాగుగా నుండదు. సంస్కృతమున భూమిశబ్దమును భూమి మాత్రపరముగా వాడినాఁడు. దానిని దెనుఁగున 'రణభూమి' యని తిక్కన మార్చినాఁడు. కనుక మాటకుమాట చొప్పునఁ దిక్కన తెనిఁగింపలేదనుట స్పష్టము. ఇఁకఁ దెనుఁగు భారతమునకు — 'నేఁడు యుద్ధభూమియందు అర్జునుఁడో త్రిగర్తులో యుండవలయును' అనియర్థము; అనఁగా-అర్జునుఁడు, త్రిగర్తులు-ఇరువురు నుండక ఎవరో యొక్కరు పాఱిపోవుటయో లేక చచ్చుటయో జరుగవలయు నని భావము.

"అంతర్గతము=మనస్సు.

"వ. ఇట్లతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున"—భార. విరా, ౧. ౨౧౪."
అని విమర్శకులు వ్రాసినారు. కాని యీయర్థము నే నిఘంటువులు నీయలేదు. మఱియు నిక్కడ "అంతర్గతంబున=అంతర్గతముగా" అని యర్థము; అనఁగా 'హృదయాంతర్గతముగా' అని భావము. ఇది 'అంతఃకరణము, అంతరింద్రియము, అంతరంగము' మున్నగువానివంటిది కాదు. ఇట్టి ప్రయోగములు నన్నయతిక్కనాది ప్రాచీనకవులలోఁ గలవు. ఇట్లే "ఆత్మగతంబున" అని నన్నయాదులు ప్రయోగించియున్నారు. దానికి 'మనోగతముగా' అని యర్థము చెప్పికొనవలయునే కాని 'మనస్సులో' అని యర్థము చెప్పరాదు. భారతమున నిట్టివి శేషము లనేకములు కలవు.

"అడరు=వెంబడించు. చ. అతిరథసంబుమై నడరి యాతనిఁ బట్టె సుశర్మ వెల్పనార్చి..."—భార. విరా, ౩. ౨౦౧.

"ఈ 'అడరు'నకు 'వెంటాడి' అనికాదా యర్థము? మూలము తిలకింపుఁడు.

శ్లో. ప్రమథ్య జిత్వా చ ప్రసహ్య మత్స్యం
విరాటమోజస్వినమభ్యధావత్.
—సం. భార. విరా, ౩౫.౫."

అని విమర్శకులు వ్రాసినారు. కాని యీయర్థము సరియైనది కాదు. పై పద్యమునందలి 'అడరు'నకు "(యుద్ధమున) కవియు," అని యర్థము. ఈ యర్థము సూర్యరాయాంధ్రనిఘంటువులోఁ గలదు. వీరు ప్రమాణముగా నిచ్చిన మూలమునకును పై పద్యమునకును సంబంధ మేమియును లేదు. మూలము సుశర్మ విరాటునితో యుద్ధముచేయుటకై వచ్చుటను జెప్పుచున్నది. తెనుఁగు పద్యము కొంతవఱకు సుశర్మతోఁ బోరాడి విరథుఁడైన విరాటుని సుశర్మ పైఁబడి పట్టుకొనుటను జెప్పుచున్నది. ఈ పద్యభాగమునకు మూల మిది.

శ్లో. సుశర్మా...విరథం మత్స్యరాజానం జీవగ్రాహ మథాగ్రహీత్.—సం భార. విరా, ౩౫.౧౧.
వీరు చూపిన మూలమున "మత్స్యం" అని కలదు. అది సరియైనది గాదు. కనుక "మత్స్యా౯" అని యుండవలయును. ఇట్లున్న నర్థము సరిగాఁ గుదురును. ఈపాఠమే గ్రంథములోఁగూడ నున్నది. ఇఁక "అభ్యధావత్" అను దానికి "వెంబడించు, వెంటాడు." అని యర్థము చెప్పుట మిక్కిలి తప్పు. "ఎదురుగాఁ బరువెత్తెను" అని యర్థము చెప్పవలయును. సూర్యరాయాంధ్రనిఘంటువు లోని "అభి" లోఁ జూచికొనిన "అభి"కిఁ గల యర్థములు విశదము కాఁగలవు. ఇట్టి స్వల్పవిషయములను గూడ గమనింపక వీరిమిత్రులు మహాభారతమునకు నిఘంటువును వ్రాయుటయును, సూర్యరాయాంధ్రనిఘంటువును గూర్చి సంతసింపని విమర్శకులు దానినిగూర్చి సంతసించుటయును విస్మయకరములే.

ఇం కొక్కమాట. "ఈ లఘువిమర్శనమువలన పరివత్తువారి బృహన్నిఘంటువులో పస యెంత గలదో పాఠకు లూహింపఁ గలరు" అని విమర్శకులు వ్రాసినారు. నిజమే ! ఈ విమర్శపరామర్శమును జూచినఁ బరివత్తువారి బృహన్నిఘంటువులోఁ గల పసయును, దానిపై వ్రాసిన వ్యాసములోని బలహీనతయును స్పష్టము కాఁగలవు.

# కుమారసంభవమే
# 'గూఢవస్తుమయకావ్యము'

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

నన్నెచోడ "వేంకటాదిత్య" కవి తన "కుమారసంభవము(ను) — — గూఢవస్తుమయ కావ్యముగా — — చెప్పి"నాడని తదుదాహరణములతో సిద్ధాంతము చేయవచ్చునని నాపరిశీలనా ఫలితము చెప్పుచున్నది.

"గూఢవస్తుమయకావ్య" పరిభాషాసూచన

ఆంధ్రకుమారసంభవ "కావ్యకర్త — — నన్నిచోడు(డు)." తాను "వేంకటాదిత్యుండ"నని "సూర్యవంశ" బిరుదపర్యాయముగా ప్రకటించుకొనియున్నాడు.

దీని కనుగుణ్యముగ:

"భారవి" కవి తనకిరాతార్జునీయములో "— — (గూఢ)వస్తుకవితను — — ఇంద్రకీలనగారోహణవర్ణనల జనారాధితు"డైనట్లే — వేంకటాదిత్యకవి (భారవి-ఆదిత్యుడు) తన కుమారసంభవములో "——(గూఢ) వస్తుకవితను — — ఉదయపర్వతశిఖరారోహణ — —వర్ణనల జనారాధితు" డైనాడు.

ఇది "గూఢవస్తుమయకా"వ్యోదాహరణ పరిశీలనకు తోడ్పడుచున్నది.

"ఉద్భట"కవి తన "కుమారసంభవము నలంకారము గూఢవస్తుమయ కావ్యముగా — — చెప్పి మెచ్చించి — —"నట్లే వేంకటాదిత్యకవి (ఉద్భటుడు — ఆదిత్యుడు) తన "కుమారసంభవము నలంకారము గూఢవస్తుమయకావ్యముగా — చెప్పి — మెచ్చించె"నని తదుదాహరణములతో నిరూపించవచ్చును.

ఇక, నన్నెచోడాంధ్రకుమార సంభవమందలి:

"కరములు తనుముడు పరముని
వరదునిగాఁ గొలిచి కవితవలనను మనుజన్
కరములు పడసి జగంబునఁ
బరగె మహాకవి యనంగ బాణుఁడు పేర్మిన్."

అనేమార్గ పక్కిలీశ్వర సంస్తుతికి అనుకరణముగా:

సీ. "గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసిన బాణు దలఁచి"

పెదపాటి రొుజ్జాప్రెగడ "కుమార నైషధము"న రచించియున్నాడు.

అయితే, "బాణుఁడు" కాదంబరీ - హర్షచరి త్రాది "గద్య" కావ్యములలో "కరములు తనుముడు— ("దైవజ్ఞ") కవితవలనను మనుజ కరములు పడ (యుడు)" అనే సంకేతగణితసూత్రమునకు లక్ష్యగద్య మును వ్రాసియున్నాడో? లేదో? నాకు తెలియదు. కాని, నన్నిచోడాంధ్రకుమారసంభవములో తదు దాహరణగీతపద్యము కలదు. ఇది "బాణాసుర" కర ఖండన సంఖ్యాచరిత్రతో ("దైవజ్ఞ" — గణితభేద మున్నప్పటికిని) శాలివాహన కరసంఖ్యా చరిత్రను గూఢవస్తుమయ కావ్యముగా ప్రకటించుచున్నది:

"తదీయ (—"బలినందనులు నూఱ్వు రందు లోన నగ్రజాతుండు బాణుఁడు — సహస్రకరుఁడు" అనే—"బాణుని") బాహాసహస్రంబుఁ గరచతుష్టయా శిష్టంబుగాఁ దునుము(డు)"అనే బాణాసుర కరఖం డన సంఖ్యలకును, నన్నిచోడాంధ్రకుమార సంభవ మందలి: "దశశతకరములు తునుముడు — ("దైవజ్ఞ" కవితవలననే మనుజన్ చతుష్కరములు పడ(యుడు)" అనే గణితసూత్రసంఖ్యలకును భేదము లేదు.

ఇంతేకాక, "బలినందనుఁడు — బాణు"నికిని ("చోడ") బలితనూజుఁడు — బాణు" నికిని నామైక జేసే నామగ్రహణ" సాదృశ్యముకలదు.

ఇట్లే, "సహస్రకరుఁడు — బాణు"నికిని, "దశ శతకిరణుఁడు — బాణు (భాను-భాణు)నికిని కరసంఖ్యా భేదము లేదు. కాబట్టి, వేంకటాదిత్యుఁడు తనకుమా

సంభవ గూఢవస్తుమయకావ్యములో: "పద్యంబు చెప్పి శంకరునిచే కరములు (పన్నులు — వార్షికములు) ప్రతిభతో పడసిన బాణుఁడు (ఆంధ్రకావ్యబాణుఁడు)" అనేకీర్తి నార్జించినాడని క్రిందిపద్య సాక్ష్యము కలదు:

"మదమున సత్కవికావ్యము
వదరఁగ విలుకానిపట్టినమ్మును (బాణమును) బరహ్మా
ద్భుదమై తలయూపింపని
యది కావ్యమె యలరి (?) పట్టినదియుం గరమే!"

అని తన "కావ్య బాణ" బిరుదును సమర్థించుటయే కాక, "బాణ కర" ప్రాముఖ్యతను(పర్యాయశబ్దములతో) సూచించియున్నాడని పాఠకులు జ్ఞప్తియం దుంచుకో వలెను. కాబట్టి, "బాణుఁ డనగా (భాణుడనే) తేంక ణాదిత్యుఁడనికాని, ("చోడబల్లిరనూజు"డనే) బలిరనూ జుడనికాని, (బాణములు కలవాడనే) కావ్య బా ణు డ ని కా ని, "వి లు కా" డ ని కా ని (వీ రందరివంటివాడనికాని) చెప్పవచ్చును.

ఇంతవు, నన్నిచోడాంధ్రకావ్యమందలి సంఖ్యా మయ గీతపద్యములో: "గూఢవస్తుమయకావ్య దైవజ్ఞ సుకృతి"ని ధ్వన్యమప్రాణితసంఖ్యానిర్ణయముతో గురు తెరుగవలెనేకాని, కేవలశబ్దార్థములతో కాదని తదుదా హరణ సంఖ్యాచరిత్రము చెప్పక చెప్పుచున్నది.

తేంకణాదిత్యకవి తనకృత్యవతారికలో:

"గుటు తెలిఁగి వస్తుచయమున
కొఱఁగాడు నాదీపవర్తియును బోలె నిజ
మెచ్చఁగి కృతి (గూఢ)వస్తుసమితి(ని)
వఱలగ మది నెఱుఁగువిబుధవర్గముఁ దలకుస్."

అని "నిజ మెచ్చఁగి కృతి(గూఢ)వస్తు సమితిని" పరీక్షింపుడని పాఠకులను హెచ్చరించియున్నాడు. కాన, నన్నిచోడాంధ్ర కుమారసంభవ గూఢవస్తుమయ కావ్యమందలి ధ్వన్యమప్రాణిత సంఖ్యాచరిత్రను నిస్సందేహముగా విశ్వసింపవచ్చును.

ఇంతేకాక, తేంకణాదిత్యకవి తనకృత్యవతారికలో:

"అన్యతారకవితతుల (ఇతర గూఢకవి
సంఘములను) నాదరించి
వెలయ సత్కవిబుధగురుబలమువడసి,
యొనర దైవజ్ఞునట్ల(జ్యోతిష్యునివలె-గణితునివలె)
శుభోదయమున,
దివ్యసుకృతిఁ ("ప్రబంధము"ను)
ప్రతిష్ఠింతుఁ దిరము (స్థిరము)
గాఁగ"

అని ప్రతిజ్ఞ కావించియున్నాడు. కాబట్టి, తేంకణా దిత్య - నన్నిచోడజనవిభుఁడు "జంగమమల్లయవరము నందుఁ గనిన (గూఢ)వస్తుకవిత" నభ్యసించినవాడని తదుదాహరణములతో సిద్ధాంతముచేయ వచ్చును.

## "దైవజ్ఞ" గూఢవస్తుకవితోదాహరణములు

తేంకణాదిత్యకవి తనకృతిపరిసమాప్త్యాశ్వాసములో: "ఇట్లు శతముఖదళశతకరపరిఘశోభితుండై యనేక విధాయుధ వర్షంబులు గురియుచుం దరలనొత్తె" అని బాణగద్యమును వ్రాయుటయేకాక:

గీ. "ద్వాదశాగ్రార్ధపయను నాద్వాదశార్ధ
వదనుఁ డొగిఁ జుట్టె నిజభుజద్వాదశమున
నుదయదళశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టె దళశతకరములఁ జుట్టినట్లు."

అని "అ య్యు ద య న గ" గీ త ప ద్య ము ను వ్రాసి యున్నాడు.

ఈ గీతపద్యము "ఉదయపర్వతశిఖరాగ్రా రోహణ (గూఢ"వస్తుకవితా ) —వర్ణనలు" కలదని "భారవి" — ఆదిత్యుడు — తేంకణాదిత్యుడు తన కృత్యవతారికలో సూచించుటయేకాక, ("ఇయ్యుద యనగ") గూఢవస్తుకవితాకరసంఖ్య"లలో: "కరములు కుసుముడు — ("దైవజ్ఞ") కవితవలననే మనుడగ్ కరములు పడ(యుడు)" అనే సంకేత సంఖ్య లను బోధించి, తాను "దైవజ్ఞ" నివలె "అయ్యుద యనగ"మందు స్థిరముగా "శుభోదయము"ను ప్రతిష్ఠించి యున్నాడు.

ఈ "దైవజ్ఞత్వము" ను "విస్ఫురదవదాత ఖడ్గ లత పూచెనో నా జయ చైత్రసంపదఁ."

* * * *

"(గూఢ)శక్తిధరముఖవిజయ ప్రశస్తశాసన లిఖి తాక్షరంబు లయ్యె" నను దైవజ్ఞ శాసనలిఖితాక్షరం బులు బలపఱచుచున్నవి.

ఆతరవాత వాడి కందరూ పని చెప్పారు. వాడు పని తలాయించటం ప్రారంభించేటప్పటికి పదిరోజులు గడిచింది. వాణ్ణి నిలవదీసి "నువ్వెవరు? నిన్నెవ రిక్కడ పని చెయ్యమన్నారు?" అని అడిగేటప్పటికి వాడికి కంపెనీవారు నెలజీతం బాకీ ఉన్నారు. ఆ జీతం ఇంత అనిమాత్రం వాడికే తెలియదు.

అయిత దేదో అయిపోయింది, ఉన్న వాణ్ణి ఉండనిమ్మన్నారు కంపెనీవారు. ఇంత డబ్బుఖర్చుపెట్టి చిత్రంతీస్తూ నెలకు పదిహేను రూపాయల దగ్గిర వెనకాడటం నామర్దాగా తోచింది వారికి. నాచెవిలో రహస్యంగా ఒక భాగస్థుడు చాలా దూరాలోచన చేసి అన్నాడు, "ఇప్పుడు మనం వీణ్ణి వెళ్లగొడితే వాడు మనం తీసే టాకీని గురించి ఏకేస్తాడు!" అని.

స్టూడియో మాట్లాడటానికి అయిదుగురుభాగస్తులు వెళ్లారు బొంబాయికి. అక్కడ ఒకడిసహాయం తీసుకున్నారు. వాడు స్టూడియోవారి దగ్గిరనించి ఖచ్చితంగా వెయ్యి రూపాయలకమిషను మావాళ్లకళ్లఎదటే కొట్టేసి మేం తియ్యబొయ్యే చిత్రాన్ని పుత్రపౌత్రాభివృద్ధిగా దీవించి తనదారిన తాను చక్కా వెళ్లాడు. అనుకున్న స్టూడియోఅద్దెలోసగం అడ్వాన్సు పారేసి, టెక్నీషియనుల చేతుల్లో, ఎందుకైనా మంచిదని తలా ఒక నూరురూపాయల పచ్చకాగితమూ పెట్టి దిగ్విజయంచేసిన మోహాలతో ఇంటికి తిరిగి వచ్చారు మావాళ్లు.

మేము బొంబాయి ప్రయాణమయ్యే వరకు మాకయినఖర్చు ఇరవైఅయిదువేలు కూడా లేదు!

నేను ప్రొడక్షనుమేనేజరు కావటంవల్ల భోజనాదిసౌకర్యాలన్నీ చూడటంపనిమీద నేనుండిపోయినాను.

మాడైరెక్టరును మేం బొంబాయిలోనే బుక్కుచేసేసుకున్నాం. అతను తెలుగువాడే. బి. ఏ తప్పి తండ్రి చావగొడతాడనే భయంతో తల్లినగలు కొన్ని చేతపట్టుకుని బొంబాయి పారిపోయివచ్చాడుట. బొంబాయిలో అయిదారు నెలలు జలసాగా గడిపాడు. హోటలుకు నెలా పదిహేను రోజులకు బాకీ పడితే, వాళ్లు అతనిబట్టల పెట్టె తొక్కిపెట్టి డబ్బు తీసుకు వచ్చి పెట్టె పట్టుకుపొమ్మన్నారు. ఆ స్థితిలో మాముఠా వచ్చి దిగినట్టు తెలిసింది అతనికి; నేరుగావచ్చేసి మాలాడ్జిలో ఒకపూట మకాం పెట్టి ముందు కవిగారితో స్నేహంచేశాడు. కవిగారు, దొరికాడే చాలునని, తాను రాసిన పద్యాలన్నీ అతనికి వినిపించాడు. మాఅతిథి ఆపద్యాలకు అట్టె పరవశుడైపోయినాడు; ఆ పారవశ్యానికి కవిగారు పరవశుడైపోయి మన కింతకంటె మంచిడైరెక్టరు దొరకడని ఖచ్చితంగా చెప్పాడు. డైరెక్టరన్నప్రాణికి మూడువేలకు తక్కువ ఎట్లా ఇస్తారు కనకా? పైగా అతనికి బొంబాయిలో ఉన్నస్టూడియోలపేర్లూ, వాటిని పరిపాలిస్తున్నవారి పేర్లూ, నటులపేర్లూ, వారి జీతాలూ సమస్తమూ తెలుసును! ఇంకో డైరెక్టరుకు మాత్రం ఆవిషయాలనుగురించి అంతకంటె ఏంతెలుస్తుంది?

మాడైరెక్టరుగారు అడ్వాన్సు తీసుకొని పనిలో ప్రవేశిస్తూనే తనకు మరొక ప్రభావతి కావాలన్నారు. ఆయన వెంట నన్ను తోడిచ్చి ఆంధ్రదేశం పంపారు ప్రభావతిని

మళ్లా బుక్కు చెయ్యటానికి. దిగిన గడప ఎక్కకుండా మే మిద్దరమూ అయిదువందల ఇళ్లయినా తిరిగాం. ఆఖరుకు చూపులకు బాగా ఉండే పిల్లను చూసి మా డైరెక్టరు బుక్కు చేశాడు. ఆపిల్ల పేరు మాణిక్యం. దానికి 'పూర్వానుభవం' లేదు. ఫరవా లే దన్నాడు డైరెక్టరు. అది కంట్రాక్టు కాగితం మీద 'మణికం రాలు' అని రాసింది. మా డైరెక్టరుగారు 'మా'కు దీర్ఘమూ, 'కా' కు క్యావడీ స్వయంగా తగిలించి 'రాలు' అనే పదం వాడుక భాషే. నసే నెపంమీద అల్లాగే ఉండనిచ్చారు.

కుమారి మాణిక్యాదేవినీ దాని తల్లినీ వెంట బెట్టుకుని బొంబాయి వచ్చాం. దారి లో మాడైరెక్టరుగారు నాతో లోపాయ కారిగా అన్నాడు:

"డైరెక్టర్లు హీరోయిన్ భుజాలమీద చెయ్యి వెయ్యటమూ, పక్కన కూర్చో బెట్టుకోవటమూ ధర్మం— విధి—ఆచారం. అది చూసి తెలియనివాళ్లు ఏడుస్తారు!" అని.

నే నట్లా ఏడిచేవాణ్ణి కానని చెప్పాను. అధర్మంగానే ఆడవాళ్లమీద చెయ్యి వేసే జబ్బు నాకు చాలాకాలమై ఉందని కూడా చెప్పాను.

డైరెక్టరుగారు నావంక పెద్దకళ్లు చేసి చూసి, "కొంపతీసి మనలాడ్జిలో అటు వంటి వేమీ చెయ్యకండి! చాలా లొల్లి అయి పోతుంది" అన్నారు. ఆతరవాత అసంద ర్భంగా, "మణిమాత్రం, బోగందయినప్పటికీ అందరినీ మీద చెయ్యివెయ్యనివ్వదు!" అని కూడా అన్నారు.

"కంపెనీ డైరెక్టర్లుతప్ప రేమో?" అన్నాను. డైరెక్టరుగుండెలో పిడుగుపడింది.

మణికీ తల్లికీ వేరే లాడ్జి ఏర్పాటుచేయిం చాడు డైరెక్టరు. మేము బొంబాయి చేరే లోపల అక్లాజు చేర్చబడ్డది మాణిక్యాలదేవి కంట్రాక్టులో!

ఈ మేళం నాకు కొంత తెలుసునని తెలిసి మా డైరెక్టరుగారు నన్ను తనకు అసిస్టెంటు గా వేసుకున్నారు. ఆనాటినించీ నా సిగరెట్ల ఖర్చూ, సినిమాలఖర్చూ ఆయనే పెట్టకో సాగాడు.

మాడైరెక్టరుగారి కేమీ తెలియదని మా కంపెనీవారికి తెలియటానికి రెండు నెలలు పట్టింది. ఆ రెండు నెలల మింజుమలే మేము షూట్ చేసిన ఫిలిము నంబర్లతో సహా అయిదు వేల అడుగులకు పైబడ్డది!

స్టూడియో యజమానే మామీద కనికరించి, "మీ డైరెక్టరు ఎందుకూ పనికి రాడు. మీ అసిస్టెంటు డైరెక్టరును అడ్డం పెట్టుకుని పని కానివ్వండి. మా టెక్నీషి యనులు చాతనయిన సహాయం చేస్తారు!" అని చెప్పినతరవాత మా కంపెనీవారికి కొంచెం నిద్రమత్తు వదిలింది.

నేను వెనకటి వందరూపాయల జీతం మీద నేడైరెక్టరు పదవిస్వీకరించాను. ఆనాటి నించీ నేను పచ్చివెలగకాయలాగా అందరి గొంతులకూ అడ్డుపడ్డాను; నా గొంతుక్కు అడ్డుపడింది మణి.

నన్ను డైరెక్టరు చెయ్యటం నటుల కెవరికీ ఇష్టంలేదు. నేను నాధర్మం నిర్వర్తిం చటం వారికి అవమానంచెయ్యటంగా

తోచింది. నేను సెట్టింగుమీద డైరెక్షను ఇస్తుంటే ఒకానొకనటుడు చాలా ఎగతాళిగా, "అయ్యా, ఒక్కరోజులో మేము డైరెక్టరు కాలేకపోయినప్పటికీ, మాకూ స్టేజిమీద పదిహేనుసంవత్సరాల అనుభవం ఉందండీ!"అన్నాడు. కామెరామాన్ ముందుకు వచ్చి నాతో, "ఆ జంతువు ఏమిటి లెక్చరిస్తాడు సరిగా నిలబడ్డేం?" అన్నాడు హిందీలో. ఆజంతువు నాతోఅన్నముక్క అతనికి తర్జుమాచేసి చెప్పాను. "వెధవను బూటు తీసుకుని బయటికి తగులు! "అన్నాడు కామెరామాన్. సాటిఆంధ్రుణ్ణి పైవాడట్లా అంటుంటే నాకు కష్టమేవేసింది.

నామీద చాలా రిపోర్టులు వెళ్ళినై మా ప్రొప్రయిటర్లకి. వారు నన్ను పిలిచి,"అయ్యా మీకు నటులజోలి దేనికి? మీడైరెక్షనేదో మీరు చూసుకోండి! అని సవినయంగా చెప్పారు.

ఇక మణివిషయం. నేను డైరెక్టరుగా వ్యవహరించినంతకాలమూ నాస్వార్థం ఏమీ చూసుకోలే దనటానికి మణికంటె మంచి ఉదాహరణ ఇవ్వలేను.

మాటాకీలో నటించటానికి వచ్చిన మూకలోకల్లా మంచిదీ, నన్ను గురించి అసహ్యంగా మాట్లాడనిదీ అది ఒకతే. కాని అందరిలోకీ అసమర్థురాలుకూడా అదే— అది వేస్తున్న వేషాన్నిబట్టి చూస్తే. నన్ను నానామాటలూ అన్నవారినీ, అవమానించినవారినీ, నన్నుపడగొట్టటానికి సర్వకష్టాలూ పడ్డవాళ్లనీ క్షమించాను - మణిని క్షమించలేదు. మణిమంచితనానికి ముప్పాతిక మూడువీసాలుకారణం అది విడిగా, వేరే లాడ్జిలో ఉండటంకావచ్చు. కాని అదిఅందరూ ఉన్న లాడ్జిలోనే ఉండి, అందరితోపాటు నన్ను తూలనాడితే అందుకు నేను దానిమీద వేరే పగ సాధించి ఉండేవాణ్ణి కాను.

నేను మణితో మొదటినించీ చెబుతూనే వచ్చాను— "నువ్వు కథానాయికవు. ఈటాకీ పాడయినా బాగయినా నీమీదే ఉంది- ఈ స్థితిలో మిగిలిన అందరికన్నా ను వ్వెక్కువ శ్రమపడాలి" అని.

నిజానికి మణి శ్రమపడ్డది. కాని నాకు కావలిసినఫలితంమాత్రం కనిపించ లేదు. దాని చేత మాటలు సరిగా చెప్పించటానికీ, సరిగా సంగీతం పాడించటానికీ రోజుకు పదహారు గంటలు రిహార్సలు చేయించాను. దానికోసం షూటింగు ఆపించాను. ఆ రిహార్సలుకోసమని రాత్రీపగలూ అక్కడేపడిఉండి, అక్కడే భోంచేసి,అక్కడేనిద్రపోయినాను. నాప్రాణం ఎట్లా విసికిపోయిందో, ఒక్కొక్కముక్క దానిచేత చెప్పించ లేకపోతుంటే నానరాలు పెటపెటా ఎట్లా తెగిపోయినవో, ఓర్పు చచ్చి దానిమీద ఎట్లా ఎగిరిపడ్డానో, ఆఖరుకు నేనంటే దానికి ఎంత సింహస్వప్నమయిందో ఎవరు విచారించారూ ?

"ఇంకేం షూటింగు ? మా డైరెక్టరు మణిని తగులుకున్నాడు!" అని ప్రారంభించారు మా నటీనటులు. ఇట్లా అంటున్నారని నాకు తెలుసును. కాని నేను లెక్కచెయ్యలేదు.

మణిని బాధ పెట్టటంలో నిజానికి అర్థం లేదు. అది అన్యాయం. మొదటినుంచీ ఆ టాకీలో కలిగిన వంకర లన్నీ మణిచేత సరిచేయించటానికి ప్రయత్నం చేస్తున్నానని నాకు తెలుసు. టాకీమీద లాభం వస్తే నాకు దమ్మిడీ రాదు. కాని టాకీ

బాగుపడాలనే యావ తప్ప నాకు మరొకటి లేదు. నన్నట్లా సృష్టించాడు దేవుడు.

కాని నా అంతరాత్మ నాకు చెబుతూనే ఉంది, కల్లాలు వదిలేసి టాకీని దాని తోవన దాన్ని పోనిమ్మని. ఆ ప్రబోధం నాకు చాలింది కాదు. అంతకంటె మంచి ప్రబోధం నాకు మణే కలిగించింది.

ఒకనాడు పగలల్లా మణిచేత వెట్టిచాకిరీ చేయించాను. అక్కడే భోంచేసి రెండు గంటలు దానికి విశ్రాంతి ఇచ్చి మళ్లీ రాత్రి తొమ్మిదింటినించీ రిహార్సలు ఎత్తుకున్నాను. అర్ధరాత్రి పదకొండుగంట లయింది. మణి తల్లి మాతో విసికి నిద్రకుపడ్డది. నాకూ శరీర మంతా యంత్రంలో పెట్టి ఒత్తినట్టున్నది.

అకస్మాత్తుగా మణిచేతులో ఉన్న కాగితాలు పక్కన పెట్టి, రెండుచేతులూ ఎత్తి జోడించి,

“నన్నెందుకీవిధంగా చంపుతారు? నాకీపని చేతకాదు. నన్నింటికి పోనివ్వండి! నన్ను బుక్కుచెయ్యమని నేను మీ వెంటపడలేదు. మీరే నన్ను వెతుక్కుంటూవచ్చారు. ...

“నేను నిజంగా అంత మందమతిని కాను. మీ రెదురుగా పులిమాదిరిగా కూర్చుంటే నేను బెదిరిపోతున్నాను. నేను ఒంటరిగా ఉన్నప్పుడు ఈ మాటలే ఇంతకంటె బాగా అనుకోగలను.

“మీ రింత క్రూరంగా ఉంటారని నే నెరగను. ఈ డైరెక్టరుపని తీసుకునేవరకూ ఈ లాడ్జిలో మీరే మంచివా రనుకున్నాను. నా అదృష్టమో పాపమో, మీరు అందరినీ మించిపోయినారు!” అని బొటబొటా కన్నీరుకార్చి ఏడవసాగింది. నా కాక్షణంలో దాన్ని చూస్తే అపరిమితమైన జాలి వేసింది.

పాపం! అది ఎన్నడూ ఇటువంటి శ్రమపడి ఎరగదు. తల్లిఎంత గారాబంగా పెంచిందో, దానికి అక్షరజ్ఞానంకూడా సరిగా లేదు.

నేను మృదువుగా, “నాప్రాణంకూడా విసిగిపోయింది, మణీ! ఇక ఈటాకీ గొడవ ఎత్తను. ఇది ఇవాళ ఉంటుంది, రేపు పోతుంది. అంతకంటె శాశ్వతమయిన విషయం ఏమంటే, నువ్వాడదానివీ, నేను మగవాణ్ణీనీ. ఆసంగతి ఈ పదిహేనురోజుల్లోనూ, ఒక్క క్షణమైనా నాకు జ్ఞాపకం రాలేదు. ఆబడితెలు నాకు ఆసంగతి స్పష్టంగా అర్థమయేటట్టు చెబుతూనే ఉన్నా, నా మట్టిబుర్ర కెక్కలేదు. ఇకముందు ఆమాట మరిచిపోను... ఆదీపం ఆర్పేసి ఇట్లా వచ్చి కూర్చో! కబుర్లు చెప్పు!” అన్నాను.

* * * *

మా ప్రొడ్యూసర్లు ఎంతసేపు నన్ను దెప్పినా నేను మాణిక్యాన్ని తగులుకుపోయినానని, అందువల్ల వాళ్లకు కలిగిన మేలు, నేను చేసిన ఏమంచిపనివల్లాకలగలేదు. నన్ను చూస్తే భయం పోయి, నాదగ్గిర చనువు దొరికిన తరవాత మణి నాకు కావలసినట్టు నటించగలిగింది. ప్రభావతీప్రద్యుమ్నం దిక్కూ దివాణమూ లేకుండా పోయిందంటే దానికి తగిన కారణాలు వేలసంఖ్యలో ఉన్నై. మాణిక్యం ఏమీ చెడలేదు. ఆ దరిద్రపు చిత్రంలో దాన్ని చూసి అది పనికివస్తుందని కనుక్కోగలిగిన పెద్దమనుష్యులు అప్పుడే దాన్ని మరొక టాకీలోకి బుక్కు చేశారు. రేపీపాటికి అది మరొక ఆంధ్రతార అయి కూర్చుంటుంది.

ఎటు వచ్చీ అకారణంగా ఎందుకూ కాకుండా పోయిం దెవరంటే — నేనే.

# ఆంధ్ర తేజము

(రెడ్డిరాజులకాలమునాటి యాంధ్రదేశచరిత్రాత్మక నాటకము)

శ్రీ నండూరి బంగారయ్య

(అనువృత్తము)

రెండవ యంకము — ఏకరంగము

[రంగము—రాచకొండలో అనపోతనాయని కొలువుకూటమునకు చేరియున్న యుద్యానవనము.

ప్రవేశము—భ్రమరాంబ, విజయాంబ.]

విజయాంబ — (నిట్టూర్పు విడుచుచు) నేను విశ్వసింపను. నేను విశ్వసింపను. నేనే కాదు యీనాటి యాంధ్రజాతిని ప్రత్యక్షముగ జూచుచున్నవా రెవ్వరును విశ్వసింపరు.

సీ. కలనాఁటి నాఁగ్త యీ తెలుఁగువీరుని కత్తి మగధరాజ్యము నేలి నెగడె నఁట;
ఆకాశవారశ్రీ మీ యాంధ్రజాతియాళువ్న యవనన రక్తిపోట నాడె నఁట ;
తెలతిక్క ప్రాతి యీ తెలుఁగుశిల్పప్రౌఢి వివిధజాతుల గురుపీఠ మనఁట ;
పుక్కిటిగాఁగ యీ భూమండలం బెల్ల తెలుఁగురత్నములతో నెలిగె నఁట ;

గీ. ఇతరజాతుల పదముల కెరఁగి రొరఁగి,
సేవజాలని యాంధ్రుని చేవ జూచి
ఎవతె నమ్మును ప్రాచీనకవులసూక్తి ?
భారతీదేవి! యీ మృషావాద మేల?

భ్రమరాం — అక్కా! మన కీ చరిత్రగాథ లెందులకు? మరియొకకాలక్షేప మేదైనఁ జూచుకొనరాదా ?

విజయాంబ — చెల్లీ! ఆంధ్రక్షమామండలేశ్వరుడగు అనపోతనాయని యల్లారు ముద్దుబిడ్డ కాంధ్రులచరిత్ర మనిన ఇంత వైముఖ్యమని ఎన్నడును నేను గ్రహింపలేక పోయితిని.

భ్రమరాం — విజయము! చల్లగాలి కుద్యానవనవిహార మొనర్పవచ్చిన మనకు చరిత్ర గాథ లెందుల కంటినిగాని—

విజయాంబ — ఆర్యమతద్వేషులు ఈ దేశమున నడుగుపెట్టినదిమొదలు మనకు చల్లగాలి యెక్కడిది? సంవత్సరము పొడుగునను రోహిణీకార్తియేకాదా ?

భ్రమరాం — మరల నారంభమా ?

విజయాంబ — ఉద్యానవనవిహారమా ? ఇంకను ఆంధ్రుల కుద్యానవనవిహారమా ? నందనోద్యానమువంటి యాంధ్రదేశము క్రమక్రమముగ నరికప్రాయ మగుచుండగ—

భ్రమరాం — అక్కా! నేను చెప్పదలచుకొనినమాట నీవు వినదలచుకొనలేదా ?

విజయాంబ — భ్రమరా! చెప్పుము.

భ్రమరాం — అయిదారుదినములనుండి యేదో దీర్ఘవిచారమున నీవు మునిగియున్నట్లు తోచినది. అందుచే రవంత వనవిహారమువలన నేమైన లాభముండునేమో యని నిన్నిచ్చటకు దీసుకొనివచ్చితిని.

విజయాంబ — చెల్లీ ! నాయందలి యనురాగముచే నీ వెన్ని చికిత్సలో చేయుచున్నను లాభ ముండునని నాకు తోచదు.

భ్రమరాం — (చిరునవ్వుతో) వెనుక ప్రబంధములలో విరహవేదన కెట్టి లక్షణములు చెప్పిరో అట్టి లక్షణములు నీయం దగపడుచున్నవి. క్షమింపుము.

విజయాంబ — క్షమింపనక్కర లేదు. నీవు నిజమే పలికితివి. విరహవేదనమే నన్ను వేధించుకొని తినుచున్నది. మనోవ్యాధికి మందు లేదుకదా ?

భ్రమరాం — అదేమిమాట? విరహమునకు ప్రియసమాగమమే మందని పెద్దలు చెప్పుదురు.

విజయాంబ — ప్రియసమాగమ మసాధ్యమైనచో ?

భ్రమరాం — అసాధ్యమా ? ఆంధ్రక్షమామండలేశ్వరుని పుత్రిక కసాధ్యమా ? అక్కా! నీయందలి భక్తిచే నీకయి నే నెంతటి యసాధ్యము నయినను సాధించి తీరెదను.

విజయాంబ — తీర నామనోరథము తెలసినవెనుక నీ కీ నిశ్చయము నిలువదుసుమా ?

భ్రమరాం — నీవు దేవకుమారుని వరించియుండవుకద ?

విజయాంబ — దేవకుమారులకు గూడ దుస్సాధ్యమగు పదార్థమును నేను వరించితిని.

భ్రమరాం — (చిరునవ్వుతో) పదార్థ మనుచున్నావు. నపుంసకలింగమును వరించితివా ?

విజయాంబ — త్రిలింగాతీతమగు వస్తువును నేను వరించితిని.

భ్రమరాం — బ్రహ్మపదార్థమును వరించితివా ?

విజయాంబ — నేను వరించినవస్తువు బ్రహ్మపదార్థముకంటెను దుర్లభము.

భ్రమరాం — చిన్నప్పటినుండియు నీవు నాపయి వర్షించు ననురాగమునుబట్టి నన్ను వేపుకొని తినుటలో నీ కింత పాండిత్య మున్నదని యెరుగనైతిని.

విజయాంబ — చెల్లీ! ఆంధ్రాభ్యుదయమును నేను త్రికరణశుద్ధిగ వరించితిని. దానిని సాధించుటకు నీవేమయిన సాయము చేయగలవా?

భ్రమరాం — ఇదేదో సామ్యము చెప్పినతరువాయిగ నున్నది. ఆంధ్రాభ్యుదయ మనగ దాని కేమి కన్నా? కాలా?

విజయాంబ — అన్నియు నున్నవి. చూడనేర్చినవారి కన్నియు నున్నవి.

భ్రమరాం — నీమాటలు వినినకొలది నాకు మతిపోవుచున్నది.

విజయాంబ — ప్రకృతము జరుగబోవుచున్న ఈధరణికోటయుద్ధ మాపగలవా? అట్లయినచో నాంధ్రాభ్యుదయము తనంత తానే నీకు గోచరించును.

గీ. యుగయుగంబులుగా దవయార్తిమాలి
కల మహోన్నతశిఖరముల్ గౌగిలించు
నాంధ్రులచరిత్ర నేడు నాయాత్మలోన
లీనమై దివ్యసందేశ మీనుచుండె.

భ్రమరాం — సర్వసేనాధిపత్యము మీజనకునిదే గదా! ఆయనతో నేల వాదింపలేకపోయితివి?

విజయాంబ — వాదింపకేమి? ఎన్నోవిధముల వాదించితిని. కాని ఆయన యేమిచేయుటకును స్వతంత్రుడు కాడుగదా! అందుచే నిన్నాశ్రయించుచున్నాను. నీమాటను మీనాయనగారు తప్పక ముద్దుచేయుదురు.

భ్రమరాం — అక్కా! నిజము చెప్పవలదా? నాయనగారితో మాటాడుటకు నాకు ధైర్యము చాలదు. అదిగాక ఆడువారికి మన కీ రాజకీయవ్యాపారములతో నేమి జోక్యము?—

విజయాంబ — నేను చేసిన చరిత్రబోధన మంతయు వృథయైపోయినదా? అదిగో ఆకనపడుచున్న భవనము పేరేమో యెరుగుదువా?

భ్రమరాం — అది నాయనగారు కొలువుండు భవనము కాదా?

విజయాంబ — అవును. దానిపేరేమో నీ వెరుగుదువా యని యడుగుచున్నాను.

భ్రమరాం — రుద్రమనగరు కాదా?

విజయాంబ — పురుషవేషమును ధరించి ఈయాంధ్ర భూమండలమునంతను యేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన రుద్రమదేవిపేరున నది నిర్మితమయినది.

భ్రమరాం — కానిమ్ము.

విజయాంబ — ఆమెకు సజాతీయులమని చెప్పుకొనుటకు నీకు లోలోన లజ్జవొడముట

లేదా? రుద్రమదేవితో బోల్పదగిన వీరులును పాలకులును మగవారిలో నెందరుందురో?

భ్రమరాం — సరి, ఎక్కడనో నూటి కొకతె కోటి కొకతె — ఉండిన నేమాయె?

విజయాంబ — అట్లు త్రోసివేయకుము. "ఆర్యధర్మములకు గ్లాని కలుగనున్నపుడు కుమారునిచే విజాతీయులను పారద్రోలించి స్వధర్మమును రక్షించితి"నని గర్వముతో జయస్తంభము నిలిపిన గౌతమి యిప్పటికిని ఆంధ్రహృదయసింహాసనము నధిష్ఠించి రాజ్యముచేయుచున్నది కాదా?

భ్రమరాం — నీ వెన్ని చెప్పుము. నాయనగారితో వాదించుటకు నాకు ధైర్యముచాలదు. అదిగాక ప్రకృతిసిద్ధముగ నాడుదానికిని మగవానికిని ఎంతో తారతమ్యమును భగవంతుడే కల్పించినాడు. ఈనాడు ప్రకృతికి విరుద్ధముగ మనము వర్తించినచో దేశమున కుపద్రవకరమని నాయభిప్రాయము—

విజయాంబ — ఏదో యొకయంశమున నయిన నీయభిప్రాయ మనునది యొకటి యున్నందులకు పరమసంతోషము.— నాకు సెలవిమ్ము.

భ్రమరాం — అక్కా యెక్కడికి బోయెదవు? అదిగో మోసాలలో నయిదు మ్రోగుచున్నది. పేరోలగమునకు నిర్ణీతసమయము సమీపించినదిగదా? మనము దానికి బోవలె ననుకొంటిమిగాదా?

విజయాంబ — లక్కబొమ్మలవలె గూరుచుండుటకు పేరోలగమునకుఁ బోనేల? ఇది మాత్రము ప్రకృతివిరుద్ధము గాదా? మనకు స్వాభావసిద్ధమయిన స్థానము అంతఃపురమే కాదా?

భ్రమరాం — (విజయాంబను గౌగిలించుకొని) విజయము! కోపము వచ్చినదా? అవకాశమునుబట్టి నీయాజ్ఞ నెరవేర్చెదను లెమ్ము.—

విజయాంబ — (తనలో) ఇది నాకన్నీళ్లు తుడుచుట కనుచున్నమాట. (ప్ర) నా కించుక తలనొప్పిగ నున్నది. నన్ను పోనిమ్ము—

భ్రమరాం — (తనలో) ఒకవిధముగ నీమె సభకు రాకపోవుటయే మేలేమో!

(ప్రవేశము గన్నమనీడు)

గన్నమనీ — మీ రింకను ఇక్కడనే యున్నారా? ఆవల పేరోలగము ప్రారంభ మగుచున్నదే?

భ్రమరాం — అక్కకు తలనొప్పిగ నున్నదట.— ఆమెను పోనిమ్ము. మన మిరువురమును నిండోలగమునకు బోవుదము.

గన్నమనీ — అయ్యో!—అక్కా! నీకు తలనొప్పి వచ్చినదా?

రుద్రమాంబ — (తనలో) నాతలనొప్పి యీనాడు వచ్చినదిగాదు. దేశద్రోహమున కాది పీఠమగు మీయింటిలో నెప్పుడడుగు పెట్టితినో అప్పటినుండియు నున్నదే! తల్లీ ఆంధ్రమాత!

ఉ. నీవు సమస్తభారత వినిర్మల దివ్యయశస్సరస్సులో
కేవల రాజహంసివయి క్రీడ యొనర్పగ జూచుభాగ్య మీ
సేవకురాలికిన్ గరుణసేయకపోయినపోయె; నిత్య సౌ
భాగ్యవహాయుష్మ దార్ద్రిహృదయంబున నొండొకతావు చూపుమా!

(ప్ర) అవునన్నా! నాయొడలిలో బొత్తుగా ననారోగ్యముగ నున్నది.— పోయి రవంత విశ్రమించెదను.—

(నిష్క్రమించును.)

(తెరలో వైతాళికులు)

ఉ. చేసితి రక్తతర్పణము చేతులలావున జల్లిపల్లిలో
మీసము దువ్వరాజులకు మృత్యురమాలలవావిహారవి
న్యాసము జూపి చూపి కలనన్ నటియించెడి ఖడ్గపుత్రికా
హాసము దిక్కులన్ పెరయ నాంధ్రధరారమణీమనోహరా!

[అంతట తెర తొలగ నవపోతనాయని పేరోలగము. ప్రవేశము ఉచితాసనములపయి గూరుచుండి అనపోతనాయడు, మాదానీడు, మంత్రులు, ఇతరోద్యోగులు. రుద్రమాంబ గన్నమనీడు కొలువు ప్రవేశించి యర్హాసనములపయి గూరుచుందురు.]

మాదానీ — సాధు! వైతాళికా! సాధు! చక్కగా వచించితివి.

చ. కొలని ప్రతాపరుద్ర నృపకుంజరు డిచ్చిన విద్య పేర్మికిన్
తెలువము గూర్చు నీ సహజశేముషి యాంధ్రుల కల్పవృక్షమై
వెలయ స్వతంత్ర రక్తిమెయి తీరనికాయము నాంధ్రలక్ష్మికిన్
గొలువు వొనరింపగా బనుచు క్రొల్వులి నీ నవపోతభూపతీ!

అ. పో. నా — కుమారా! మన మెంత దీక్షతో బనిచేసినను ఆంధ్రలక్ష్మికివి యనుకూల దినములుగ గానరావు. ఈ రెడ్లయొద్దనుండి వార్త వచ్చినదా?

మాదానీ — ఇంకను రాలేదు.

అ. పో. నా — రాదు. రానేరాదు.

మాదానీ — ఈదినముతో వారు కోరిన గడువు ముగియును గదా?

అ. పో.నా — ఇట్టివి ఈవర కెన్ని గడువులు ముగియలేదు ? అబ్బ! అబ్బ! ఏమిగర్వము! ఏమి స్వాతిశయము! తమకంటె గోబ్రాహ్మణహితైకతత్పరులు లే రనియు, తమ కంటె దానకర్ణులు లేరనియు.

మాదానీ — అన్నగారూ! వారి ననవలసినపని యే మున్నది? పామునకు పాలు పోసి పెంచినట్లు వారికి రాజాశ్రయ మిప్పించి మన మీా దేశమున కింత ముప్పు దెచ్చి పెట్టితిమి.

అ. పో.నా — అటు లనకుము. నేను మొదటినుండియు ప్రతిఘటించుచునేయున్నాను. శిష్య వాత్సల్యముచేఁ గొలని ప్రతాపరుద్రులే యిట్టి దేశోపద్రవమును దెచ్చిపెట్టినారు.

మాదానీ — గురునింద మన కేందులకు? వారు మాత్రము భవిష్యత్తును కలగాంచిరా?

అ. పో.నా — అటు లనకుము. పూవు పుట్టినప్పుడే వాసన తెలియును. ఈదేశద్రోహచింత వారి కనాదిసిద్ధముగాని యీనాడు పుట్టుకొనివచ్చినది కాదు. పలుకుబడియందు, పరాక్రమమునందు, ప్రాభవమునందు, అన్నిటియందును మనకంటె నధికుల మనుగర్వము వారి కున్నది.

మాదానీ — పులిని చూచి నక్కవాత పెట్టుకొనిన ట్లున్నది. మనము శ్రీశైలమునకు సోపానములు నిర్మించిన, వారును శ్రీశైలమునకు సోపానములు నిర్మించుటా? మనము బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చిన వారును బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చుటా ?

అ. పో.నా — వీని నన్నిటిని అటుండనిమ్ము. చక్రవర్తియాజ్ఞను తిరస్కరించుటకు వారి కెన్ని వేలగుండె లుండవలెను ? ఎవరికి వారే యనుతీరున నాయకు లుండగ నింకను నాంధ్రసామ్రాజ్యస్థాపనమా? ఇంతకు నాంధ్రజాతియదృష్ట మిట్లున్నది.

(ప్రవేశము, ప్రతీహారి)

పతీహారి — దేవా! అద్దంకినుండి యన్నా రెడ్డిగారు రాయబారము తెచ్చినారట.

మాదానీ — సత్వరముగ బ్రవేశపెట్టుము.

పతీహారి — చిత్తము.

(నిష్క్రమింపగ నన్నా రెడ్డి యీక్రింది పద్యమును చదువుచు బ్రవేశించును.)

న్నా రెడ్డి —

సీ. ప్రాచీనఋషులకు పాఠముల్ చెప్పగా జాలినవేదార్థసారమతుల,
నిర్జీవశిలలచే నృత్యమాడింపంగ నేర్పుగల్గిన కలానిపుణమతుల,
పరవీరశిరముల బంతులాడించుచు క్రీడింపనేర్చిన వాడిమగల,
సర్వసర్వంసహాచక్రపాలనమైన నడిపింపనేర్చిన నాయకులను,

గీ. కలరు పెక్కండ్రు తెమగుధూములను నేడు;—
ఉండి ఫలమేమి ? వారిలో నొక్కరయిన,
నను దినంబు గృహించు నీ యార్తరావ
మాలకింపదలంప రో యాంధ్రమాత !

(అనపోతనాయనితో) నాయకాగ్రణీ ! నమస్కారములు.

గన్నమనీ — (తనలో) మహారాజా యనినచో నాలుక పడిపోవును కాబోలును.

అ. పో.నా — అన్నచమూపతీ ! నీ వాసనము నలంకరింపుము. మీసీమలోని ప్రజలకు నేమమేకద ?

మాదానీ — (తనలో) అన్నగారు తగినశాస్తి చేసినారు. ప్రజలసేమము నడుగుటచే ప్రభువుల నుపేక్షించుట కాదా ?

అన్నారెడ్డి — ఏమి చెప్పను.

ఉ. లేవు; తెనుంగుబిడ్డలకు లేమి కొలంచెడి మందిరో జులే
రావు; శమీపజాతులకు రాజ్య మొసంగుచు స్వీయలబ్ధికై
పావనమాతృదేశపదపంకజముల్ మరుమాకుచుండు నా
కావిలనిత్తు శ్రీ సొగల నాంధ్రుల నాయకులై వెలుంగగన్.

మాదానీ — (తనలో) కల్బరగి సుల్తానుతో జేసికొనిన సంధికై యీతడు మమ్మెత్తిపొడుచుచున్నాడు. కానిమ్ము దీనికి తగినసమాధానము నన్నగారే ఈయవలయును.

అ. పో.నా — ఇప్పటికయినను ఆంధ్రాభ్యుదయమునుగూర్చి మీయన్నదమ్ముల కింత దీక్ష యుదయించినందులకు సంతసింపవలసిన దే.

అన్నారెడ్డి — మా కెంతదీక్ష యున్న నేమిలాభము ? ఇంకను తథాస్తుదేవతలకు దయపుట్ట లేదుగదా !

గీ. ఎంతకాలమునుండియో స్వాంతమందు
కరడుగట్టిన యాంధ్రైకశ్యకాంక్ష దీర,
సీమ లొండొంటిఁ గౌగిట జేర్పబోవ
నడ్డు పడజూచు గ్రహముల కంజలిడుదు.

అ. పో.నా — నిజముగ నడ్డుపడుచున్నవా రెవరో మీయన్నదమ్ములే చెప్పవలయును.

అన్నారెడ్డి — మేము చెప్పెడు సమాధానము మీకు రుచింపదేమో యని మాసంకోచము,

అ. పో.నా — నోటికి కొంత హద్దుండవలయును. ధరణికోట మా కప్పగింపవలసినదిగ సార్వభౌమునియాజ్ఞ మీ కందినదా? లేదా?

అన్నా రెడ్డి — ఆశకు గొంత మితి యుండవలెను. చక్రవర్తిపేరు చెప్పకొని భూమండలము నంతయు కబళింపజూచినచో నోరు పట్టవలదా?

అ. పో.నా — చెల్లుబడియున్నది గనుకనే యూహించుచున్నాము.

అన్నా రెడ్డి — అక్కడనే యున్నది కీలకము. నాయకులలో ఎవరికి వారే చెల్లుబడి గలవార మనుకొనుచున్నారు. అదే యీపుట్టిమునుక కంతకును హేతుభూతము.

చ. కలదని క్రొవ్వి వేఁడెదవు; వైభవకృష్ణ నశించి పోదుమా;
కలహము మాతృభూమికి వికాసము గూర్పదు; కల్మిఁ గీరు లీ
తెలుగుచరిత్రకిన్ విపులతేజ మొనర్చిరి కాకతీయులన్
గొలిచెడువాడు — తద్యశము గోల్పడనేల వివేకవైభవా?

అ. పో.నా — ఓయీ! పరోపదేశమున మీ యన్నదమ్ములు చూపుచున్న పాండిత్యములో సగమైనను స్వాచరణమున జూపిన నెంత యందముగ నుండెడిది?

అన్నా రెడ్డి — వంశపారంపర్యముగ మాయధీనమున నున్న ధరణికోటను మారుమాటాడక మీకర్పించినచో నక్కడకు మేము ప్రశంసార్హుల మగుదుము కాబోలును. మీకోరిక—మావరకు పోనేల—మీకైన నక్రమముగఁ దోచుచున్నదేమో ఒక్కమా రాత్మపరీక్ష చేసి చూచుకొనుడు.

గన్నమనీ — నాయనగా రుపేక్షించినకొలదియు నీరెడ్డి తెగనీలుగుచున్నాడు.

మాదాని — కుమారా! నీ వూరకుండుము—

అన్నా రెడ్డి — నాయకాగ్రణీ! నామాటలు పెడచెవిని బెట్టకుము. ఈధరణికోట పేరుచెప్పకొని ఇంతవరకు నడచిన స్వజనక్షయమునకు ధనవ్యయమునకు మేర లేదుకదా! మనలో మన మిట్లు కలహించుకొనుచుండగ నన్యజాతులకు లోకువగుటలో నాశ్చర్యమేమున్నది?

ఉ. పుట్టితి మాంధ్రభూమిపయి పుణ్యము లెన్నడొ చేసి చేసి; చే
పట్టితి మార్గధర్మముల; భారతభూమి సముద్ధరింపఁగాఁ
గట్టిన కాపికోకలకుఁ గాకతిరాజ్యము ముద్ర బెట్టగా
నెట్టితి మిన్నివాళులను; నీతి దలంపు; విభేద మేటికిన్?

అ. పో.నా — శుష్కప్రియములును, శూన్యహస్తములును ప్రయోజనకారులు కానేరవు. ధరణికోటను మా కర్పించి మరి మాటాడవలయును—

అన్నారెడ్డి — దేశక్షేమమును యోజించి మేము ప్రార్థించిన కొలదిని మీరు బిగుసెక్కుచున్నారు. ధరణికోట నర్పించి మాటాడవలయునుగా?

అ. పో.నా — ఎన్నోశతాబ్దములుగ నాంధ్రరాజవంశములు తమకీర్తిధనమును నిక్షేపించుకొనుచు వచ్చిన యమూల్యరత్నపేటిక ఈధరణికోట. అట్టి విజ్ఞానభాండారము మా పాలనమున నుండుటకేగాని మీ పాలనమున నుండుటకు తగదు.

అన్నారెడ్డి — ఒక్కదేశమున నొక్క జాతిలో నుదయించి ఒక్కసామ్రాజ్యమును సేవించి యొక్క ధర్మము నవలంబించుచున్న మనము అన్నదమ్ములవలె నుండవలసి యుండగా విజాతీయుడగు కల్బరగిసుల్తానుపయి చూపునభిమానమయిన మాపయి చూపకుంటిరే?

అ. పో.నా — అనపోతనాయని యాజ్ఞ సుగ్రీవాజ్ఞ. అది చెల్లి తీరవలసినదే.

అన్నారెడ్డి — తీర నాపత్సమయమున మీరు నమ్ముకొనిన తురుష్కులే మిమ్ము ద్రోహము చేయుదురు సుమా?

అ. పో.నా — నా చెవులకు తాళముపడినది. ఆతాళము తీయుటకు ధరణికోట యొక్కటే సాధనము. అంతవరకు మీ మనవులను నేను వినదలచుకొనలేదు.

అన్నారెడ్డి — నే చేయుహితబోధను మనవులుగా గ్రహించుట మీ నిరహంభావత్వమునకు నిస్సందేహమయిన తార్కాణము.

అ. పో.నా — ఓయీ! నీవుగావున ఇంతవరకు మాటాడనిచ్చితిని.

అన్నారెడ్డి — నీవుగావున నే ఇంతవరకు నుపేక్షించితిని.

మాదానీ — ఆః! ఏమి నీ కండకావరము?

అన్నారెడ్డి — కండకావర మెవరిదో విస్పష్టమగుటలేదా? చక్రవర్తిని త్రోసిరాజనుటా? ఆపయి తోడినాయకుల నవమానించుటా? అటుతరువాత ధరణికోట నాక్రమింపజూచుటా? ఎంత కండకావరమును గాకున్న నంతవరకు సాహసింపగలము?

> ఉ. ఏల నిమీలితాక్షివయి యేడ్చెదవమ్మ తెనుంగుమాతరో!
> "క్రోలుచు పాలు రొమ్ము పడగ్రుద్దె" నటన్న జనోక్తి నేడు నీ
> పాల నిజంబొనర్పగ భవత్సుతు లెల్లరు నుద్యమింపగా
> నేల వృథా ప్రయాసముగ నేడ్చెదవమ్మ తెనుంగుమాతరో!

(నిష్క్రమించును)

గన్నమనీ — నాయనగారూ! ఈ ప్రేలరి నిట్లు పోనిచ్చెదరేమి!

మాదానీ — నాయనా! దూతను శిక్షింపరాదుగదా?

అ. పో.నా — మాధవా! చూచితివా? ఎంతమాట యనినాఁడో! కండకండలుగ నీతని దేహమును చీల్చి కాకుల కెగురవైచినగాని నా "కండకావరము" శాంతింపదు సుమా?

మాదానీ — ఈతనిని జీల్చిన ప్రయోజనమేమి?

అ. పో.నా — మరియెవరిని చీల్పవలెనందువు?

మాదానీ — ఈతని కీమాటలు నేర్పి పంపినవారిని చీల్పవలెను.

అ. పో.నా — పోలయ వేమారెడ్డినా?

మాదానీ — తండ్రి నొక్కని తల దరిగినచో ఇంకను కుమారరత్నము జీవించియుండును గదా! కుమారుని వధించినచో అది తండ్రికిగూడ చిత్రవధ యగునుగాదా?

అ. పో.నా — అటులయినచో వధించుటకంటెను జీవగ్రాహత్వ ముత్తమపక్షముగాదా?

మాదానీ — అట్లయినచో నో సభాసదులారా!

ఉ. ఓలగమిచ్చు నగ్రజునియుల్లము ఫుల్లగిలంగ వాడె శ్రీ
ప్రోలరెడ్డి దౌత్య మనుపేరిట నాతని కగ్రజన్ముఁడా
పోలయవేమనాయకుని పుత్రశిరోమణి గట్టి తెచ్చి మీ
ప్రోలను నిల్పనేని మరిముట్టను ఖడ్గము విశ్వసింపుఁడీ!

విజయదుందుభి మ్రోగించుచుగాని ఈయాస్థానమున మరల నడుగు పెట్టను.

(అని ఖడ్గహస్తుడయి కొలువు వెల్వడును. కొలువు వెల్వడుటకు సూచకముగ వెనుకటి తెర దించవలెను. ఆతడు పరిక్రమించుచుండగ నాతని కెదురుగ ప్రవేశము పోతరాజు.)

పోతరాజు — దేవా! మనవిజయము మాయమైనది. మనవిజయము మాయమైనది.

మాదానీ — (తనలో) ఏమి యీదురుపశ్రుతి! (ప్రకా) మంత్రిపుంగవా! మీమాటలు నాకర్థమగుటలేదు. విజయమేమి? మాయమగుట యేమి?

పోతరాజు — విజయాంబ యెక్కడి కేగినదో తెలియవచ్చుటలేదు. ఎంత నిగ్రహము చూపవలె ననుకొన్నను మిమ్ములను చూడగనే నాదుఃఖ మాగినదికాదు.

మాదానీ — విజయాంబ మాయమైనదా? విజయాంబ మాయమైనదా? (అని చదికిలబడి) హా! ఇం కేమున్నది? నాపాలిటిభాగ్యదేవత మాయమైనదా? అమాత్యపుంగవా! మీరు జాగ్రదవస్థలోనే మాటాడుచున్నారా?

పోతరాజు — అంతఃపురమంతయు రోదనముతో నిండిపోయినది. భటుల నన్నిదిక్కులకును బంపితిని. నాకు మతిపోయిన ట్లుండి ఇటు వచ్చితిని.

మాదాసీ — నాకు ప్రాణమే పోవుచున్నది.

పోతరాజు — మీ కామె యనిన పంచప్రాణములును. నే నెరుగనా? ఈవార్త మీ కెంత జాగరూకతతో చెప్పవలెననుకొంటినో అంత యకస్మాత్తుగను జెప్పితిని. నాకు నిజముగ మతి భ్రమించినది.

మాదాసీ — అమ్మా! నీసౌందర్యమును, నీసౌశీల్యమును, నీపాండిత్యమును ఏగోదావరి పాలుచేసితివో కదా!

పోతరాజు — మీరుకూడ నట్లు వాపోవుట ధర్మమా?

మాదాసీ — చనిపోవునపు డామెతండ్రి నాచేత చేతిలో చేయివేయించుకొనెను. హా! ఇం కేమున్నది? నాకు గురుద్రోహపాతకము సిద్ధించినది.

పోతరాజు — ఇంతకును వెదుకబోయిన భటులు వెనుకకు రానేలేదు గదా! ఇంతలో మీరు తొందరపడ నేల?

మాదాసీ — ఆమె స్వభావము మీకుఁ దెలియక యనుకొనుచున్నారు. మహాసాహసు రాలు.

పోతరాజు — ఆమెకును మీకును ఈనడుమ నేదయిన వివాదము నడచినదా?

మాదాసీ — ఆహా! అదేగదా ఇంత పుట్టిమునుకకును కారణము?

పోతరాజు — వివాద మేవిషయమునుగూర్చి.

మాదాసీ — ధరణికోటమీదికి దండయాత్ర ధర్మము కాదని యామె, అగునని నేను.

పోతరాజు — సరి ఇక తెలిసినది.

మాదాసీ — అయ్యయ్యో! ఎంతపని చేసినది? ఎంతపని చేసినది? అమ్మా! చనవుచే నంతతీవ్రముగ మాటాడుచుంటి వనుకొంటిని గాని ఇంతపని చేయుదువని యెరుగ నైతిని.

పోతరాజు — ఆహా! ఆమెముఖారవిందము నా కన్నులఁ గట్టిన ట్లగపడుచున్నది.

మాదాసీ — అమాత్యశేఖరా! అది దేవతావిగ్రహముకాని మానవవిగ్రహము కాదు.

పోతరాజు — ఎంతదుర్దశలో నున్నవానికయినను ఆముఖమును వీక్షించినచో స్వర్గసోపానము లభిస్తించుచున్న ట్లుండును.

మాదాసీ — ఆమె వ్రాసిన చిత్తరువుల నెన్నడైన మీరు తిలకించితిరా?

పోతరాజు — ఆనడుమ "స్వయంప్రభస్వర్గారోహణము"ను రచించి నాకు చూపినది. అద్భుతముగ నున్నది. ఆకవిత్వము మాత్రము? ఏమి పేశలమైన వాక్కు!

మాదాసీ — అన్నియు నున్నవి. అంచునకు తొంగరే లేదు. అంతచే టభిమానము లేకున్న బ్రదికిపోయియుందుము. అమాత్యశేఖరా! ఆమె మా యింట మరల నడుగుపెట్టు నదృష్ట మబ్బునందురా?

పోతరాజు — అధైర్యపడిన నేమిలాభము? నాశక్తివంచనములేక ప్రయత్నించెదను. ఆమెను మరల మీసన్నిధికి జేర్పగల నను ధైర్యము నా కున్నది. అంతవరకు నను గ్రహింపవలయును.

(అని మాదాసీనికి చేయూత నీయగ నిరువురు నిష్క్రమింతురు.)

---

# బుకర్ వాషింగ్టన్

శ్రీ దిగవల్లి వేంకటశివరావు

ఇప్పటికి ౭౦ సంవత్సరాల క్రిందటివరకూ అమెరికా దేశంలో వుండే నీగ్రోజాతివారంతా బానిసత్వంలో పడివుండి ఎన్నో బాధ లనుభవించేవా రని అందరికీ తెలుసును. అమెరికా దేశానికి కొత్తగా కాపురానికి వెళ్లిన తెల్లదొరలకు వ్యవసాయంపనులు చేయడానికి మనుష్యులు కావలసివచ్చారు. అందుకోసం ౧౬౨౦-వ సంవత్సరం ఆప్రాంతాలనుంచి పోర్చుగల్లు దేశపు తెల్లవారు ఆఫ్రికా దేశంలోని నీగ్రోజాతివారిని పట్టుకొని అమెరికాకు తీసుకొనివెళ్లి బానిసలుగా అమ్మివేయడం ప్రారంభించారు. కొన్నాళ్లకు ఈవ్యాపారం ఇంగ్లీషువారి చేతులలోకి వచ్చింది. నిర్భాగ్యులైన నీగ్రోలను వేలకొద్దీ అమెరికాకు ఎగుమతిచేయడం మొదలుపెట్టారు.

అమెరికా దేశం ౧౭౭౬లో ఇంగ్లాండుపరిపాలనను ధిక్కరించి స్వతంత్రం ప్రకటించింది. ఆప్రకటనలో మానవు లందరు సమానులే అనీన్నీ, స్వతంత్రంగా జీవించడానికి హక్కు కలవారనీన్నీ చాటించారు గాని నీగ్రోల విషయంలో ఈసత్యం పాటింపబడలేదు. నీగ్రోలకు ఆస్తి వుంచడానికి వీలులేదు. నీగ్రోలను పశువులలాగే చాస్త్రీంచి పరిగణించేవారు. సామాన్యమానవుల కుండవలసిన స్వేచ్ఛ స్వాతంత్ర్యము గౌరవములు నీగ్రోలకు లేవు. వారు మనమాలమాదిగలకన్న అధోగతిలో వుండేవాళ్లు. వాళ్లకు చదువు లేదు. చదువుకోడానికి వీలులేదు. హారియట్ బీచర్ స్టో అనేఆమె 'అంకుల్ టామ్సు కేబిన్' అనునవలలో నీగ్రోల దుఃస్థితినిగురించి చాలా చక్కగా వర్ణించింది. ఈనవలవల్ల అనేకమంది తెల్లవారికి హృదయాలు కరిగి నీగ్రోలయెడల సానుభూతి కలిగింది.

అమెరికా దేశంలో ఉత్తర భాగంలోవున్న రాజ్యాల వారికి మొదటినుంచీ బానిసత్వం అంటే యిష్టంలేదు. దక్షిణభాగపు రాజ్యాలలోవున్న తెల్లదొరల క్రిందనే యెక్కువమంది నీగ్రోబానిసలు వుంటూ వుండేవారు. ఈ బానిసత్వం శాశ్వతంగా వుండాలనే యీరాజ్యాల వారి పట్టుదల. ఈ అభిప్రాయభేదమువల్లను, ఇంకా కొన్ని కారణాలవల్లను అమెరికా దేశంలో ఉత్తరభాగానికిన్నీ దక్షిణభాగానికిన్నీ ౧౮౬౧లో యుద్ధం కలిగింది. ఆ సమయంలో ఉత్తరమున ఉన్న అమెరికాసంయుక్త రాష్ట్రాలకు అబ్రహాం లింకను అనేమహానుభావుడు అధ్యక్షుడైనాడు. బానిసత్వమే తప్పుకాకపోతే ప్రపంచంలో మనము తప్పు అనుకొనేది ఏదిన్నీ కూడా తప్పు కాదనే చెప్పవలసి వస్తుంది అని ఆయన అంటూవుండేవాడు. ఆయనదయవల్ల ఆఖరికి దిక్కులేని దీనజనుల అదృష్టం బయలుపడింది. ౧౮౬౩ జనేవరి ౧-వ తేదీన అబ్రహాం లింకను అమెరికాలో బానిసత్వం రద్దుచేసి నీగ్రోబానిస లందరినీ విడుదల చేయవలసిందని శాసించాడు. దీనివల్ల బానిసత్వం యొక్క ఇనుపసంకెళ్లు విడిపోయినాయి, గాని ఆర్థికంగానూ సాంఘికంగానూ మాత్రం నీగ్రోలస్థితిలో మార్పు కలగలేదు. ఇంతవరకూ అజ్ఞానంలోను బానిసత్వంలోను పడివున్న నీగ్రోలకు స్వాతంత్ర్యము ఇచ్చినందువల్ల వీళ్లు కూలీనాలీచేసుకొని జీవించవలసివచ్చింది. వీళ్లపైన ద్వేషం వహించి తెల్లవారు వీళ్లకు సరియైన కూలి యివ్వరు. స్వతంత్రవృత్తులు చేసుకోవడానికి వీళ్ల కవి చేతకావు. యంత్రపరిశ్రమలలో ప్రవేశించలేరు. చేతిపనులు తెలియవు. వీళ్లు ఘోరమైన దారిద్ర్యములో మునిగివున్నందువల్ల చదువుకోడానికి శక్తిలేదు. వీళ్లు ఇంత అధోగతిలో పడివుండడానికి మూలకారణము వీళ్ల బానిసత్వమే. నీగ్రోబానిసలకు చదువువస్తే వాళ్లు చెప్పినమాట వినరని తెల్లవారిభయం. అందువల్ల చాలా రాష్ట్రాలలో నీగ్రోలకు చదువుచెప్పడము తుదకు వర్ణక్రమము చెప్పడముకూడా నేరాలుగా చేశారు. కొన్ని రాష్ట్రాలలో నేరాలుగా చేయకపోయినా పాఠశాలలలో నీగ్రోలను

చేర్చుకోకూడదనే నిషేధాలు చేశారు. ఇంకా కొన్ని రాష్ట్రాలలో అనేక ఆటంకాలు పెట్టారు. మిసిసిపీలో చదువుకోడానికిగాని రాయడానికిగాని, రాత్రిగాని పగలుగాని నీగ్రోలుగాని నీగ్రో స్త్రీకి తెల్లవారికి పుట్టినవారుగాని, ౫ మంది చేరినచో అది అక్రమసమావేశ మని ౧౮౧౩లో విధించారు. నీగ్రో పాఠశాలల్లో తెల్లవారు చదువు చెప్పకూడదని కొన్ని రాష్ట్రాలవారు విధించారు.

ఇన్ని ఆటంకాలు వున్నా నీగ్రోలలో కొందరికి చదువుకోవాలన్న సంకల్పము కలిగి వాళ్లు రహస్యంగా చదువు నేర్చుకునేవారు. ఊడిగం చేసి చేసి ఏరాత్రి వేళనో రహస్యంగా అక్షరాలు నేర్చుకుంటూవుంటే అది చూచి కొరడాపుచ్చుకొని కొట్టిన తెల్లయజమానులు కూడా వుండేవారు. కొందరు ధర్మాత్ములుమాత్రం చదువు కొనిచ్చేవారు. బానిసత్వం మూసబడేవరకు నీగ్రోలకు చదువుకోడానికి ఇన్ని ఆటంకాలు వుండేవి. అందువల్ల నీగ్రో బానిసలు స్వతంత్రు లయ్యేటప్పటికి నూటికి ౯౫ మందికి చదువులేక అజ్ఞానంలో పడివున్నారు. తరువాత ౫౦ సంవత్సరాలలో ఈ నీగ్రోలను ఉద్ధరించడానికి ఎంతో కృషి జరిగింది. దానిఫలితాన్నిగురించి ౧౯౧౧లో జరిగిన విచారణవల్ల ఈక్రింది సంగతులు బయల్పడినాయి.

చదువుకునే వయస్సుగల నీగ్రోపిల్లలలో సగం మంది బడులలో లేరు. దీనికి ముఖ్యకారణం- పాఠశాల సౌకర్యాలు లేకపోవడమే. రెండవ కారణము - దారిద్ర్యమూ, తల్లిదండ్రుల అజ్ఞానమూ. పాఠశాలలలో వున్న పిల్లల చదువు చాలా అసంతృప్తికరంగా వున్నది. పల్లెటూళ్లలో నీగ్రోపిల్లలకు వచ్చీరానిచదువు చదివిన పంతుళ్లు ఏడాదికి 3 నెలలో లేక ఆరు నెలలోమాత్రం చదువు చెపుతున్నారు. నీగ్రోపాఠశాలలు వుంచడానికి ఇళ్లు లేవు. వాటికి సరియైన పరికరాలు లేవు. ఈపాఠశాలలను సరిగా తనిఖీచేయరు. వీటికి గ్రాంటులు సరిగా లేవు. వృత్తివిద్యగాని యంత్ర పరిశ్రమగాని సర్వేపాఠశాలలలో చెప్పేచదువు పనికిమాలినది. నీగ్రోలకు ఆవృత్తి వ్యాపారాలలో నైపుణ్యం అలవర్చడానికిగాక వాళ్లని నీచపు చాకిరీ చేయడానికే వుపయోగించుతూవుంది. ఉన్నత విద్యను బోధించే విద్యాలయాలను ఆదరించడంలేదు.

ఇన్ని లోపాలు వున్నా ఈయాభైసంవత్సరాలలో జరిగిన నీగ్రోల విద్యాభివృద్ధి భారతదేశ విద్యాభివృద్ధి కన్న చాలా బాగున్నదని చెప్పవచ్చును.

నీగ్రోలలోనే కొంతమంది విద్యాధికులు నాయకులు బయలుదేరి విద్యాభివృద్ధికి నడుముకట్టి పని చేస్తున్నారు. నీగ్రోలలో అక్షరజ్ఞానము నూటికి ౫౫ మందికి పెరిగినది. ముఖ్యంగా ఆడవాళ్ల చదువు విషయంలో నీగ్రోజాతివారు మనకన్న అభివృద్ధిలో నున్నారు. ఈఅభివృద్ధి బుకర్ వాషింగ్టన్ వంటి నీగ్రోనాయకుడు చేసినకృషియొక్క ఫలితమేఅని చెప్పవచ్చును. నీగ్రోజాతి ఈ ఘోరదాస్యంలోనుంచి అజ్ఞానంలోనుంచి బయటపడి స్వతంత్రజీవనం చేసేశక్తి కలగాలంటే ఏ కొద్దిమంది నీగ్రోలో పుస్తకాల చదువులు చదివి బి ఏ., ఎం. ఏ. పట్టాలు పొందితే లాభం లేదనిన్నీ, జనసామాన్యానికందరికీ శాస్త్ర వ్రాత కోతలు రావడమే గాక వాళ్లకు మతంసంగతీ ప్రపంచంసంగతీ కొంచెం తెలియాలనిన్నీ, దేశవ్యాపార యంత్ర పరిశ్రమలలో వీళ్లకు కొంత ప్రవేశమూ అనుభవమూ కలగాలనిన్నీ, మొగపిల్లలకీ ఆడపిల్లలకీ పనిపాటులు చేయడం అంటే పరువుతక్కువ అనితోచే పుస్తకాలచదువు చెప్పడంవల్ల ఆజాతి బాగుపడడం కష్టమనిన్నీ, పిల్లలు చదువుతోపాటు జీవన విధానాన్నికూడ అభ్యసించాలనిన్నీ, చదువు పూర్తి అయ్యేటప్పటికి స్వతంత్ర జీవనం చేసుకునే శక్తి వీళ్లకు కలగాలనిన్నీ గ్రహించి నీగ్రోనాయకుడైన బుకర్ వాషింగ్టను ఈ ఉద్దేశాలతో విద్యాబోధనము ప్రారంభించి కృతకృత్యుడైనాడు. ఇతని జీవితచరిత్ర చదివితే నీగ్రోజాతి ఎలా వుద్ధరింపబడిందీ తెలుస్తుంది. ఇతడు నిర్వహించిన విద్యాపద్ధతివల్ల మనం నేర్చుకోతగిన పాఠాలు చాలా వున్నాయి.

మన కథానాయకుడైన బుకర్ టి. వాషింగ్టన్ అమెరికా సంయుక్తరాష్ట్రాలలో వర్జీనియా పరగణాలో ఫ్రాంకిలిన్ జిల్లాయందు ఒకతోటలో ౧౮౫౮-వ సంవత్సరమున బానిసగా జన్మించినాడు. ఆతోటదగ్గర కొంతదూరములో హేల్సుఫోర్డు అను పేరుగల ఒక పోష్టుఆఫీసు ఉన్నది. అతనిజీవితము చాలా దీనస్థితిలో దుఃఖకరమైన పరిస్థితులలో ఏవిధముగ తెరచూచినా

నోపాయము లేని పరిస్థితులలో ప్రారంభమైనది. అతను జన్మించిన యిల్లు ఒక రైలు పెట్టెలాంటి కొయ్యగది. ౧౬ అడుగుల పొడుగు, ౧౪ అడుగుల వెడల్పు. దీనిలోనే యితనితల్లి, తక్కిన కుటుంబము కాలక్షేపము చేసేవారు. సివిలుయుద్ధము వచ్చి నీగ్రోల బానిసత్వము రద్దుఅయ్యేవరకూ ఈకుటుంబంవారంతా బానిసలుగానే వుండేవారు. తరువాత బుక్కరు వాషింగ్టన్ తల్లి పడమటి వర్జీనియాకి వలసవెళ్లి అక్కడ మాల్డెన్ అనే గ్రామంలో పునర్వివాహము చేసికొంది. వాషింగ్టన్ సవతి తండ్రి అక్కడ ఒక ఉప్పుఫ్యాక్టరీలో పనిచేస్తూవుండడంవల్ల మన వాషింగ్టనుకూడా ఆపనిలోనే ప్రవేశపెట్టాడు. చాలా చిన్నతనంలోనే వాషింగ్టను యిలాగ జీవనంకోసం పనిచేసుకోవలసి వచ్చింది.

వాషింగ్టనుకు బాల్యమునుండీన్నీ చదువుకోవాలనే ఆసక్తి వుండేది. ఈ క్రొత్తవూరు వచ్చిన తరువాత ఏదైనా పుస్తకము సంపాదించి పెట్టమని తల్లిని కోరగా కోరగా ఆమె ఎలాగో కష్టపడి ఒకఇంగ్లీషు స్పెల్లింగు పుస్తకము సంపాదించిపెట్టింది. అతను చదివిన మొదటి పుస్తకము యిదే. ఇంతలో దగ్గరలో ఒకస్కూలు పెట్టారు. కాని పగలు చదువుకోవడానికి వాషింగ్టనుకు తీరుబడిలేదు. అందువల్ల ఆ బడిపంతుల నాశ్రయించి రాత్రిళ్లు కొంత చదువుచెప్పమని బతిమాలుకొన్నాడు. ఇతడు కుశాగ్రబుద్ధి అవడమువల్ల తక్కినపిల్లలు పగలు చదివిన దానికంటె ఇతడు రాత్రిపూటనే హెచ్చు చదువు చదువుకోగలిగాడు. పగటిపూట పనిపాటులు చేసుకొనేవాళ్లకు చదువు చెప్పడానికి రాత్రిపాఠశాలలు పెట్టవచ్చునని గ్రహించి పెద్దవాడైనతరువాత హాంప్టనులోను టస్కీజీలోను ఇతడు రాత్రిపాఠశాలలు స్థాపించడానికి యిదే కారణమైంది.

ఉప్పుఫ్యాక్టరీలో కొన్నాళ్లు పనిచేసిన తరువాత ఇతనిని ఒకబొగ్గుగనిలో పనికి కుదర్చారు. ఇది చాలా కష్టమైనపనే కాకుండా గనిలో కూరిన తుపాకిమందు పేల్తూవుండడమువల్ల పైనుంచి బొగ్గుఅండలుకూల్తూవుండడమువల్ల తరుచు అనేకమందికి దెబ్బలు తగల్తూ వుండడము ప్రాణభయముకూడా కలుగుతూ వుండడము చూసి యితడెప్పుడూ భయోత్పాతముతోనే కాలక్షేపము చేస్తూ వుండేవాడు. ఈగనిలో పనిచేస్తూవుండే రోజులలోనే హాంప్టను అనేచోట వ్యవసాయపుపనులు చేస్తూ చదువుకోడానికి వీలైన "నార్మల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూట్" ఒకటి స్థాపించబడినట్లు యితను విన్నాడు. ఎలాగయినా అక్కడకు వెళ్లి చదువుకోవాలని ఇతనికి బుద్ధిపుట్టింది. కాని ఆబడి వున్న వూరు ఎక్కడ వున్నదో ఈతనికి తెలియదు. వెళ్లడానికి చేతులో డబ్బూ లేదు. ఈపిల్లవాడు దీనినిగురించి రాత్రింబవళ్లు ఆలోచిస్తూ వుండేవాడు. ఇంతలో కొద్దిరోజులలో జనరల్ రఫెనర్ (Ruffener) దొరగారియింట్లో పనులుచేయడానికి నౌకరు కావాలిసివున్నట్లు తెలిసింది. రఫెనర్‌దొరసాని దగ్గర పనిచేయడం చాలా కష్టమనిన్నీ, ఆమెదగ్గర నౌకరీ చేసేపిల్లలను ఆమె రాచి రంపాడుతుందనిన్నీ ప్రఖ్యాతి. ఏమైతేనేమి ఈబొగ్గుగనిలో పనిచేయడం చాలా దుర్భరమైనందువల్ల వారింట్లో పనికి ప్రవేశించాడు. ఈ దొరసాని స్వతస్సిద్ధముగా క్రూరురాలు కాదనిన్నీ, ఆవిడకు అన్ని పనులు పరిశుభ్రముగా వుండాలనిన్నీ, ఆమె చెప్పినట్లు పనిచేసి నమ్మకముగావుంటే ఆమెను మెప్పించవచ్చుననిన్నీ వాషింగ్టన్ త్వరలోనే గ్రహించాడు. ఈరఫెనర్ దొరసాని చిత్తవృత్తులనుబట్టి నడచుకోవడములో ఈతను నేర్చుకొన్న పాఠాలు యితడు తరువాత పాఠశాలలో నేర్చుకొన్న పాఠాలతో సమానమైన విలువగలవేయని ఇతడు తరువాత గ్రహింపగలిగాడు. ఇతని మంచితనము నీతి సత్ప్రవర్తనము యజమానురాలికి ఇతనిపైన చాలా దయగలిగించినవి. చదువుకోవాలని ఇతనికిగల గాఢమైన కోరికను చూడగా ఆమెకు దయగలిగింది. పనిలేని వేళలలో ఇతడు చదువుకుంటూవుంటే సంతోషించి ప్రోత్సాహంచేసేది.

ఇతడు హాంప్టనుకు పోవడానికి ౧౮౭౨లో నిశ్చయము చేసుకొన్నాడు. కాని బట్టలు కొనుక్కొనడానికిగాని ప్రయాణానికిగాని డబ్బులేదు. వెళ్లవలసిన ఊరు దగ్గరలో లేదు. ౫౦౦ మైళ్లదూరం. ఈసమయములో ఈతనితల్లికి జబ్బుగా వుంది. మళ్లీ చూస్తానో లేనో అని కంట నీరు పెట్టుకొన్నాడు. ఏమైనాసరే తలపెట్టిన ప్రయాణము ఆపివేయడానికి ఇష్టపడలేదు. ధైర్యముచేసి బయలు దేరాడు. కొంతదూరము నడుస్తూ

ఆగుతూ మధ్యమధ్య కోటబళ్లవారిని, గుఱ్ఱపుబళ్లవారిని బ్రతిమాలి ఆబళ్లలో ఎక్కుతూ దిగుతూ మళ్లీ నడుస్తూ యిలా అనేకరోజులు ప్రయాణముచేసి ఆఖరుకు ఒక రాత్రి రిచ్‌మాండుచేరాడు. నిరంతరప్రయాణమువల్ల తిండి లేకపోవడమువల్ల చిక్కి శల్యమైనాడు. ఆరాత్రికి వుండడానికి ఎక్కడా స్థలములేక ఒకవీథిలో దుకాణాల బల్లపూర్వక్రింద ఒళ్లు వాల్చినాడు. పొద్దున లేచేటప్పటికి రేవులో ఒక ఓడలోనుంచి సరుకు దిగుమతి అవుతూ వుండడం చూశాడు. తానుకూడా కొన్నిమూటలు మోసి కూలిడబ్బులు సంపాదించినాడు. యీ సొమ్ముతో తనయాత్ర పూర్తిచేయగా యం- ౫౦ ట్లు, అనగా రు ౧-౯-౦ లు మిగిలినాయి. ఈసొమ్ముతో తాను చేర దలంచిన సరస్వతీపీఠానికి కానుకగా సమర్పింప దలచినాడు ఈకుర్రాడు!

హాంప్టన్ చేరగానే ఇతడు, పాఠశాలాధికారిణి అయిన మిస్ ఎఫ్. మేకీదొరసానిని చూచి తనను చేర్చుకోమని ప్రార్థించాడు. ఇతని బక్కచిక్కిపోయిన శరీరమూ, మాసినతల, చిరిగిపోయినబట్టలు చూచి నీ గ్రోడెస్ కోవాడులా కనబడినందువల్ల ఆమె కొంతసేపు ఏమీ జవాబు చెప్పలేదు. ప్రాధేయపడగా ఆఖరికి విసుగుతో పక్కనవున్న క్లాసుగది చూపించి ఈ చీపురు పుచ్చుకొని ఆగది శుభ్రముగా వూడ్చు, తరువాత ఆలోచిస్తాను అంది. ఆమె ప్రసన్నురాలై పని చెప్పినందుకు యితడు ధైర్యము చెంది వెంటనే ఆచీపురు పుచ్చుకొని ఆ గదిని జాగ్రత్తగా వూడ్చాడు. ఇదే ప్రవేశపరీక్షయేమో — ఏమూలైనా దుమ్ము దిగబడి పోతుందేమో అన్నంతభయముతో మూడుమార్లు నొక్కి నొక్కి వూడ్చాడు. పరిశుభ్రంగా వూడ్చి పని పూర్తి చేసి ఆమెకు మనవిచేశాడు. వీడు చేసినపనిలో తప్పుపట్టలేకపోతానా అనేధైర్యముతో ఆమె వచ్చింది. సాధారణముగా దుమ్ము ఎక్కడ దిగబడుతుందో ఆమెకు తెలుసును. గది నలుప్రక్కల చూసింది. మారుమూలలు అన్నీ పరీక్షించిచూసింది. ఆఖరికి తనజేబుగుడ్డ తీసి బల్లకూర్పుమీద రాచి చూసింది. ఎక్కడా మచ్చకైనా కొంతదుమ్ముఅయినా కనబడకపోయేటప్పటికి ఆమె సంతోషించి నిన్ను మాబళ్లో చేర్చుకోవచ్చునని తోస్తుంది అన్నది! నీవు బడిజీతం యివ్వలేవు. ఇప్పుడు వ్యవసాయంపనులూ, ఇతరపనులూ ఖాళీగా లేవు. బట్టలుతికేపని చేస్తావా? అంది. ఏపని అయినా నేమి తప్పకుండా చేస్తానని సంతోషముతో వప్పుకొన్నాడు. దరిద్రుడైన వాషింగ్టను కిది పరువుతక్కువ అని తోచలేదు. ౩ సంవత్సరములు ఈ పాఠశాలలో చాలా కష్టపడి పనిచేస్తూ చదువుకొని ౧౮౭౫ లో పట్టభద్రుడైనాడు. హాంప్టనుపాఠశాలయొక్క స్థాపకుడైనటువంటి జనరల్ శామ్యూల్ సి. ఆరమ్‌స్ట్రాంగ్ దొరయొక్క ప్రేమకు పాత్రుడైనాడు.

బుకర్ వాషింగ్టను పట్టభద్రుడైనతరువాత మళ్లీ మాల్డెన్ గ్రామానికి వచ్చేశాడు. అక్కడ అతనిని నల్లవాళ్లబళ్లో ఉపాధ్యాయునిగా ఎన్నుకొన్నారు. రెండేళ్లు పనిచేసినతరువాత అతడు వాషింగ్టన్ డి. సి.కి వెళ్లి మళ్లీ ౮ నెలలు చదువుకొన్నాడు. ౧౮౭౮ లో హాంప్టనువిద్యాలయం పట్టభద్రులకు ఉపన్యాసం ఇవ్వవలసిందని జనరలు ఆరమ్‌స్ట్రాంగుదొర ఇతనిని ఆహ్వానించాడు. తన కిది పెద్దగౌరవమని వాషింగ్టను సంతోషించి "ఆత్మశక్తివిజయము" అనేవిషయాన్ని గురించి ఉపన్యసించాడు. ౧౮౭౯ లో ఇతనిని హాంప్టన్ విద్యాలయంలో ఉపాధ్యాయునిగా నియమించారు. అక్కడ పనిచేస్తూనే ఇతను ఇంకా పెద్దచదువు చదివాడు. ఆ సమయంలో ఆరమ్‌స్ట్రాంగుదొర ఉత్తర అమెరికాలో ఆదిమవాసులైన ఎర్రఇండియనులకు విద్యాబుద్ధులు చెప్పడానికి కృషి చేస్తూవుండి వాళ్లలో ౭౫ మందికి చదువు చెప్పి బాగు చేయమని వాషింగ్టనుకు అప్పగించాడు. తనజాతితో సంబంధంగాని పోలికగాని లేని ఈ ఆదిమవాసుల జాతి వారికి విద్యాబుద్ధులు చెప్పడం చాలా కష్టమైనపని. దీనిలో చాలాయిబ్బందులుకూడా వున్నాయి. అయినా వాషింగ్టను దీనిని చాలా చక్కగా నిర్వహించాడు. ఈహాంప్టనువిద్యాశాలలో వాషింగ్టను రాత్రిళ్లు చదువు చెప్పేతరగతి ఒకటి స్థాపించాడు. విద్యార్థులు పగలు పదిగంటలు కాయకష్టంచేసి తమజీవనోపాధిని సంపాదించుకొని రాత్రిళ్లు ఈపాఠశాలలో చదువుకోవచ్చును. తమ పనిపాటులలోను చదువులోను ఈవిద్యార్థులు

చూపిన పట్టుదలను జూచి వాషింగ్టను ఈతరగతికి "వస్తాదులతరగతి" అనేపేరు పెట్టాడు.

ఇట్టిస్థితిలో అలబామారాష్ట్రంలో టస్కీజీలో నల్లవాళ్లకు విద్యాబుద్ధులు చెప్పడానికి తగిన ఉపాధ్యాయు డెవరైనా వుంటే సిఫారసుచేయవలసిందని ౧౮౮౧లో కొందరు పెద్దమనుష్యులు ఆరమ్‌స్ట్రాంగుదొరను అడిగారు. ఈయన మనవాషింగ్టనును సిఫారసుచేశాడు. వాళ్లు అంగీకరించారు. టస్కీజీ చాలా చిన్న వూరు. ఈవూళ్లో రెండువేలమందిజనసంఖ్య వుంటారు. వీరిలో సగంమంది నీగ్రోవాళ్లే. బడిఅన్న తరువాత దానికి కావలసినకట్టడము పరికరాలు వుంటేకపోతాయా అని అనుకున్నాడు, వాషింగ్టను. కాని టస్కీజీకి వెళ్లి చూసేటప్పటికి అతను డీల్లపోయాడు. అక్కడ ఏమీ లేదు. ఉపాధ్యాయుల జీతంకోసం రాష్ట్రప్రభుత్వంవారు రెండువేలడాలర్లుమాత్రం మంజూరుచేశారు. బడిపెట్టే చోటూ లేదు, బల్లోకి బల్లలూ లేవు. ఏమీ లేదు. అయితే చదువుకోవాలని ఆసక్తిగలవారుమాత్రం కొన్ని వందలమంది కనపడ్డారు. ముందుగా అతను చేయవలసిన పనిబడి పెట్టడానికి ఒకప్రదేశం వెదుక్కోవాలి. పాడుపడిన చర్చి దానిని అంటి ఒక బల్లకూర్పుగదీ దొరకాయి. ఆచర్చిహోలులో పిల్లలతరగతులు పెట్టుకోడానికి నిశ్చయించాడు. ఆడపిల్లలు మొగపిల్లలూ కలిసి ముప్ఫయిమంది పిల్లలతో ౧౮౮౧ జూలై ౪-వ తేదీన పాఠశాల ప్రారంభించాడు. ఈపిల్లలికి పుస్తకాల చదువు నేర్పడానికి ముందుగా వీళ్లకి నేర్పవలసిన సంగతులు చాలా వున్నాయని త్వరగానే వాషింగ్టను గ్రహించాడు. మానవజీవితానికి ముఖ్యావశ్యకములైన అనేక సంగతులు ఈ పిల్లలకు తెలియవు. వీళ్లకు స్నానంచేయడం ఎలాగో తెలియదు. శరీరం శుభ్రముగా వుంచుకోవడం తెలియదు. ఏది తినదగినదో తెలియదు. ఆహరము ఎలా తినాలోకూడా తెలియదు. తమ గది ఎలా వుంచుకోవాలో అసలే తెలియదు. వీళ్లకి చదువుతోపాటు ఇవన్నీ నేర్పాలి. ఇంతే కాదు. వీనితోపాటు సాధ్యమైనంత తక్కువ శ్రమతో ఎక్కువ ఫలప్రదంగా వుండే వ్యాపార పరిశ్రమలు కూడా వీళ్లకు చెప్పాలని మనవాషింగ్టను నిశ్చయించాడు. ఈచదువు పూర్తి అయి వీళ్లు బయటిప్రపంచంలోకి వెళ్లి పడేటప్పటికి వీళ్లు తమ బ్రతుకు తాము బ్రతుకడానికి శక్తికలిగించే పారిశ్రామిక విద్య బోధించి వీళ్లని బాగాతర్ఫీదుచేయాలని వాషింగ్టను ఉద్దేశం. నీగ్రోలలో నూటికి ౮౦ మందికి జీవనం వ్యవసాయమే. అందువల్ల చదువుకొనే పిల్లలలో చాలామందికి విద్య పూర్తిఅయ్యేటప్పటికి వాళ్లు తమపొలాలకు మళ్లీ వెళ్లి వ్యవసాయంపనులు చక్కగా నిర్వహించుకునే శక్తి కలగాలి. ఈ పిల్లలు అభ్యసించేవిద్య వీళ్లకు మానసికవికాసం కలిగించి విజ్ఞానము మతధర్మాలు బోధించడమేగాకుండా వీళ్లకు వ్యవసాయంలోను కృషిలోను శక్తిసామర్థ్యములను కలిగించాలి. అందుకోసం పాటుపడడానికి నిశ్చయించాడు. ఇతడు పాఠశాల ప్రారంభించిన మూడుసెలలలో దగ్గరలోవున్న పెద్దతోట, పొలము అమ్మకానికి వచ్చాయి. ఎలాగైనా ఈఆస్తిని కొంటే తనమనస్సువచ్చిన పద్ధతులన్నీ అమలులో పెట్టడానికి వీలుగా వుంటుందని వాషింగ్టనుకు తోచింది. తనదగ్గర డబ్బు లేదు. అందువల్ల హాంప్టనువిద్యాలయ కోశాధ్యక్షుణ్ణి ఆశ్రయించి ౫౦౦ డాలర్లు బదులు పుచ్చుకొని ఈక్షేత్రాన్ని కొని తనపాఠశాలను వెంటనే దానిలోనికి మార్చాడు. ఈకొత్తతోటలోకూడా ఒక భల్లలగది, ఒకచిన్నకుటీరము, ఒకకోళ్లగుడిసె వున్నాయి. ముందుగా వాటిని కొంత బాగుచేసి విద్యార్థుల సహాయంతోనే పెరిగిన చెట్లను నరికి భూమిని దున్ని సాగుచేయడానికి నిశ్చయించాడు. ఈమాట విద్యార్థులతో చెపితే వాళ్లకు నచ్చలేదు. చెట్లు నరికి వ్యవసాయం చేయడం ప్రారంభించడానికీ చదువుకీ ఏమి సంబంధమని వాళ్లు వితర్కించారు. అనేక వేల సంవత్సరా లీదేశంలో విద్యానిలయాలుగా వుండే గురుకులాలలో బ్రహ్మచారులు గురువుగారి యింటిపని చేసి ఆయన పెట్టిన ప్రసాదం తిని ఆయన దగ్గర నాలుగుముక్కలు నేర్చుకొనేపద్ధతి మన దేశంలోనే అంతరించిపోయి ఇంగ్లీషు చదువులు వచ్చి నెలజీతా లిచ్చి మంచి బిల్డింగులలో దొరలలాగ కూర్చుని ఒళ్లు వంచకుండా పుస్తకాలు చదివి పనిచేయడని పరువు తక్కువ అనేభావం స్థిరపడి నిరుద్యోగం హెచ్చి బాధపడుతూ వుంటే ఇప్పుడు గాంధిమహాత్ముడు

ఈ దాస్యంలోనుంచి తప్పించి మనపిల్లలకు విజ్ఞానము వృత్తివిద్య కలిపి నేర్పే విద్యామందిరాలు స్థాపించి దేశాన్ని ఉద్ధరించాలని ప్రయత్నిస్తూ వుంటే మన వాళ్లలో కొంతమందికి ఇది వెగటుగా వన్నప్పుడు కేవలం దొరల పాఠశాలలు తప్ప ఇంకోపద్ధతే తెలియని నీగ్రోలలో ఇలా తోచడం ఆశ్చర్యం ఏముందీ? పని చేయడం పరువుతక్కువ అనే అపోహ పోగొడితేనే తప్ప లాభంలేదని తలచి విద్యాధికుడైన వాషింగ్టను స్వయంగా ఒక గొడ్డలి పుచ్చుకొని బయలుదేరాడు. చెట్లు నరకడానికి ఉపాధ్యాయునకే పరువుతక్కువ లేకపోతే పిల్లలకేమి? దానితోటి పిల్లలందరూ ఉత్సాహంతో నవ్వుమొహాలతో వచ్చి సాయపడ్డారు. చెట్లు నరికి భూమి శుభ్రంచేసి సాగుచేశారు గోధుమ, కూరగాయలు పండించారు. వ్యవసాయం చదువు వృద్ధిచెందడం ప్రారంభమైంది. పాఠశాలకూడా అభివృద్ధి చెందడం మొదలు పెట్టింది. పిల్లలు ఎక్కువకాగా కొత్త కట్టడాలు అవసరం అయినాయి. వాషింగ్టను ధైర్యంతో ఇటుకతీయడం, తాపీపని, వడ్రంగం, కమ్మరం ప్రారంభించి పిల్లలచేతనే ఇళ్లు కట్టించడానికి నిశ్చయించాడు. మన విద్యాలయంలో నేర్పేవిద్యలో మొదటిపాఠము ఇటుకలు చేయడమే అంటూ తానూ ఆడుగు త్రొక్కాడు. తాపీపని చేయించాడు. వడ్రంగం చేయించాడు. ఇలాగ పాఠశాలకు ఇళ్లు తయారయినాయి. విద్యార్థులలో మేస్త్రీలు తయారయినారు. బుక్కరు వాషింగ్టను ఆధిపత్యం క్రింద టస్కీజీపాఠశాల పనిచేసిన ౯ సంవత్సరాల కాలంలో కట్టిన నలభై కట్టడాలలో నాలుగుతప్ప తక్కువ బిల్డింగులన్నీ పిల్లలు కట్టినవే. దారి తెన్నులేక అల్లాడే నీగ్రోజనానికి విద్యాబుద్ధులు జీవనాధార మార్గాలు చూపించే పాఠశాలను వాషింగ్టను స్థాపించాడు. ఈ టస్కీజీ నార్మల్ ఇండస్ట్రియల్ ఇన్‌స్టిట్యూట్ ౧౮౮౦ లో శాసనసభవారు చేసిన తీర్మానం ప్రకారం ౧౮౮౧ లో స్థాపించబడినది గాని దీని అభివృద్ధికి కారకుడు మనవాషింగ్టనే. ఇది దినదిన ప్రవర్ధమానమైనది. ౧౯౧౨నాటికి ఈ పాఠశాలలో విద్యార్థులు, ఉపాధ్యాయులు, ఇతర ఉద్యోగులు, పని వాళ్లు, వాళ్లకుటుంబాలు కలిసి జనసంఖ్య రెండువేలమందికి పెరిగింది. ఉపాధ్యాయులే ౯౩ మంది వృద్ధి అయ్యారు. ౯౧౨లో ౧౬౮౫ మంది విద్యార్థులు. వీరిలో ౧౦౬౮ మంది బాలురు. ౫౮౭ బాలికలు. ఈ విద్యాశాలకు ౨౩౮౫ యకరాలభూమి, ౧౦౮ బిల్డింగులు అమరినాయి. ఇదిగాక కాంగ్రెస్ వారిచ్చిన ౨కోట్ల ౫౦లక్షల డాలర్ల విలువచేసే ౨౫౫౬౦ యకరాలభూమిలో అమ్మగా మిగిలిన ౯౧౦౦ యకరాలు, ఈవిద్యాశాలకు ౧౭౮౧౬౪౮ డాలర్ల మూలధనం అమరింది. సాలుకు ౨౮౦,౦౦౦ డాలర్లు ఖర్చు. ఈ విద్యాలయంలో వ్యవసాయశాఖగాక వ్యవసాయ పారిశ్రామిక వృత్తికళల శాఖలు వృత్తులు ౪౦ రకాలున్నాయి. బాలికలకు నర్సుల తర్ఫీదు పాఠశాల ఇంకా అనేకవృత్తులు నేర్పుశాఖలున్నాయి.

విద్యాలయంవారు సాగుచేసే పొలం ౨౩౦౦ యకరాలు. సమృద్ధిఅయిన పాడిపంట లున్నాయి. కోళ్లు బాతులు పశువులు మేకలు చాలా భారీగా పెంచుతారు. ఒకమ్యూజియంలో రకరకాల మంటిపొరలు ప్రదర్శించి భూసారమును గురించిన్నీ భూగర్భ విజ్ఞానమును గురించిన్నీ ఉపన్యాసాలలో ప్రత్యక్ష ఉదాహరణలతో చెప్పుతారు. ప్రత్తిపంట ప్రశస్తతరంగా చేయడానికి ౯౦౫ లగాయతూ అనేక ప్రయత్నాలు చేస్తున్నారు.

యంత్రపరిశ్రమలు బోధించే "వర్కుషాపు"లో ఈక్రింది వ్యాపార పరిశ్రమలు నేర్పడానికి ఏర్పాటులు చేయబడ్డాయి-వడ్రంగం, కర్రపని, అచ్చు, కుట్రపుపని, కమ్మరం, జీనులు చేయడం, బళ్లుచేయడము, కొళాయిలపని, ఉక్కుఫిట్టింగు, విద్యుచ్ఛక్తి దీపాలు, తాపీపని, మెకానికలు డ్రాయింగు, టిన్నింగు(కళాయి), స్టీము ఇంజనీరింగు, చెప్పులు కుట్టడము.

ఆడపిల్లల వ్యాపార పరిశ్రమలలో యీక్రిందివి చేరినవి. బట్ట ఉతకడము, వంట, బట్టలు కుట్టడము, మిలినరీ (బనియనులు, స్టాకింగులు లేసు అల్లిక)పని, పాఠశాలలలోని ఆడపిల్ల లందరూ గృహనిర్వాహకవిద్య వంటపని నేర్చుకోవాలి. పాఠశాలవారు ఇచ్చేవెచ్చాలతో వాళ్లు తమవంట తామే చేసుకోవాలి.

ఇదిగాక కేవలము పుస్తకాలచదువు చదవడము వ్రాయడము లెక్కలు సాహిత్యవిద్య నేర్పేశాఖకూడా

వున్నది. పిల్లలందరూ ఈ చదువుకూడా నేర్చుకోవాలి. అయితే పిల్లల పారిశ్రామికవిద్యతో ఈ విద్య మేళ వించబడుతుంది. ౫౨ మంది ఉపాధ్యాయులు. ఇంగ్లీషు, లెక్కలు, చరిత్ర, భూగోళము, శాస్త్రవిజ్ఞానము, బుక్కు కీపింగు, జంత్రిశాస్త్రము, కిండర్ గార్టెను, చిత్రలేఖనము, దస్తూరీ, శరీర వ్యాయామము నేర్పుతారు.

ఉపాధ్యాయులు క్రొత్తవిశేషాలు నేర్చుకో డానికి ప్రతియేటా వేసంగిపాఠశాలం యేర్పాటుచేస్తారు. పెల్ఫ్ బైబిలు ట్రెయినింగు స్కూలులో క్రైస్తవమత ధర్మాలు బోధిస్తారు. దీనిలో చేరినవారిని మతబోధకులుగా తయారుచేస్తారు.

౧౮౯౨ లో ఒక ఆసుపత్రి నర్సు ట్రెయినింగు స్కూలు స్థాపింపబడింది. ౧౮౯౪ నుండి ౧౯౧౨ నాటికి ౪౮ మంది నర్సులు విద్య నేర్చి దేశంలో వివిధ భాగాలకు పోయి పనిచేస్తున్నారు. ఇదిగాక ఈ పాఠశాల జనసామాన్యానికికూడా విజ్ఞానం బోధించడానికి కృషిచేస్తూ నీగ్రోజాతీయోద్ధరణకు ఒకకేంద్రంగా వుంటూవుంది. ౧౮౯౪ లో రైతులకొరకు ఒకవిద్యాలయమును స్థాపించింది. పాఠశాలలో అవలంబింపబడుతూవున్న కొత్తపద్ధతులు రైతులకు బోధిస్తుంది. వారికి రెండువారాలతర్ఫీదు ఇస్తుంది. ౧౯౦౪ లో ఒకప్రదర్శనక్షేత్రాన్నికూడా స్థాపించింది. ఒకనీగ్రో సంత ఏర్పాటుచేసి వాణిజ్యానికి ప్రోత్సాహంయిచ్చింది. దీనికితోడు ఒకజాతీయ నీగ్రోవ్యాపారసమితి స్థాపింపబడింది. (Rural School extension) గ్రామస్థుల ఉపయోగంకోసం ఒకగ్రామపాఠశాల, ఒకమాడల్ స్కూలు, ఒకతోట, శిశుపోషణలో తల్లులకు తర్ఫీదు యివ్వడానికి తల్లులక్లబ్బుకూడా స్థాపింపబడింది.

ఈ విద్యాలయంలో మొదటినుంచీ ఒకవిధమైన సైనికశిక్షణ క్రమపద్ధతీ వున్నది. ఆడపిల్లలనుకూడా క్రమశిక్షణలో వుంచడానికి స్త్రీశాఖఅధికారిణి నియోగించారు.

ఈ విద్యాలయంకోసం ఒక పెద్ద గ్రంథాలయం స్థాపింపబడింది. దీనిలో ౧౯౦౦౦ పుస్తకాలు చేర్చబడ్డాయి. నీగ్రోలనుగురించీ ఆఫ్రికాదేశాన్నిగురించీ, నీగ్రోజాతీయతనుగురించీ ప్రబోధం కలిగించే పుస్తకాలు, పత్రికలు సమకూర్చి వుంచేవారు. చుట్టుపట్లజిల్లాల గ్రామాలలోని పాఠశాలలకు ఈ గ్రంథాలయంలో నుంచి పుస్తకాలు పెట్టెలలో పెట్టి పంపించేవారు. నీగ్రోల విద్యాభివృద్ధికోసం వాషింగ్టను యిలా తనయావజ్జీవితము పాటుపడి ౧౯౧౫ లో దివంగతుడైనాడు. ౧౯౨౪-౨౫ లో ౩౧ రాష్ట్రాలనుండి ౯ విదేశాలనుండి వచ్చిన ౩౩౨౩ పిల్లలకు టస్కీజీ విద్యాదానం చేసింది. వాషింగ్టను తలపెట్టిన కార్యం క్రమక్రమంగా పెరిగి దానికి చాలాసొమ్ము కావలసి వచ్చింది. దేశప్రభువులైన తెల్లవారితోడ్పాటు కావలసి వచ్చింది. ఇందుకొరకు అతను ప్రచారం చేయవలసివచ్చి ఉపన్యాసాలు ఇవ్వడం ప్రారంభించాడు. ఇతనిత్యాగము, ఓర్పు, పట్టుదల, ఇతనివాక్పటుత్వము తెల్లవారినికూడా ఆకర్షించాయి. కొద్దిరోజులలో ఇతడు గొప్పవక్త అని పేరుపొందాడు. అమెరికాసంయుక్తరాష్ట్రాలన్నీ సంచారంచేశాడు. ౧౮౯౫లో అట్లాంటా కాటన్ స్టేట్సు ప్రారంభమున అంతర్జాతీయ ప్రదర్శనము సమయమున ఇతడిచ్చిన ఉపన్యాసము తెల్లవారికి నీగ్రోలకు స్నేహభావము కలిగించడానికి తోడ్పడి చాలా ప్రసిద్ధికెక్కినది. విదేశంలో అన్యజాతులమధ్య జీవనం చేయువారు ఆదేశములోని జాతుల స్నేహము సంపాదించడం అవసరమని నొక్కి చెప్పినాడు. ఒకకలం పుచ్చుకొని వ్రాయడంలో ఎంత గౌరవం వుందో నాగలిపుచ్చుకొని పొలం దున్నడంలో కూడా అంతగౌరవం వున్నదని గ్రహించేవరకూ ఏజాతీ కూడా బాగుపడదని చాటినాడు. మనకుగల అవకాశాలు ఉపయోగించుకోకుండా కష్టాలు లెక్కపెట్టుకుంటూ కూర్చుంటే లాభం లేదన్నాడు. కేవలం సంఘానికి సంబంధించిన ముఖ్యవిషయాలలో చేతివ్రేళ్లలాగ విడిగా వుండవచ్చును కాని, దేశానికి సంబంధించిన ముఖ్యవిషయాలలో మాత్రం అరచేతిలాగ ఏకంగానే ప్రవర్తించాలని అన్నాడు!

౧౯౦౫ లో అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు టస్కీజీ వచ్చి చూచి చాలా సంతోషించాడు. బుకర్ వాషింగ్టనుపైన గౌరవాలు వర్షించడం ప్రారంభమైంది. విశ్వవిద్యాలయాలు గౌరవ

విరుదు లిచ్చాయి. అన్ని రాష్ట్రాలవారు ఆహ్వానించి గౌరవించారు. ఇతను ఇతనిభార్యా ఐరోపాదేశానికి వెళ్లి రావడానికి ౧౯౦౧ లో ఇతని స్నేహితులు ఖర్చు లిచ్చి పంపారు.

టస్కీజీని గురించి ఈవాన్సు అనే అమెరికా పత్రికావిలేఖరి ఇలా వ్రాశాడు: ఈ టస్కీజీ నార్మలుసంస్థ నీగ్రోలకు చేస్తూవున్న సేవ నిరుపమానము. ఈ సంస్థ నీగ్రోల నిత్యజీవనంలో గల కష్టసుఖాలను గమనించి వారికి తోడ్పడడానికి ప్రయత్నిస్తూ వుంది. రైతుకు అతను పండించేదానికంటె ఎక్కువపంట పండించడం నేర్పుతుంది. గృహిణికి తన యింటిపనులు చక్కగా చేసుకోవడం నేర్పుతుంది. జనులజీవనసౌభాగ్యాన్ని అభివృద్ధిచేయడానికి ప్రయత్నిస్తుంది. కేవలం కాయకష్టం చేసుకొనేవాడికి కౌశల పరిశ్రమ నేర్పుతుంది. ఒక్క ముక్కలో సంఘాన్ని మరమ్మతు చేస్తుంది. టస్కీజీ కేవలమూ ఒక పాఠశాల కాదు. అది అమెరికాదేశంలోని నీగ్రోజాతినంతా ఉద్ధరించే సంఘనిర్మాణ సంస్థ, ఒక మహా నగరము. అది నలభైవృత్తులనూ, వ్యాపారాలనూ, నడిపే పారిశ్రామికశక్తి. అది వుత్పత్తిచేసే సరకులను తానే అనుభవిస్తుంది. దానికి కావలసిన ఆహారపదార్థాలు పండించుకుంటుంది కావలసినబట్టలు నేసుకుంటుంది. తనకు కావలసిన పుస్తకాలు వ్రాసుకొని అచ్చు వేసుకుంటుంది. ఇదంతా దాని విద్యావిధానములోనే యిమిడివుంది.

ఇది ఒకజాతి యొక్క సమస్యనే పరిష్కరిస్తున్న గొప్పప్రయోగశాల. ఈ టస్కీజీయొక్క ఉద్దేశం తన విద్యార్థులు తమనిర్మాణ కౌశలంవల్ల ఏదో ఒక ఉపయుక్త వస్తువును నిర్మించి సంఘానికి సేవ చేయాలని, వాళ్లకు మెదడుకు హృదయానికి చేతులకు కూడా విజ్ఞానము కౌశలము ఆనందమునిచ్చే విద్య నేర్పాలని దాని ఊహ. తెలివితేటలు పొదుపు పరిశ్రమలు స్వయంసహాయము ఆత్మగౌరవము, శుభ్రత క్రమపద్ధతి మర్యాద—ఇవే టస్కీజీ నేర్పేసంగతులు. అక్కడ మొగపిల్లలకు ఆడపిల్లలకు కూడా నేర్పేచదువు ఎలాంటిదో బుకర్ వాషింగ్టను ఒకనాడు, పిల్లలకు చేసిన బోధ ఒకటిచూస్తే తెలుస్తుంది:

మీరు ఎవరికైనా నాగరికతనుగూర్చినపాఠము చెప్పాలంటే ప్రత్యక్షంగా కనపడే లోపాలు వెంటనే చక్కచేసుకోవడమును గురించి హెచ్చరించడం అవసరం. ఆఖరికి ఒకతలుపు తీసేపిడి వదులుగా వుంటే మీరు సహించి వూరుకోకూడదు. దానిని వెంటనే బాగుచేయాలి. పనికిమాలిన చిన్నలోపాలు ఎన్ని కనపడుతూవున్నా మనము పూర్వకాలంనాటి ఈ పుస్తకాల చదువుయొక్క దాస్యాన్ని వదిలించుకోలేకుండా వున్నాము.

ప్రతివారును అతడుపాధ్యాయుడైనా లేదా ఇంకేవృత్తివాడైనా తనసంఘంయొక్క విద్యాభివృద్ధితో అంతో ఇంతో జోక్యం కలిగించుకోవాలి.

మీ కేమాత్రం పలుకుబడివున్నా ఉపాధ్యాయుడు పిల్లలు సమావేశంఅయ్యే ఇల్లు లోపలా, పైనా పరిశుభ్రంగా వుండేటట్లు చూడాలి. లేకపోతే శుభ్రం చేయాలి. నేల ఊడ్చాలి. దుమ్ము దులపాలి. కుర్చీలు బల్లలు ఇతరసామానులు సరియైన మరమ్మతులో వుంచాలి. అవసరమైనచోట్ల రంగులు పూయాలి వెల్ల వేయాలి.

ఏదో ఒకయిల్లు అంటూ కట్టితే చాలని చాలా మంది ఊహ. దానికి రంగుగాని వెల్లగాని లేకుండా అసహ్యంగా వుంటే అది నాగరకతకు లక్షణం కాదు. ఈ పాఠశాల మీరు వదలి మీరు మీమీయిళ్లకు వెళ్లిన తరువాత ఆయిళ్లూ వాకిళ్లూ పాఠశాలలు వాసయోగ్యంగా ఉండేటట్లు చూడండి. రంగువేయడానికి మీకు డబ్బులేకపోతే ఆఖరికి సున్నమైనా కొట్టండి. మీరు ఉపాధ్యాయవృత్తిలోకి పోతే మొదటివారం బడి లోపలా బయటా శుభ్రంచేయడానికే ఉపయోగించండి. దొడ్డి అంతా ఊడ్చాలి. ఒక్క కాగితంముక్క అయినా వుండకూడదు. దడిలో సందులు వుండకూడదు. అపరిశుభ్రతగాని ఏదైనా పగిలిన కిటికీఅద్దంగాని కనబడకూడదు. పిల్లలకు ముందుగా ఈపరిశుభ్రత అలవాటుచేయాలి. దుస్తులు సరిగా వేసుకుపోకపోయినా తన

యిల్లు చక్కగా వుంచుకోలేకపోయినా అది మనిషిలో పెద్దలోపమే. అది అతని మతధర్మంలోకూడా ఒక లోపమే. తన చొక్కాయిబొత్తాము సరిగా పెట్టుకోలేనివైద్యుడు ఏమి వైద్యం చేస్తాడో నాకు తెలియదు. అన్నం వండడములో భోజనము చేయడములో చాలా నియమాలు పాటించాలి. భోజనానికి వేళ నిర్ణయించాలి. ఆహారపదార్థాలు చక్కగా వండడమేగాక చక్కగా వడ్డించాలి. దీనిలోను అనాలోచన అశ్రద్ధ అసహ్యము పనికిరాదు. భోజనశాల రమ్యంగా వుండాలి. పళ్లు బిగబట్టి ఎప్పుడు లేచిపోదామా అనేటట్లుగా వుండకూడదు. ఇల్లు కట్టేటప్పుడే భోజనశాలను చక్కగా కట్టాలి.

టస్కీకీ చూడడానికి వెళ్లినవారందరికీ అక్కడి బాలబాలికల పద్ధతులు మర్యాదలు చాల ముచ్చటగా వుండేవి. వాళ్లు అన్నిపనులూ చాలా శుభ్రంగానూ సొంపుగానూ చేసేవారు నిజంగా విద్యఅంటే పుస్తకాలు చదవడం కాదనిన్నీ, అసలు జీవనవిధానం అంతటిలోను నేర్చుకోవలసిన సంగతులు ఎన్నో వున్నాయనిన్నీ అందరూ గ్రహింపగలిగేవారు. ఇలాగ తర్ఫీదు అయిన పిల్లలు విద్యపూర్తిఅయి బయటికి వచ్చేటప్పటికి ఏవృత్తి అయినా చక్కగా చేసుకునిజీవనం చేయడమేగాక తమసంఘానికి ఉపకారంకూడా చేయగలుగుతూ వుండేవారు. ఈవిధంగా విద్యాపద్ధతులను సంస్కరించి అది ఫలించడంవల్ల వాషింగ్టన్ కృతకృత్యుడైనాడు.

---

# పూలకోరిక

శ్రీ కుంటిమద్ది శేషశర్మ

నే కోరలేదోయి
నీలవేణుల నిండు
కొప్పులలో దూరాలనీ,
కులుకుచూ,
మెప్పులా పొందాలనీ.

పూమాలలో జేరి
పూబోండ్ల బిగువైన
పాలిండ్ల నాడాలనీ,
యువకులా
భావాల రేపాలనీ.

రారాజు శవముపై
రాజిల్లగా కోర
శంకరుని తలపైననూ
నర్తించు
సౌభాగ్యమే కోరనూ.

తమమాతృభూమికై
తలనీయ వెనుదీని
వీరు లేగెడి త్రోవనూ
ఓ దేవ!
విసరేయుము మా చాలును.

---



# సుఖ జీవన కుటుంబము

***

కల్జానాకు వందనములు

వారు ఆరోగ్యముగా నున్నారు. అందుచే సుఖముగా కాలక్షేపముచేయుచున్నారు. కాని ఎల్లప్పుడు ఈమాదిరి కాదు. దినమంతా పనిచేసి, అలసి తండ్రి ఇంటికి చేరుచుండెను. తల్లికి తలనొప్పి, తదితర బాధలు. పిల్లలకు దంతముల బాధ. వీరు బలహీనముగా నుండిరి. అనవసరమైన పెంకితనము. వీరికి వయస్సునకుతగిన బలములేదు.

వైద్యుడు కల్జానా శిఫార్సుచేసిరి. అందుచే వీరు సుఖజీవనము చేయుచున్నారు. భారతదేశమున వీరి మాదిరి సుఖజీవనముచేయు కుటుంబము లేదు. అవసరమగు ఖనిజములను కల్జానా నొసంగును. ఎముక పుష్టిని చేకూర్చును. నూతన ఆరోగ్యము, బలమొసంగును. మీకు, మీ కుటుంబమునకు ఇదే మాదిరి చేయును.

నీరసము
గర్భిణుల బలహీనత
అలసట
అంటువ్యాధులు
దంతముల పటుత్వము తగ్గుట
చర్మవ్యాధులు
పాండువు
స్త్రీలవ్యాధులు

—కల్జానా వీటినన్నిటిని అతి శీఘ్రకాలమున నివారణ చేయును.

# KALZANA

ఆరోగ్యమునకు ఖనిజాహారము.

కెమిస్టు లందరివద్దను, బజారులలోను దొరుకును.

చేతితో తాకనిది.

# తోపూరు యుద్ధము

## రావుసాహెబ్ సి. యస్. శ్రీనివాసాచారిగారి పొరబాట్లు

కు. సీ.

౧౯౩౮-వ సంవత్సరమున సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులగు సర్ దేశాయిగారి స్మారకచిహ్నముగ ప్రకటింపబడిన వ్యాస సంపుటిలో దాక్షిణాత్యులలో చారిత్రికులని పేర్వడసిన రావుసాహెబ్ సి. యస్. శ్రీనివాసాచారిగారు "శివాజీకి పూర్వము దక్షిణ హిందూస్థానమునకు మహారాష్ట్రులవల్ల కల్గిన యొకగొప్ప యుపకృతి" (A great Maharatta Service to South in pre-Shivaji Epoch, pp. 74,75-Sar-Desai memorial volume, 1938.) యను పేరిట నొకగంభీర వ్యాసమును రచించినారు. శివాజీతండ్రియగు శాహజీకాలమున తన యేలికయగు బీజపురసుల్తాను నాజ్ఞచొప్పున దక్షిణభారతమునకు వచ్చి యిచ్చటి చిన్న రాజ్యములకు సాయమొనర్చెనని చెప్పుచు నీ చిన్నరాజ్యముల మధ్యనుండు నంతఃకలహములకు తోపూరు యుద్ధము కారణమని యుగ్గడించుచు తోపూరుయుద్ధసందర్భముల నీ క్రింది విధముగ సెలవిచ్చినారు:

"In the civil war that followed the death of Venkata, Yachama Naick who championed the cause of the legitimate heir Ranga, and was supported only by Achuta Naick of Tanjore and his son Raghunatha, against Jaggaraya and almost all the feudatories of the Empire, the former or the legitimate party was defeated in a great battle at Topur near the Grand Anicut on the Coleroon. In this battle the Nayaks of Jinjee and Madura fell on the field and Portugese contingent is said to have taken the side of Jaggaraya according to Raghunathabhyudayam." (P. 74.)

పై పంక్తులలో చెప్పబడిన దాదాపన్ని విషయములును ప్రమాదములు. పోర్చుగీసువారు జగ్గరాయనికి సాయమొనర్చెనను విషయ మొక్కటిమాత్రము నిజము[1]. ఈవిషయము నా "తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్ర"మునందు చర్చించియుంటిని (చూ. పుటలు, ౨౦౯, ౨౧౦). పై వాక్యమునందలి ముఖ్యవిషయములను మూడింటి నీక్రింద నిచ్చుచున్నాను.

(౧) విజయనగర సామ్రాజ్యసింహాసనమునకు శ్రీరంగరాయలు సక్రమవారసు. ఇతనిని పురస్కరించుకొనియే యుద్ధమయ్యెను.

(౨) సక్రమవారసుపక్ష మపజయ మొందెను.

(3) జింజీ, మధురనాయకు లీయుద్ధమున పడసిరి.

ఈమూడును తప్పులే. ఇచ్చట శ్రీయాచార్లవారు తమ సామగ్రీగ్రంథ

1. History of the Nayaks of Madura, p. 124.

మును "రఘునాథాభ్యుదయ"మని చెప్పి యా తప్పులను దిద్దునుపాయమును సూచించినారు. రఘునాథాభ్యుదయ మనుపేరుతో రెండు గ్రంథములు గలవు. అందొకటి యాంధ్రనాటకము, రఘునాథసుతుడగు విజయరాఘవ కృతము. రెండవది రఘునాథుడు తన నాథుడని చెప్పుకొనిన రామభద్రాంబచే రచియింపబడిన సంస్కృతకావ్యము. శ్రీ ఆచార్లవారిందు దేని నుల్లేఖించిరో తెలియదు. కాని రెండిటితోను వారిచ్చిన విషయములు మూడును ప్రమాదము లని తేలిన "అధికస్యాధికంఫలం" కదా! వానిలో శ్రీయాచార్లవారు రుల్లేఖించినవిషయములకు సంబంధించినభాగముల నీ క్రింద ననువదించుచున్నాను.

(౧) రఘునాథుడు తోపూరుయుద్ధము పోవుచున్నాడు. చూడుడు!

"భేరులు మ్రోయించి పెండ్లికి బోవు
తీరున తగినను స్త్రీలు గావించి
ఎదుటి పాళెంబున కెరుక సేయించి

* * *

రాజులు మన్నీలు రాహుతులు దొరలు
తేజీలపై నెక్కి ధీరులై కొలువ,
చేరువ నొక గంధసింధురం బెక్కి,
ఆ రామదేవరాయలు చనుదేర[2]"

* * * *

పైదానివలన వారసై సింహాసనమున నుంపదగినవాడును, నెవరికొరకై తోపూరు యుద్ధము జరిగెనో యాయనపేరు రామదేవరాయలని తెలియుచున్నది. కాని మనపని యింతటితో తేలదు. శ్రీ ఆచార్లవారిచ్చిన శ్రీరంగరాయ లనునాయన కాదనికూడ చూపవలసియున్నది.

"స్వామిద్రోహీ జగ్గరాజ స్సమిత్రైః
కైశ్చిన్ముఖ్యైః ప్రాప్య కర్ణాటభూపం,
సేనావ్యాజేనాకు నేనాసవాహః
సుప్తం రాత్రౌ సోఽవధీ ద్బంధుమిత్రైః
* * * *
హా తేపి కర్ణాటనృపే సహోత్మజైః
తతోవశిష్టం పృథుకం తదాత్మజం,
కమప్యుపాయా దపహృత్య యత్నతః
కథంచి దాయాతి స యాచభూపతిః[3]"

పైదానిలో జగ్గరాజు కర్ణాటనృపుని (శ్రీరంగరాయలను) చంపగా యాచమనాయకుడు కొండొకయుపాయముచే నొక్క బాలకుని రక్షించినాడని తెలియుచున్నది. ఈ బాలకుడే రామదేవరాయలు! దీనికి మరి యొక బలవత్సాక్ష్యము నిచ్చుచున్నాను.

"విష్ణోఃపదం శ్రయతి వేంకటదేవరాయే
సర్వే తదీయసచివా యువరాజనూనం,
శ్రీదానసే తదను భూధరణాయ తూర్ణం
శ్రీరంగరాయ నృపశేఖర మభ్యషించన్.
* * *
సానుజో నిశి స జగ్గమహీశః
పార్థివస్య భవనం పరివేష్ట్య,
భూపతిం తదను పుత్రకళత్రైః
నిర్ఘృణో నిహత మాతను తేస్మ.
తనయేషు నృపాలకస్య కంచిత్
శిశు మాప్తో రజక స్సమేత్య శీఘ్రమ్,
అవయ న్నగరా ద్బహిర్నికాయాం
అతిచార శ్చిద్వివశా మవశిలక్ష్యాం.[4]"

2. రఘునాథాభ్యుదయ నాటకము.

3. సాహిత్యరత్నాకరము, స. ౧౩, శ్లో. ౭౮-౭౩.

4. రఘునాథాభ్యుదయకావ్యం, స. ౮, శ్లో. ౨౬-౩౨.

పైయనువాదము వెనుకటి దానికి సాక్ష్య మిచ్చుచున్నది. వెంకటపతిరాయల యనంతరము రంగని పట్టాభిషిక్తుని చేయగా జగ్గరాజతనిని సపరివారముగా చంప, నొక బాలుఁ డొక చాకలిచే రక్షింపబడె ననియు చెప్పుచున్నది. వీని రెండిటిబలమువలన శ్రీరంగరాయలు రాజధానియందే చంపబడెనని స్పష్టము. చంపబడిన వానికొఱకు యుద్ధము చేయబడుట యసంభవము కదా! కాబట్టి యేవారసును రాజ్యప్రతిష్ఠితుని జేయ యుద్ధము చేయబడెనో యాయన నామము రంగరాయలు కాదనియు, రామ దే: రాయ లనియు తేలుచున్నది. ఇందుతో మొదటి విషయము సిద్ధాంతీకరింపబడినది.

(౨, ౩) తోపూరు యుద్ధమున వారసు పక్షము జయమొందెనుగాని శ్రీ యాచార్యుల వారు చెప్పినట్లోడిపోలేదు. దీనికి శ్రీయాచార్యులవారి వాక్యములోనే యొకసాక్ష్యము కలదు. అందు "The Nayaks of Jinjee and Madura fell on the field" అని చెప్పినారు. ఈ చచ్చినవారు వారసుని ప్రతిపక్షనాయకులు, జగ్గరాయసహాయకులు. వారిచావు వారిగెలుపును చూపునో యోటమిని చూపునో విచారింపుడు! శ్రీయాచార్యులవారు జగ్గరాజే మయ్యెనో చెప్పలేదు. ఈవచనము శ్రీయాచార్యులవారి వాక్యములోని పరస్పర వైరుధ్యమునకు గ్రహించితినిగాని యందలి విషయములు నిజములని కాదు. జింజీ మధుర నాయకులుమడసి రనువిషయము తప్పని ముందే విన్నవించితిని. ఈక్రిందిభాగములను గమనింపుడు.

"అగ్రే యోద్ధై రచ్యుతేష్వప్రమానోః
క్రోధావేశా ద్గుంభితః కుంతజాలైః,
భిత్త్వా త్వాణో బంధువర్గేణ సాకం
జన్యక్షోణ్యాం జగ్గరాజః పపాత"[5]

"భ్రమసిన పడమటి పాళెంబుమీద
దుమికి........................
కత్తులచేత చీకాకు చేయింప
పోరిలో పడసె గొబ్బూరి జగ్గరాజు.[6]"

జగ్గరాజు రణావని మడసెను. ఇక మధుర జింజీనాయకులను గూర్చి పరిశీలింపుడు.

"మధురవారినిగూర్చి మ న్నింత చేసె
విధి యందు తనపాలి విధి దూరుకొనుచు
దొర వెల్ల నవ్వంగ కుండీరవిభుడు
పరువెత్తె తన జింజిపట్టణంబునకు."[7]
"తనవద్ది కోరవెల్ల తను డించి పార
ఇంతుల వెడబాసి యిలు మార యిచ్చి
పంతిరించినబొక్కసము వీడబుచ్చి
తురగంబు డిగ్గి కైదువ పారవైచి
విరిగి పారదొడంగె వీరపసేందు.[8]"

"పక్రంధావారే గంధనాగాశ్వ సంఘాన్
యోషాపారక్త్వ ద్రవ్యభూషావిశేషాన్,
పాంచ్య స్త్రశస్త్రా ప్రాణభీత్యా పమిత్యాం
ధీమాన్ క్రోశం ప్రాద్రవీ ద్దీనదీనః.
కుండీరాజా మీశితా దుర్గదేవ
ప్రాపయ్యోక్తం పాండ్య మత్యంతభంగం,
సద్యోభావత్తేన సాకం రణోర్వ్యాం
అగ్రే సైన్యం హాస్యమానోఽస్త లజ్జః.[9]"

5. రఘునాథాభ్యుదయ కావ్యము, ౧౦-౨౯.
6. రఘునాథాభ్యుదయనాటకము.
7. రఘునాథాభ్యుదయనాటకము.
8. డిటో.
9. రఘునాథాభ్యుదయకావ్యము, ౧౦.౩౫-౩౬.

పై యనువాదములవలన మధుర (పాండ్య), జింజి (తుండీర)విభు లిద్దరును యుద్ధరంగమును విడచి పారిపోయిన ట్లున్నది కావున శ్రీయాచార్యులవారు చెప్పినట్లు వీ రిరువురును యుద్ధరంగమున మడియలేదు. ఇక మడిసిన దెవరు? గొబ్బూరు జగ్గరాజు. జగ్గరాజునకు మధు, రజింజీలు సాయమొసగ్రైను. ఈపక్షము వారసుపక్షము కాదు. పుత్రబ్రువుని పక్షము. ఈ కారణములచే వారసుపక్షము (legitimate heir) గెలిచనేగాని వోడలేదు. మరియు మధుర, జింజీనాయకులు యుద్ధమున మడియలేదు. ఇందులకు మరి రెండు సాక్ష్యముల నిచ్చెదను.

"ధీరోదాత్తో దీనరక్షాధురీణః
సర్వోర్వీభూప స్పృహ్యశౌర్యాకటాగ్రే,
ప్రౌఢాం కీర్తిం ప్రాప్తకామో వ్యతానీత్
పాండ్యక్షోణీపాలకప్రాణదానం.10"

రఘునాథుడు పాండ్యు డనగా ముత్తువీరప్పనాయకుని ప్రాణములను రక్షించెనట! ఈయనయే మధురనాయకుడు!

"ముమ్మె తోపూర జగ్గరాణ్ముఖుల నొంచి
మధురదొర జెంజిమన్నీని మద మడంచి
తిరుచినాపలిదొరల దోలు తేజముగల
మేటి వెలుగోటి యాచని సాటి గలరె.11"

ఇందు యాచమనాయకుడు తోపూరున మధుర జింజీప్రభువుల మదమడంచె నని కంఠోక్తిగా చెప్పబడియున్నది.

కావున శ్రీయాచార్యులవా రుల్లేఖించిన మూడు విషయములకును సమాధానములను వారి ప్రమాణగ్రంథమును గొని యితర సాక్ష్యముల జేర్చి యిచ్చియున్నాను. శ్రీ యాచార్యులవారు తాము ప్రమాణ మని చెప్పుగ్రంథమును చదువకుండ సీవ్యాసమును వ్రాసినట్లు స్పష్టపడుచున్నది. ఇంక నొక్క విషయమును మనవిచేసి సెలవుగైకొందును. శ్రీయాచార్యులవారు వ్రాసినసంచికయందే సుప్రసిద్ధ దక్షిణదేశచారిత్రకపరిశోధకులగు శ్రీ డాక్టరు యస్. కృష్ణస్వామయ్యంగారుమహాశయులు "విద్యానగర రామరాయచక్రవర్తి" యను నొకవ్యాసమును వ్రాసియున్నారు (Ramaraya of Vijianagar, p. 205). అందు ప్రమాణగ్రంథమునుండి యనువదింపలేము గాని నేను వ్రాసినవిషయము లన్నియు జెల్పియున్నారు. శ్రీయాచార్యులవారిని నన్ను మన్నింప మనియు, సీవ్యాసమును చదువు మనియు సవినయముగా వేడుకొనుచున్నాను. కొన్ని వాక్యముల నిట నిచ్చుచున్నాను:—

"When Viceroy Rama the elder brother (of Venkata) died, Venkata sent the elder of the two sons to succeed his father and kept the younger called Ranga or Sriranga to succeed him * * * * It is a massacre of the Royal family that precipitated the war, Jaggaraya having ordered the wholesale murder in cold blood of Ranga and all his family. Before the day appointed for the purpose Yachama Naika managed cleverly to secure the possession of one of the sons of Ranga, his second son by name Rama who was about ten or tewelve * * * as the arrangement was for a washerman to smuggle the boy out of the fort * * * After a number of skirmishes, the war was ultimately decided by the battle of Topur, the village now being called Tohur quite close to the Grand Anicut on the southern banks of the Cauveri. The battle went against the allies, Jagga fell in battle * * (pp. 204, 205).

10. రఘునాథాభ్యుదయకావ్యము, ౧౦.-౬౧.

11. బహుళాశ్వచరిత్రము.

# ఆంధ్రులు : సంస్కృతి సంబంధాలు

శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

మన దేశంలో ఇంతవరకు ఆంధ్రుల సమగ్రచరిత్రమే తయారుకాలేదు. అసలు ఆంధ్రచరిత్ర పరిశోధన ప్రారంభమైనది ఈ మధ్యనే. ప్రధానంగా శాసనాలవల్ల దాన్ని నిర్మించుకొస్తున్నారు. మన తెలుగు ప్రబంధాలు కృత్యాద్యవతరణికలలో కొంత చరిత్రను తెలుపుతూ వచ్చినా అనుస్యూతంగా, సమగ్రంగా ఏ రాజు పరిపాలనాన్ని గురించికాని, ఏ రాజవంశ పరిపాలనాన్ని గూర్చి కాని, ఏయుగానికి సంబంధించిన చరిత్రనుగాని తెలుపటంలేదు; తెలుపలేవు. అందుకనే ఈ వాఙ్మయానికి తోడు శాసనాలను నాణేలను ఆధారంచేసుకొని మన పరిశోధకులు ఇప్పుడిప్పుడే ఆంధ్రదేశచరిత్ర నిర్మిస్తున్నారు. ఈ విధమయిన కష్టాలు ఉండడంవల్లనే మన ఆంధ్రదేశచరిత్ర ఇంతవరకు రావడానికి అవకాశం లేకపోయింది. ఈ ఇరవైయవ శతాబ్దం ప్రారంభంనుంచి విద్వాంసులు చరిత్రాభిమానులు కృషిచేసి శాసనాలు మొదలైనవి తరచి, కొన్ని కొన్ని చరిత్ర శకలాలను బయటపెడుతున్నారు. చూడండి మరి, ఒక్కొక్క నాణెంవల్ల, ఒక్కొక్క శాసనంవల్ల ఏదో కాలగర్భంలో మణిగిపోయిన మనచరిత్రకు సంబంధించిన ఒక అంశాన్ని వెల్లగించాలంటే ఎంతకష్టమో.

ఆంధ్రవంశపు రాజయిన యజ్ఞశ్రీ శాతకర్ణి నాణేలమీద ఓడలు ముద్రకొట్టి ఉన్నాయంటే అతనికాలంలో సముద్రాలమీద వర్తకవ్యాపారం బాగా జరుగుతూండేది అని ఒక నిర్ణయానికి రావడం, అటుతరువాత ఈ అంశం నిజమౌనా కాదా అని ఇతర విషయాలవల్ల రుజువు చేసుకోవడం ఈ విధంగా ఉంది చరిత్రకారుల పరిశ్రమ.

చాళుక్య రాజరాజనరేంద్రుని పెత్తండ్రి, శక్తివర్మ బంగారునాణేలు బర్మాదేశంలో కనబడ్డాయంటే మన వేగి చాళుక్యుల కాలంలో మన ఆంధ్రదేశానికి బర్మాదేశానికి రాకపోకలు వర్తకవ్యాపారం జరుగుతూ ఉండేదనడానికి అభ్యంతరం ఏమి ఉంది? ఈ విధంగా ఒక్కొక్క అంశం అసలు చరిత్ర రాయడానికి ఉద్దేశింపబడని శాసన, నాణక, ప్రబంధాధారాలను పరిశోధించి బయటపెట్టి, మన దేశచరిత్ర అస్థిపంజరం ఒకటి తయారు చేయవలసివస్తూంది.

దాదాపు నలభైఏళ్లుగా జరిగిన పరిశ్రమవల్ల ఇంకా తెలుగుదేశపు చరిత్ర సమగ్రమైనది, అరకొరలు లేకుండా అనుస్యూతమైనది రావడమే కష్టమయినపుడు ఆంధ్రుల వ్యాపారాలన్నిటిని గురించి సమగ్రంగా తెలిపే చరిత్ర రావడానికి ఇంకా ఎంతకాలం పడుతుందో ఆలోచించండి. ఐనా ఇప్పటి

---

* ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ వారి అనుమతిని.

మట్టుకు బయలుపడినటువంటి చారిత్రక విష యాలు చూస్తే ఆంధ్రులు చాలా ఉన్నతిని పొంది, గొప్ప సామ్రాజ్యాలు వెలయించి గొప్ప నభ్యతను కలిగివుండేవారన్న సంగతి రుజువౌతూ ఉంది. తెలుగు దేశాన్ని గురించినటువంటి రాజకీయ, సాంస్కృతిక చరిత్ర ఇంకా సమగ్రంగా రాకపోయినప్ప టికీ ఇప్పటివరకు జరిగిన పరిశోధనలవల్ల తెలుగువారియొక్క కార్యకలాపాలు ఒక తెలుగుదేశానికి మాత్రమే సబంధించి ఉండ లేదనీ, ఇతర దేశాలవారిలాగే ఆంధ్రులు కూడా తెలుగుదేశపు సరిహద్దులను దాటి భూమిమీదా, సముద్రంమీదా కూడా గొప్పవర్తక వ్యాపారం సాగించారనీ, దూర స్థములైనటువంటి దేశాల్లోను, ద్వీపాల్లోను వలసలు ఏర్పరచుకొనినారనీ కొంచెం కొంచెంగా ఇప్పు డిప్పుడే తెలుస్తోంది.

ఆంధ్రులు కృష్ణా, గోదావరీతీరాలను క్రీస్తుశక ప్రారంభంలో రాజ్యంచేస్తూ ఉండే వారు. అంతకు పూర్వమే ఆంధ్రులు ఎప్పటి నుంచో సముద్రాలు దాటి, దూర ద్వీపాలకు వెళ్లి వ్యాపారం సాగించినట్లు చైనా మొద లైన దేశాలవారి చరిత్రలనుబట్టి తెలుస్తుంది. తెలుగుదేశానికి తూర్పువైపున ఉత్తరాన కటకం మొదలుకొని దక్షిణాన మదరాసు వరకు గొప్ప సముద్రతీరం ఉండడంవల్ల ఈ తీరప్రదేశంలో ఉండినటువంటి ఆంధ్రులు ఇంకా చరిత్ర కన్నువిప్పనివాడే మహాసాహ సికులై దూరద్వీపాలకు 'సబుర్లు' చేసేవారు. అందులో ప్రధానంగా చెప్పవలసింది కళింగ దేశం. ప్లినీ, టాలమీ మొదలైనవారు తూర్పు తీరాన్ని పాలూర, మైసోలస్, కొంటకస్సైల, కొడ్డూర మొదలైన రేవు లెన్ని టినో చెప్పారు. ఈ విషయంలో కొంత గట్టికృషి చేసి, డుబ్రాయ్‌దొర గారు మన కృష్ణాజిల్లాలో గూడూ రుండే అదే కొడ్డూ రనీ, అక్కడినుంచే ఒకప్పుడు యాత్రికులు ఓడ లెక్కి దూరద్వీపాలకీ, దేశాలకీ వెళ్లేవారనీ చెప్పారు. ఇంతే కాదు, నాగార్జునికొండశాసనాలలో నాగార్జునికొండ శ్రీక్షేత్రానికి—నాగార్జునికొండను శ్రీనగ మనీ, ఆ బౌద్ధక్షేత్రాన్ని శ్రీక్షేత్ర మనీ అనేవారు— దూరస్థములైన కాశ్మీరము, గాంధారము, సువర్ణద్వీపము, సింహళము మొదలైన చోట్లనుండి బౌద్ధయాత్రికులు వస్తూపోతూన్నట్టుగా తెలుస్తుంది. ఇంకొక విచిత్రం చూచారూ! బర్మాలో పెగూ దేశంలో ప్రోమ్ అని ఒక పట్టణం ఉంది. దాని పూర్వపుపేరు శ్రీక్షేత్రమే. ఈపేరు తోటే దాన్ని చాలాకాలంవరకూ వ్యవ హరించారు. ఇంతేకాదు, ఆరకాణ దేశానికి రాజధానీన·రంపే రేమిటో విన్నారా? దానిపేరు త్రైలింగట. ఇదీకాక, సయాం సింధుశాఖమీద కాకుళ మని ఒక రేవుపట్టణ ముందట. ఈపేరు వింటే మీకు మన శ్రీకా కుళం జ్ఞాపకం రావటంలేదూ? ఇవన్నీ ఏం తెలుపుతాయి? తెలుగుదేశంనుంచి ఆంధ్రు లు మీరూ నేనూ ఎరగని, చరిత్ర ఇంకా తెలుపలేని పాతకాలంలోనే మహాసముద్రాల మీద గొప్ప గాలి తుపానులకీ, వానవరదులకీ జంకకుండా వర్తకమని పేరు చెప్పో, మరో కారణంచేతనో ఆయాదేశాలకి వెళ్లారన్న సంగతి స్పష్టమవటం లేదూ? ఇల్లాగ ఎన్న యినా చెప్పవచ్చును. బర్మా రెండు విభాగా లుగా ఉండేదటపూర్వం ఒకభాగానికి కళింగ మనీ, ఇంకొకభాగానికి ఉత్కళ మనీ పేరట.

పేట్లనుబట్టి, ప్రాచీనాంధ్రులు మహా సాహసికులై సముద్రాలు దాటి దూర దేశాలతో, ద్వీపాలతో వర్తకం చేసి ఆయా దేశాలలోనూ, ద్వీపాలలోనూ వలసలు నిర్మించి తమ మాతృ దేశంలోని పట్టణాల పేర్లే స్థలాలపేర్లే పెట్టుకొంటూ వచ్చారని తేలుతుంది. ఇది ప్రాచీనకాలం నుంచీ వస్తూన్న మామూలు పద్ధతే, కొత్తదేమీ కాదు.

అక్కడికి వీరు వర్తకవ్యాపారంకోసం వెళ్ళి తెలుగుపేటలూ, తెలుగువలసలూ స్థాపించడమే కాదు; అక్కడి రాజకీయాలలోకూడా సంబంధాలు కలిగించుకొంటూ వచ్చారు. కాకపోతే, యవద్వీపంలో తెలంగానానుంచీ, కళింగాన్నుంచీ కొందరితో వచ్చి ఆదిశకుడు అనే అతను వలసలు స్థాపించినట్లు, ఇంకా శూరకృత్యాలేవో చేసినట్లు గాథలు, సంప్రదాయం ఉండడమేమిటి? ఇదొక్కటేనా, బర్మాదేశంలోని పెగూ రాజ్యాన్ని సాధించి, దాన్ని యేలినవాళ్లు తలైంగులట. ఇది అందరూ అంగీకరించిన సంగతే. వీరు తెలుగుదేశంనుంచి వెళ్లారనడానికేమీ అభ్యంతరం లేదు. ఈ తలైంగుల వృత్తాంతాలు క్రీ.పూ. నాలుగవ శతాబ్దంనుంచీ పరంపరగా వస్తూన్నవి. మన తెలుగుదేశంనుంచి వెడుతూవచ్చినవారంతా-ఇటీవల జరుగుతూన్న పరిశోధనలను బట్టి చూస్తే- నాటున కాకుండా సముద్రం మీదనే వెడుతూఉండేవారనీ, గౌడ, కళింగ, ఆంధ్ర దేశాలకీ, బర్మాకూ రాకపోకలు విరివిగా జరుగుతూ ఉండేవనీ, మన దేశం నుంచి వెళ్లినటువంటివాళ్లు గోళనగరం అనే రేవుదగ్గర దిగుతూ వుండేవారనీ స్థిరపడుతూవుంది. గోళనగరం తలైంగులకు రాజధాని అయిన తటోన్ పట్టణానికి వాయవ్యదిశగా 30 మైళ్లదూరాన్ని ఉన్నదట.

చీనావాళ్లు జావా, సుమత్రాద్వీపాలలో మొట్టమొదట కలుసుకొన్న హిందూదేశీయులు కళింగులేనట. అందువల్లనే హిందూదేశాన్నుంచి తరువాత ఎవరు వచ్చినా వాళ్లు వారిని కళింగులనే పిలిచేవారట. మలయా ద్వీపకల్పంలో తూర్పుతీరాన్ని లిగోర్ అనే పట్టణం ఉందట. దీన్ని నిర్మించినవాడు అశోకవంశజుడనీ, దంతపురవాస్తవ్యుడనీ, అతనిపేరు దంతకుమారుడనీ, అతని ఓడ మలయాతీరాన్ని బద్దలయిపోయినందువల్ల అతడా తీరానికి చేరి ఈ లిగోర్ పట్టణం స్థాపించాడనీ చెప్తారు. ఈ దంతపురం ఎక్కడిదంటారు? మన కళింగదేశంలోనిదే. కళింగదేశానికి దంతపురం రాజధాని అని మన ప్రాచీన కళింగదేశశాసనాలలోనే కాదు బౌద్ధుల పాలీ గ్రంథాలలోను, మన ప్రాచీన ఇతిహాసాల్లోనుకూడా వ్రాసిఉంది. శాసనాల పరిచయం ఉన్నవారికి 'స్వస్తి శ్రీ విజయదంతపురాత్" అనేది కొత్తమాట కాదు.

చంపాదేశం ఇండో-చైనా అని అంటామే ఆ ప్రాంతంలో ఉంది. అక్కడికి వెళ్లి హిందూ దేశీయులు వలసలు స్థాపించారట క్రీ. శ. రెండవ శతాబ్దంలోనే. ఈ చంపాదేశంలో వోకణ అనే పట్టణంలో ఒక శిలాశాసనం ఉందట. ఇది ౩-వ శతాబ్దంనాటిది. ఆశాసనలిపి ఏమిటో తెలుసునా? ఆంధ్రవంశజుడయిన వాసిష్ఠీపుత్ర శాతకర్ణి శాసనాల లిపీ, ఈశాసనలిపీ ఒక్కలాగుందని

పరిశోధకు లన్నారు. అటువంటప్పుడు ఈ వలస వెళ్లిన హిందూదేశీయులు మన ఆంధ్రదేశీయులే అంటే యేమి? మనవాళ్లే అయిఉంటా రనడానికి ఇంకా మరికొంచెం ఆధారం ఉంది. ఆచంపాలో ఒక రాష్ట్రం పేరు అమరావతి యట! విజయ అని మరొక రాష్ట్రంపేరు. విజయ పేరు చెబితే విజయవాడ, విజయపురం, విజయనగరం మీకు జ్ఞాపకం రావటం లేదూ? అమరావతిని గూర్చి నేను జ్ఞాపకంచేయడ మెందుకూ?

ఈ చంపాదేశమునకు పడమటగానే ఉంది ఫ్యూనాన్. ఈ ఫ్యూనాన్ దేశము ఉచ్చదశలో ఉన్నప్పుడు కొచ్చిన్-చైనా, కంబోడియా, సియామ్, మలయాలోని కొంతభాగం దాని అధికారానికి లోబడి ఉండేవట; అంటే చీనాదేశ సంస్కృతీ, హిందూదేశ సంస్కృతీ కలుస్తూవచ్చిన కూడలి ప్రదేశ మన్నమాట ఇది. ఈఫ్యూనాన్ రాజ్యం స్థాపించినవాడు హిందూదేశంనుంచి వెళ్లిన బ్రాహ్మణుడట- అతని పేరు కౌండిన్యుడట. ఇంకోచిత్రం— విన్నారా? ఇతడక్కడి నాగవంశపు రాజకన్యను పెళ్లి చేసుకొని అక్కడ హిందూమతం వ్యాపింపజేసి రాజ్యాధికారం స్థాపించాడట. గాథ ఏమనో ఎరుగుదురా? ద్రోణుని కొడుకయిన అశ్వత్థామదగ్గరనుంచి ఆ కౌండిన్యుడు ఒక కుంతాన్ని వరప్రసాదంగా పొందాడట. ద్రోణుడు, అశ్వత్థామ— ఈపేర్లు చెపుతూ పుంటే మీకు మనదేశపు పల్లవులు జ్ఞాపకం రావటంలేదూ? ఈపల్లవులు మన తెలుగు దేశపువాళ్లే. సింహళదేశపు గ్రంథాలలో 'పల్లవభోగం' అని ఒకదేశం వస్తుంది. అదేదో ఎరుగుదురా? అది మన పల్లవనాడే - పల్నాడు. భోగం అనేది పూర్వం దేశవిభాగానికి పేరు—మహేంద్రభోగంలాగ.

వోకన్ శాసనమంటే జ్ఞాపకం వచ్చింది. తూర్పు ద్వీపాలలోను, దేశాలలోను కనబడే మొట్టమొదటి శాసనా లన్నీ మన దేశంలో గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు మండలాలలో ౫, ౬, ౭ శతాబ్దాలలోని శాసనాలు ఏలిపిలో అయితే కనబడతాయో ఆలిపిలోనే ఉన్నాయి. ఈలిపిని వేగిలిపి అనీ, తెలుగు - కన్నడ లిపి అనీ అంటారు. ఈవిధంగా జావా, సుమత్రా, ఇండో-చైనా, సియామ్, బర్మా—ఈ దేశాలన్నిటిలోను మొట్టమొదట కనబడే శాసనాల లిపి మన వేగిలిపే. దీని ననుసరించే బర్మా, సియామ్ దేశాలలో తరువాతతరువాత వాడుతూవచ్చిన లిపులు ఏర్పడ్డాయట. అది కాకుండా, ఈ చెప్పిన దేశా లన్నిటిలోనూ కూడా ప్రాచీన శాసనాలలో వాడుతూ వచ్చింది శాలివాహనశకం. శాలివాహనశకం అంటే అది కేవలం తెలుగువాళ్లదీ, కన్నడులదీని. ఉత్తరహిందూస్థానంలో ఉండేది విక్రమార్కశకం. చేరదేశంలో వాడుకలో ఉండేది కొల్లం శకం. అరవ లెప్పుడూ ప్రాచీన కాలంలో శాలివాహనశకం వాడలేదు. అట్లయితే ఈప్రాంతాలకు వెళ్లినవారు కన్నడులు కాకూడదా అనవచ్చు మీరు. అట్లా కాదంటాను నేను. కన్నడుల కీ సముద్ర తీరంలేదు సముద్ర తీరాన్నుంచి వెళ్లినవాళ్లే ఇవన్నీ వాడుకలోకి తెచ్చిఉండాలి. పైగా ఆ ప్రాంతాలలోని స్థలనామాలన్నీ మన తెలుగుదేశానికి సంబంధించినవే.

ఇంకా నిజ మెంతవరకో తెలియదు కాని దూరస్థద్వీపాలకీ వేగిదేశానికీ ఎక్కువ సంబంధం ఉండంటారు. క్రీ. శ. ౫-వ శతాబ్దంలో పెదవేగి రాజధానిగ శాలంకాయనులు రాజ్యం చేశారు. బర్మాదేశంలో బౌద్ధమతాన్ని వ్యాపింపజేయడానికి వీరే కారణభూతు లని కొంద రంటున్నారు. దీనికి కారణం ఇది. శాసనాలంకారం అనే గ్రంథంలో పేగన్ రాజ్యాన్ని ఏలినటువంటి సాన్ లాన్ క్రోమ్ (San Lan Krom) అనే తలైంగురాజున్ను బుద్ధదత్త, బుద్ధఘోషు లున్ను సమకాలికులని చెప్పిఉంది. ఈ సాన్ లాన్ క్రోమ్ శాలంకాయనవంశజుడే అనీ, శాలంకాయనుల కాలంలో సముద్రవర్తక వ్యాపారం బాగా జరిగేదనీ, ఇతడే బర్మాలో బౌద్ధమతం వ్యాపింపజేశా డని చెపుతున్నారు. ఇదే నిజమయితే మీకూ నాకూ సంతోషమే కాని, మనకు దొరకిన శాలంకాయనుల శాసనాలనుబట్టి చూస్తే వారు హిందువులుగా కనబడతారు కాని బౌద్ధులుగా కనబడరు. అయితే వారివంశస్థు డొకడు బౌద్ధుడై అక్కడికి వలసవెళ్లి రాజ్యం స్థాపించి, అక్కడ బౌద్ధమతం వ్యాపింపజేశా డంటే మీకూ నాకూకూడా తగాదా లేదు.

బుద్ధఘోషుడు హిందూదేశానికి-జంబూద్వీపానికి -వచ్చి, అక్కడినుంచి త్రిపిటకాలప్రతులనూ, తలైంగుభాషలో ఉన్న వాటిమీది వ్యాఖ్యానాలనూ, తదితరగ్రంథాలనూ తలైంగ్ రాజధాని అయిన తటోన్ నగరానికి తీసుకువెల్లా డని చెపుతారు. అతను తీసుకువెళ్లిన ఈ తెలైంగు గ్రంథాలు వేగిలిపిలో ఉన్నాయట. అతడు, అయితే, తెలుగు దేశానికి వచ్చాడా అని అడగవచ్చును. అతని గ్రంథాలనుబట్టి చూస్తే అతనికి గోదావరీప్రాంతభూమి బాగా తెలిసి నట్టుగా తెలుస్తుంది. దీన్నిబట్టి, అతడు తెలుగుదేశానికి కూడా వచ్చి ఉండవచ్చు అనడానికి అభ్యంతరం ఏమీ లేదు.

ఆంధ్రదేశాన్నుంచి ప్రాగ్దేశాలకు వలసవెళ్లిన ఆంధ్రులు సంస్కృత రామాయణ, మహాభారతాలనూ, కావ్యాలనూ, పాలీ ప్రాకృత బౌద్ధగ్రంథాలనూ కూడా అక్కడికి తీసుకువెళ్లడం, అక్కడ హిందూ, బౌద్ధమతాలు రెండూ వ్యాపించడం జరిగింది. ఈనాడు మీరు బర్మాకే కాదు, సియాం మొదలైన దేశాలకు వెళ్లినా మన విఘ్నేశ్వరుణ్నీ, మన శివుణ్నీ, మన విష్ణుమూర్తినీ, ఇంతెందుకు హిందూదేవత లందరినీ చూస్తారు. అంకోర్ వాట్, అంకోర్ థోమ్-ఈ మొదలైనచోట్ల పెద్దపెద్ద దేవాలయా లున్నాయి. అక్కడకూడా అయోధ్య ఉంది. అక్కడా మళ్లీ మన హిందూసంప్రదాయాలే, హిందూగాథలే. అక్కడా రాముడు వనవాసంచేశాడు; పాండవు లజ్ఞాతవాసంచేశారు. స్వాన్ కో లాక్ (Svan Qo Lock)—స్వర్గలోకం అంటారు దీన్ని—ఇది ఇండో-చైనాలో ఒకపట్టణం. ఈ స్వాన్ కో లాక్‌లో ఉన్నటువంటి దేవాలయాలు రెండువేల ఏళ్ల క్రిందటివనీ, ఆనిర్మాణం అదీ చూస్తే హిందూ దేవాలయాలు జ్ఞాపకం వస్తాయనీ, అందుచేత వాటిని కట్టినవారు కూడా హిందూదేశసభ్యతను పూర్తిగా అవలంబించినవారు, హిందూదేశంతో సంబంధం ఉన్నవారు అయివుంటారని చెపుతారు. అక్కడ ఉండే కంచు విగ్రహాలలో గుంటూరుజిల్లా బుద్ధాంలో

ఉండే విగ్రహాల లక్షణా లున్నా యని రాశాడు సూయల్ దొరగారు. బోరోబుడోర్ బౌద్ధస్తూపాన్ని చూస్తే అక్కడి చెక్కడపు పనికి, అక్కడి శిల్పకళకు అమరావతీ శిల్పానికీ ఎక్కువ సంబంధం ఉందనీ, అమరావతీ శిల్పముయొక్క పరిపూర్ణ వికాసమే బోరోబుడోర్ లో కనబడుతుం దనీ చాలామంది బౌద్ధకళావిదులయొక్క అభిప్రాయము. ఈ మన దేశపు అమరావతీ నాగార్జునకొండల లోని బౌద్ధశిల్ప కళాప్రాబల్యం ఒక్క బర్మా, జావాల కళమీాదే కాదు, చైనా దేశపు కళ మీాదకూడా ఉందని ఇప్పుడిప్పుడు చైనా దేశ కళనుపరిశీలిస్తున్న వారు చెపుతున్నారు. నాన్ హాస్యంగ్ టాంగ్ (Nan Hsiang T'ang) అనే పట్టణంలో ఉండే బొమ్మల్లో నాగార్జుని కొండలోని బొమ్మల్లో కనబడే రీతి వైఖరులే కనబడతాయని చెబుతున్నారు. ఫ్యూనాన్ (Fu Nan)శిల్పకళపైని నాగార్జుని కొండ శిల్పకళకు ఎట్టి ప్రాబల్య మున్నదో, తిరిగీ ఫ్యూనాన్ కళా ప్రాబల్యము చైనాకళపై ఎంత వరకు ఉన్నదో చైనా దేశకళావిమర్శకులు ఇటీవలనే గ్రహించి దక్షిణహిందూ దేశకళకు, చైనా దేశకళకు ఉన్న సాదృశ్యములను నిరూపించారు. దీనినిబట్టి చూస్తే మన తెలుగు దేశపుకళ జావా, బర్మాలను దాటి, చంపా దేశాన్ని దాటి, ఫ్యూనాన్ కు పోయి, అక్కడి బౌద్ధకళ కొక విశిష్టత కలిగించి, తద్ద్వారా చైనా దేశకళమీాద ఏవిధంగా తన ప్రాబల్యం నెరపిందో తెలుస్తుంది. ఇవి మనంతట మనం చెప్పుకొనే మాటలు కావుగా!

ఇంకా సమగ్రమయిన చరిత్ర రాలేదు కాని, వచ్చినట్టయితే ప్రాచీనాంధ్రులచరిత్రా, ప్రాచీనాంధ్రుల సంస్కృతీ చాలా గొప్పదనీ, మనము గర్వపడదగిన దనీ మీారే అంగీకరిస్తారు. అటువంటిచరిత్ర వచ్చే అదృష్టం మన కెప్పుడో?



# హైదరాబాదు సంస్కరణలు

శ్రీ యస్. రామాదాస్

"ఏనుగకు రెండురకాలపళ్లు, పైకి గనుపించే దంతాలతో గాదు అది మేత తినేది" అని ఉర్దూలో వకసామెత ఉంది. ఇప్పుడు మహా పటాటోపంతో ప్రకటితాలయిన సంస్కరణలు ఈ చక్కనిసామెతను జ్ఞాపకానికి తెస్తున్నాయి.

ఎంతోకాలం క్రింద, ౧౯౧౯-వ సంవత్సరంలో నైజాం ఒకఫర్మానా జారీచేసి అప్పటి నామకార్థపు కౌన్సిలును విస్తరింపచేయడానికి ఒకస్కీమును తయారుచేయమని దాని కర్తృత్వుడుగావున్న సర్ అలీ ఇమాంగారిని ఆజ్ఞాపించారు. హైదరాబాదుగ్రహచారంవల్ల నైజాంగారితో అభిప్రాయభేదాలు కలిగి సర్ అలీ ఇమాంగారు త్వరలోనే సంస్థానాన్ని వదలిపెట్టి వెళ్లిపోయారు. అంతటితో సరి, తరువాత ఏమీ జరుగలేదు. ఆఖరుకు ౧౯౩౭-వ సం. సెప్టెంబరు ౨౯ దో తారీఖున **వివిధ ప్రయోజనాలకూ గవర్నమెంటుతోగల సంబంధం** మరింత ఘనిష్ఠమవడానికి తగిన వేరువేరుమార్గాలను అన్వేషించి రిపోర్టు చేయవలసిందని ఒకకట్టుదిట్టమయిన కమిటీని నియోగించినట్లు నిజాంప్రభుత్వం ప్రకటన చేసింది. (ఇందలి సైపుమార్పు నాది.) ఇప్పుడు దొరతనంవారి అనుమతిని పొంది సంస్కరణల రూపంతో మనయెదుట వున్నది ఆకమిటీవారి రిపోర్టే. తమతమ వ్యవహారాలను పరిపాలించుకోడంలో తమకుకూడా ఎక్కువ భాగము ఉండవలెననికోరే ప్రజల మనోరథాన్ని ఈ సంస్కరణలు ఎంతవరకు తృప్తిపరుస్తాయో చూడాలి.

రిపోర్టు ఆరంభంలోనే "సంస్థానాధిపతి స్వయంప్రజాప్రతినిధి. ఎన్నికలద్వారా వచ్చిపోతూవుండే ప్రతినిధులతోకంటే ప్రజానీకానికి ఆయనతోగల సంబంధం ఎక్కువ సహజమైందీ, స్థిరమైందీని. సంస్థానానికంతా ఉచ్చతమమైన అధిపతీ, ప్రజాప్రభుత్వపు మూర్తీభవించిన ఆకృతీ రెండూ ఆయనే. ఆటువంటి రాజవ్యవస్థలో సంస్థానాధిపతి ఎట్టి నియమాన్నయినాసరే స్వీకరించడానికి గాని తిరస్కరించడానికిగాని అధికారం కలిగివుండడమే కాకుండా శాసనం నిర్మించడానికీ నిర్మూలించడానికీ ఆయనకు హక్కు వుంది. దినదినం ప్రవర్ధమానమవుతూవుండే లోకుల అవసరాలను దేని ద్వారా నెరవేరుస్తూ ఉంటాడో అట్టిప్రభుత్వయంత్రాన్ని పరివర్తితంచేయడానికి గావలసిన విశిష్టాధికారంకూడా ఆయనకు ఉంది. ఇట్టి పరిపాలనమే మన రాజ్యవ్యవస్థకు ఆధారభూతమైన పునాది. దాన్నే మనం రక్షించుకోవాలి" అని వుంది. ఎంతదూరం వెదకినాసరే ఈ కమిటీవారి "ఫండమెంటల్ డిక్లరేషను"లో నిజమైన సారం వున్నట్లు కన్పించదు.

కాని దివాన్ బహదూర్ వారి కమిటీకిది యోగ్యమయినదే అని తోచినందువల్ల

ప్రజాసత్తాకసిద్ధాంతాలతో ఇది ఎంత వరకు సరిపోతుందో విచారించి చూద్దాం. కమిటీ నిర్దేశించిన ప్రకారం నైజాంగారి అధికారం అప్రతిహతం, అనియంత్రితం, నిరంకుశం, అమోఘం. వారి అధికారానికి హద్దూపద్దూ లేదు. ఏ సార్వభౌమునికి వీరు భక్తియుక్తి గల మిత్రులో వారు సయితం తమ కిటువంటి అధికారం వున్నట్లు తల పోయరని మహా ఘనత వహించిన నైజాం గారికి తెలియనివిషయం గాదు. స్టూఅర్ట్ రాజులకాలం నుంచీ ఇంగ్లండు రా జెవరూ తమ కంతటి అధికారం సామర్థ్యం వున్నట్లు అన లేదు. పార్లమెంటుతో కూడిన రాజు ఇంగ్లండుకు న్యాయపూర్వకమైన పాలకుడే కాని రాజకీయాధిపత్యంమాత్రం జనులదే. పార్లమెంటువారి ప్రతిపాదనలను నిరాకరించే అధికారం ఉంది ఇంగ్లండుదేశపు రాజుకు, కాని అటువంటి యధికారం చాలాకాలంనుంచి ఉపయోగించడం లేదని మనకు తెలుసు. రాజ్యాధిపతికి మర్యాదా మాత్రమే ఈ నిరాకరణాధికారం. ఒకవేళ దాన్ని ప్రయోగించవలసివస్తే ప్రజానీకం ఎన్నుకొన్న ప్రతినిధులకాబినెట్టు సలహా పుచ్చుకొనే ప్రయోగిస్తాడు. నిరంకుశాధికారం ఉందని విశ్వసించేవారి గతి తుద కెట్లా పరిణమించిందీ మ. ఘ. వ. నైజాంవారి ప్రభుత్వానికి తెలియకుండా వుండదు. చారిత్రికపాఠాలు మన విషయంలో మాత్రం వ్యర్థ మవుతాయా ?

ఇంతవరకున్న ఆటబొమ్మలాంటి కౌన్సిలులలో మొత్తం ౨౧ మంది మెంబర్లు. వారిలో నల్గురు మాత్రమే నిర్వాచిత సభ్యులు. ఆ కౌన్సిలుయొక్క అధికారాలనూ, పరిమాణాన్ని వృద్ధిపరచాలని ఈసంస్కరణల తలపు. సంస్కరణలు వస్తే ఏర్పడే అసెంబ్లీలో మొత్తం ౮౫ మంది మెంబర్లు వుంటారు. వారిలో ౪౨ మంద ప్రజానిర్వాచితులు. సమస్తదేశవాసులద్వారా ప్రతినిధుల నెన్నుకొనే ప్రజాసత్తాకపద్ధతిని వదలిపెట్టి "ఆర్థిక ప్రయోజనపు" (Economic interests) ఫాసిస్ట్ విధానాన్ని అవలంబించారు. ఎన్నుకోబడే ౪౨ మంది సభ్యులూ ఈ నిమ్నలిఖితప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తారు:

| | | |
|---|---|---|
| సంస్థానాలు, జాగీర్లు | ... | ౪ |
| మష్‌దార్లు | ... | ౨ |
| వ్యవసాయదార్లు : | | |
| పట్టాదార్లు ౮ } కౌలుదార్లు ౮ } | ... | ౧౬ |
| కార్మిక ప్రయోజనాలు | ... | ౨ |
| పరిశ్రమలు | ... | ౨ |
| వర్తక వ్యాపారం | ... | ౨ |
| షాహుకార్లు (Banking) | ... | ౨ |
| న్యాయవాదులు | | ౨ |
| వైద్యులు | | ౨ |
| పట్టభద్రులు | | ౨ |
| జిల్లాబోర్డులు | | ౨ |
| జిల్లామున్సిపాలిటీలు, నగరమున్సిపాలిటీలు | | ౨ |
| హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషన్ | | ౨ |
| వెరసి | | ౪౨ |

దేశవాసు లందరూ కలసి ప్రతినిధుల నెన్నుకొనే సర్వాంగీకృతమైన టెరిటోరియల్

పద్ధతిని నైజాం గవర్నమెంటువారు ఎందుకు వదలిపెట్టాలి? "ఆర్థికప్రయోజనాల సిద్ధాంతం క్రింద సంయుక్తనిర్వాచనపద్ధతి నవలంబించి పనిచేయ బూనుకొన్నట్లయితే స్థానప్రత్యేకీకరణం మూలంగా అభ్యర్థులలో పోటీలు తగ్గుతాయనీ, అన్యథా సాంఘికసంఘర్షణలకు మార్గా లేర్పడు తాయనీ" దొరతనంవారు చెపుతున్నారు. మొత్తాని కిది ధర్మశీలమైన కాంత్షే. కాని యిది వట్టి ఊహ. అటువంటి పద్ధతివల్ల సాంఘికకక్షలు తొలగుతాయని నే ననుకోను. ఈ సంస్కరణాల్లో ఉద్దేశించిన నిర్వాచనపద్ధతిని సంయుక్త నిర్వాచన మనడం వట్టిమోసం; ఎందువల్లనంటే అభ్యర్థి ఏ వర్గానికి చెందునో ఆవర్గాన్నుంచి కనీసం నూటికి ౪౦ వంతులవోట్లు సంపాదించు కుంటేగాని అతడు ఎన్నికలో నెగ్గినట్లు ప్రకటించరు. రాజకీయ వాదుల భయంచేత ఆర్థిక ప్రయోజనాలను సృష్టించారు. నూతనసంస్కరణాలలో అభ్యర్థి ఆ వర్గానికి చెందిన వా డైతేనే తప్ప ఆఆర్థికప్రయోజనానికి ప్రాతినిధ్యం వహింపజాలడు; ఎట్లనగా వైద్యుడు వైద్య వర్గానికే గాని కార్మిక వర్గానికి ప్రతినిధిగా నిలవడానికి వీల్లేదు. ప్లీడరు న్యాయ వాది వర్గానికేగాని వ్యవసాయకవర్గానికి ప్రతినిధిగా నిలబడజాలడు. "కృషకుల్లో కృషకులకూ, కార్మికుల్లో కార్మికులకూ, వారివారివర్గాలకు ప్రాతినిధ్యం వహించేవారికి తక్కువలేదనీ, వారి నిమిత్తం అన్యులు ప్రాతినిధ్యం వహించనక్కరలేదనీ కౌన్సిలువారికి పూరా నమ్మక" మున్నట్లు దొరతనంవారు చెపుతున్నారు;అంటే ఈ సంస్కరణ- అసెంబ్లీలో జొరబడేవా రందరూ వారివారి స్వప్రయోజనాలకోసమె వెడతారు గాని ప్రజ లందరికోసం కాదు. గుప్పెడుమంది జోహుకుందార్లను ప్రోవుచేసుకొని వీరే ప్రజాప్రతినిధు లని ఊరేగించడానికి ఈతమాషా విధానాన్ని ప్రవేశపెట్టారు. ఇందులో ఏర్పడ్డ నిర్వాచక వర్గాలను పరిశీలించి చూస్తే చాలు, ఈ రహస్యం తేటతెల్ల మవుతుంది.

ఫ్రాన్‌చైజుకమిటీరిపోర్టు మనయెదుట లేకపోవటంచేత ఈ స్థితిలో ప్రాతినిధ్యవిషయాన్ని గురించి ఇదమిత్థమని చెప్పటానికి ఇప్పు డేమీ వలనుపడదు. ఫ్రాంచైజు సమస్య మంచి ప్రాముఖ్యం గలది. సంస్కరణల ప్రకటనతోబాటు కమిటీవారి తీర్పులను గూడా ప్రకటించివుంటే బాగుండేది. నిర్వాచితులగు ప్రతినిధులలో నాలుగు స్థానాలు జాగీరుదార్లవి. ఎట్టి పరిస్థితులలోనైనా సరే జాగీర్దార్లు ప్రభుత్వానికి వ్యతిరేకించడంమాట అట్లా ఉండనీండి, వారిని విమర్శించుటకైనా వీరు సాహసించరు, ఎందువల్లనంటే వారిసుస్థితి యావత్తూ పాలకుడియెడలా, దొరతనం యెడలా చూపించే రాజభక్తిమీదనే ఆధారపడివుంది. ఈ సంగతిని సంస్కరణల రిపోర్టే విశదీకరిస్తూ ఉంది. కార్మిక ప్రాతినిధ్యం ఎవరు వహించేదీ తెలియదు. సంస్థానంలో క్రమబద్ధమైన కార్మికుల అసోసియేషను ఇంచుమించుగా ౨౫,౦౦౦ ల మంది సభ్యులు గల రైలుపనివాళ్ల యూనియనుఒక్కటే. రైల్వేయూనియనువారు ప్రాతినిధ్యంకొరకు కమిటీవారిని అడిగారట. కాని "యూనియనులోని మెంబర్లలో చాలామంది సంస్థానపు సరిహద్దులకు బయట నివసించేవారు. వారందరూ సంస్థానోద్యోగులే. కావున యూనియనుకు ప్రతినిధుల నెన్నుకొనే హక్కులే"

దని సంస్కరణ రిపోర్టులో ఉంది. కాబట్టి సంస్థానంలోని సాధారణ కార్మికు లందరూ ప్రోగయి వారివారి వర్గాలను కట్టుదిట్టం చేసుకొనేటంతపర్యంతం **దొరతనంవారే నామినేషను ద్వారా కార్మికులనిమిత్తం ప్రతినిధులను సమకూర్చి పెడుతూ ఉండాలి.** (పైపు మార్పు నాది). కాబట్టి ముం దేర్పడే అసెంబ్లీలో అసలయిన కార్మిక ప్రతినిధు లుండరు. సంస్కరణాల కమిటీవారి రిపోర్టునుబట్టి సంస్థానపు వైద్యులలో ఎక్కువభాగం దొరతనం వారి నౌఖరులే. కావున దొరతనం వారి దృష్టిలో మంచిపేరు సంపాదించుకొనివున్న వారే నియుక్తులవుతా రనడం నిర్వివాదం. అందువల్ల జాగీర్దార్లు(౭), మష్టార్లు(౨), కార్మికులు (౧), వైద్యులు (౨), జిల్లాబోర్డులు (౧), జిల్లా, నగరమునిసిపాల్టీలు(౨), హైదరాబాదు కార్పొరేషను (౧), కలిసి ౧౬ మంది నిర్వాచితులూ దొరతనంచేతిలోని కీలుబొమ్మలని నాఉద్దేశం; అంటే (ముప్పది ముగ్గురు నామినేటెడు మెంబర్లతో సహా) ౪౯ మంది గవర్నమెంటు పక్షంవారు ఉంటారు; వారు దొరతనంవారి విప్పు జారీచేసే హుకుములను అమలుపరచడానికి సిద్ధంగా ఉంటారు. వ్యవసాయం (౧౬), పరిశ్రమలు (౨), వ్యాపారం (౨), షాహుకార్లు (౨) న్యాయవాదులు (౨), పట్టభద్రులు (౨), గల తతిమ్మా వర్గాలకు ప్రాతినిధ్యం వహించే ౨౬ గురు నిర్వాచితసభ్యుల్లోసైతం ప్రజాపక్షం వహించి మాట్లాడేవారు బహుకొద్దిమందే వుంటారు. ఇటువంటి పరిస్థితులలో సంస్కరణల మూలంగాఏర్పడే అసెంబ్లీయందు ఉద్యోగేతరులైన ప్రజాప్రతినిధులు అధికసంఖ్యాకులుగా వుంటారనడం లోకుల కళ్లల్లో దుమ్ము కొట్టడమేగాని వేరు కాదు. హైదరాబాదు జనులు కోరేది తమవ్యవహారాలను పరిపాలించుకోడంలో కొంతభాగంకాని దొరతనానికి ఏప్రయోజనాలతోను సంబంధం కలిగించమని కాదు.

బడ్జెటులోని కొన్ని అయిటెములను గూర్చి చర్చించడానికి క్రొత్త అసెంబ్లీకి అధికారం వుంది కాని దాన్ని తిరస్కరించే అధికారం లేదు. శాసనసభలో ప్యాసయే ప్రతి బిల్లుకూ సలహామాత్రపు విలువే. అసెంబ్లీ చేసే ఏప్రతిపాదనాన్నయినాసరే నిరాకరించడానికి కౌన్సిలుప్రెసిడెంటుకు సంపూర్ణమైన అధికారం వుంది. జీతాలు, గార్నమెంటు నవుకర్ల అలవెన్సులు ఇత్యాది నిరుపద్రవకరాలయిన విషయాలను గురించి కూడా అసెంబ్లీలో చర్చించడానికి వీల్లేదు. విద్యా విషయాలు చర్చించడనికి అసెంబ్లీకి అధికారం ఇచ్చికూడా ఉస్మానియా యూనివర్సిటీ విషయంలో ఆయధికారం లేకుండాచేసి, దానిని ప్రత్యేకీకరించటం ఆశ్చర్యం గొలిపే సంగతి. ఇటీవల హిందూవిద్యార్థు లందరూ ఒక్కుమ్మడి యూనివర్సిటీని వదలిపెట్టి ఇతర యూనివర్సిటీలకు పోయిన సందర్భం దృష్టియం దుంచుకొని ఆలోచిస్తే ఈప్రత్యేకీకరణంయొక్క భావం బోధపడుతుంది. ఎక్జిక్యూటివ్ కౌన్సిలు ప్రెసిడెంటే శాసనసభకు ఎక్సు అఫీషియో ప్రెసిడెంటుగా వుంటాడు. కాశ్మీర, బరోడా మహారాజులు గావించినలాగు ఉద్యోగేతర డిప్యూటీ ప్రెసిడెంటుకైనా దొరతనంవారు సమ్మతించలేదు.

సంస్థానం ప్రజలలో నూటికి ౮౨ మంది హిందువులు; ౧౦ కి నంతున మహమ్మదీయులు. "ఈ రెండు జాతులవారూ కలిసి

సంస్థానపు జనాభాలో అధికసంఖ్యాకులుగా ఏర్పడుతున్నారనీ, వస్తుతః వీరిద్దరిదే యావత్తు జనసముదాయమనీ" సాకుపెట్టి ముస్లిములకు అసెంబ్లీలో నూరింట ౫౦ తులు స్థానాలను ఇచ్చారు. హరిజనులు యావత్తు జనసంఖ్యలో నూటికి ౧౪ మందిచొప్పున వున్నప్పటికీ, వారు అసలయిన దేశవాసు లయినప్పటికీ వారికి అసెంబ్లీలో ౪ స్థానాలే ఉన్నవి. అవయినా నామినేషనుద్వారానే. ఎక్జిక్యూటివ్ కౌన్సిల్ మెంబర్లే అసెంబ్లీలో ఎక్స్ అఫీషియో మెంబర్లయినందుననూ, ఎక్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులు ఏడుగురిలో ౪ గురు ముస్లిములు కావడంచేతనూ సంస్కరణ- అసెంబ్లీలో హిందువులసంఖ్య క్షీణించి నియమానుసారం వారు అల్ప సంఖ్యాకులలోకి దిగుతారు. "చారిత్రిక సంస్థితి ప్రాముఖ్యాన్ని బట్టీ, రాజ్యాంలో వారికిగల హోదానుబట్టీ సంస్థానంలోని ముస్లింజాతిని అసెంబ్లీలో అల్పసంఖ్యాకపు హోదా కలదాన్నిగా చేయ వీలులే"దని చెప్పబడినది. కాని పాలకవంశంతో సంబంధం ఉన్నదనే మిష మీాద కాశ్మీరంలో అల్పసంఖ్యాకులుగావున్న హిందువులకు అసెంబ్లీలో అధికసంఖ్యాకపు స్థానాలను ఇచ్చేయెడల నైజాంగా రేమంటారో? పంజాబులో నూరింట ౧౪మంది చొ॥ వున్న సిక్కులకు వారికిగల చారిత్రిక ప్రాముఖ్యాన్ని బట్టి పంజాబుఅసెంబ్లీలో బ్రిటిష్ దొరతనంవారు సమానప్రాతినిధ్యం ఇచ్చేయెడల నైజాందొరతనమువారుగాని, ఇండియాలోని మహమ్మదీయులుగాని ఏమంటారో? నిజానికి ఇండియాలోని ముస్లిములకు మహాదురాశ, యావత్తూ తమకే గావాలి. కాని మ. ఘ. వ. నిజాందొరతనంవారు మాత్రం ఇండియాలో ఫేసిస్టు - ముస్లిం ప్రభుత్వం స్థాపించడానికి కటిబద్ధులై ఉన్నారనడం విస్పష్టం.

పౌరస్వత్వాల విషయంలో ఇంకో అడుగు ముందుకు వేశామంటున్నారు ఈ దొరతనం వారు. సభను జరుపుకోడానికి ముందు ప్రభుత్వానుమతిని తీసుకోడానికి బదులు సంచాలకులు ఆవిషయం పోలీసువారి కెరుకపరిస్తే చాలట ముందుగా. కాని ఏ విధమైన మీాటింగును జరుపడమయినాసరే నిషేధించడాని కధికారం పోలీసులకే ఇచ్చారు. ఇది ముందడుగు గాదు. ప్రతివ్యక్తికీ జన్మహక్కయిన పౌరసత్వాన్ని సరాసరి నిరాకరించడమే. ఇక వార్తాపత్రికల విషయంలో బ్రిటిష్ ఇండియాలోని పద్ధతులమీాద నియమాలను చేస్తామని దొరతనంవారి వాగ్దానం. ఇదెట్లా ఉంటుందో మన మింక చూడాలి. కాని పత్రికలకు స్వేచ్ఛ ఇవ్వడమే దొరతనంవారి అభీష్టమయినయెడల వందలకొలది వార్తాపత్రికలమీాద గల నిషేధాలను ఇంకా ఎందుకు సాగిస్తున్నారు? 'సంఘాలను స్థాపించుకొనే విషయంలో నియమించేసే చట్టమేమీా సంస్థానంలో లేదని దొరతనంవారి వాదన. ఇట్లనడంలో నిజాందొరతనంవారి తాత్పర్యమేమిటో మనకు సరిగా తెలియడం లేదు. శాసనబద్ధమైన నిర్బంధా లేమీా లేవని బహుశః వారి ఊహేమో, అది వట్టి అబద్ధం. ముందుగా ప్రభుత్వంవారి అనుమతిలేనిదీ హైదరాబాదులో స్కూళ్లనూ, గరిడీలనయినా స్థాపించడానికి వీల్లేదని కమనకందరికీ తెలిసిన విషయమే. హైదరాబాదు స్టేటు కాంగ్రెసు ఇప్పటి కింకా అరాచకపు సంఘంక్రిందనే లెక్క. మనోవైజ్ఞానికంగా పత్రికలూ, సభ

లూ - ఈ రెండుసంస్థలూ ప్రజాజీవితానికి రక్షకకవాటములవంటివనీ, వాటిని మూసియుంచినయెడల తరుచుగా రాజ్యవ్యవస్థలో అసంతృప్తినామకవ్రణము మొలుచుకొస్తుందనీ ఎరిగివుండికూడా నిజాందొరతనంవారింకా ఈసంస్థలను బంధించే గొలుసులను పగులగొట్టి పారేయడం ఉచిత మని తలంపకుండుట మిగుల విచారకరం. ఇంతేకాదు సుబేదారుద్వారా కాన్ఫరెన్సులను పెట్టించాలనే పాతకాలపునాటి వాడుకను మళ్లీపైకి తీసుకొనిరావడం మరింత విచారకరమైన విషయం. "కాన్ఫరెన్సులకు వచ్చేవారిని బాగా సంతోషపరచాలి, గవర్నమెంటు ఖర్చులతో వారికి గావలసిన సదుపాయా లన్నింటినీ చేయించాలి, అక్కడ వారున్నన్నాళ్లూ సౌఖ్యంగా గడపడానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించాలి" అని రిపోర్టు కమిటీవారి సలహా దొరతనంవారికి. దరఖాస్తుల నందుకోడానికి కాన్ఫరెన్సులు పెట్టించడం అవసరమా? కాన్ఫరెన్సులు లేకుండా సుబేదారు ప్రజల కష్టాలను తొలగించలేడూ? అని అడగవలసి వస్తుంది.

మొత్తంమీద రిఫారం స్కీములో సూచించిన సంస్కరణలు అభివృద్ధి నిరోధకమైనవీ, పాతకాలపునాటివీని. ఈ సంస్కరణ ప్రజాసత్తాక విధానమును సరాసరి నిరాకరించడమే. బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని వాదించే వారందరిమీదా కాలుదువ్వడం. సమస్తప్రకారములైన ప్రతికూలతలనూ అణగద్రొక్కడానికిగాను పుంజీదార్లు, జాగీర్దార్లు, షాహుకార్లు, వ్యాపారనేతలు అందరూ కలిసి ఏకముఖంగా ఎదుర్కోడం. రిఫారమ్ స్కీము యావత్తూ పట్టి దాష్టీకం. ఇది హైదరాబాదుప్రజల నందరినీ ఎగతాళిపట్టించడమే. కాని ఈ కీడులోనుంచి మేలు పుట్టుకొస్తుందనే నా ఉద్దేశం. సాధారణ జనసమూహాల ఆర్థిక, రాజకీయాశయాలను హిందూ పుంజీదార్లూ, ముస్లిం పుంజీదార్లూ ఏకీభవించి అణగద్రొక్కడానికి ఎప్పుడు ప్రయత్నిస్తారో హైదరాబాదు హిందువులకు, ముసల్మానులకు అప్పుడే తెలిసివస్తుంది క్రూరులు జాతికోసంగాని, మతంకోసంగాని లెక్కచేయరని. అప్పుడు పుంజీదారువర్గాలనీ, కొల్లగొట్టబడే సామాన్యజనవర్గాలనీ రెండు విభాగా లేర్పడి, ఇప్పుడు కమ్యూనల్ పద్ధతిమీద నెలకొల్పబడిన విభాగాలు పటాపంచ లయేటందుకు తోడ్పడుతాయి. అదీ తగిన సమయం హైదరాబాదువారికి —విజృంభించి బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపించుకోడానికి.

---

# హిందూదేశము : కాగితపుపరిశ్రమ

శ్రీ సి. వి. దీక్షితులు

ఒకప్పుడు మన దేశమున మంచిచక్కని కాగితములు చేతితోనే తయారుచేయబడుచుండెడివి. ఈ యంత్రయుగమునకు ముందు ఆ కాగితములనే దేశమంతటను వ్రాయుట కుపయోగించు చుండెడివారు. తెలుగు జిల్లాలలో కొండపల్లి కాగితముల ప్రసిద్ధి పెద్దల వలన మన మిప్పటికిని వినుచున్నాము. కాని యంత్రములు మనుష్యుని త్రోసిరాజని వానిస్థానము నాక్రమించినపిదప, మన దేశమున కాగితములు చేతితో తయారుచేయుట తగ్గిపోయినది; యంత్ర ప్రభావము వ్యాపింపని ఏమారుమూలప్రదేశము లందో యిప్పటికిని కొద్దిపాటిగా కాగితములు చేతితో తయారగుచున్నను జనబాహుళ్యమున కాసంగతి తెలియుననికూడ చెప్పుటకు వీలులేదు. యంత్రసహాయమున విదేశములలో తయారుచేయబడిన కాగితములు దిగుమతియగుట ప్రారంభించినపిదప చేతిపరిశ్రమ వానిధాటి కాగలేక క్రమముగా అడుగంటిపోయినది. వస్త్రపరిశ్రమ, లోహపరిశ్రమ మొదలగు ఇతర గ్రామ పరిశ్రమలకు పట్టినగతియే ఈ కాగితపు పరిశ్రమకు కూడ పట్టినది. క్రమముగా మన దేశము విదేశీ కాగితములను దిగుమతి చేసికొనజొచ్చినది. నాగరికత ప్రబలి, మన యలవాటులు మారుటకుతోడు, ముద్రణ సౌకర్యము లధికము కాగా, హిందూదేశమున కాగితముల కవసరము హెచ్చిపోయినది. అందుచేత ఈ పదార్థమునకై ప్రతి సంవత్సరమునను ఎంతో ధనము — దానిమొత్తము కోట్లరూపాయలలో లెక్కపెట్టవలసి యుండును — మన దేశమునుండి విదేశములకు దొర్లిపోయి దేశసౌభాగ్యమునకు భంగము వాటిల్లుచున్నది.

చేతి పరిశ్రమ యంత్ర పరిశ్రమతో పోటీ చేయలేదను సంగతి వ్యక్తమైనపిదప ౧౯-వ శతాబ్దపు మధ్యభాగమున, మన దేశమున కూడ కాగితములు తయారుచేయుటకు యంత్రపరిశ్రమను స్థాపించుటకై ప్రయత్నము లారంభమైనవి. కాని చాలకాలము వరకు వీని యభివృద్ధి యంత హర్షదాయకముగా లేదు. దేశీయపరిశ్రమ ముందంజ వేయకుండుటకు కారణము లనేకము లున్నవి. అందు ముఖ్యమైనవి రెండు. ప్రారంభదశలో కాగితములు తయారు చేయుటకుగాను "సాబై"[1] అను ఒకరకపు గడ్డిని ఉపయోగించెడివారు. ఈ గడ్డి ఉత్తర హిందూస్థానమున అక్కడక్కడ మాత్రము, అనగా పంజాబు, సంయుక్త రాష్ట్రములు బెంగాలు, బీహారు రాష్ట్రములలో కొన్ని ప్రాంతములయందు దొరకెడిది; మన దేశమున వెదురు విరివిగా లభించుచున్నను ఆదినములలో దాని నుపయోగించుటకు యత్నించియుండలేదు. కాగితములు తయారుచేయు విధానమున చాల

1. **Sabai grass** - ఇది యొకరకపు పచ్చిగడ్డి.

క్కువగా ఉష్ణరూపమగు శక్తి వ్యయ
సగును; అందులకుగాను, రాక్షసిబొగ్గు సుల
మముగా అందుబాటులో నుండవలెను. మన
దేశమున బొగ్గుగనులు, బెంగాలు, బీహారు,
మధ్యరాష్ట్రములలో కొన్ని ప్రాంతముల
దుండుమాత్రమే ఉన్నవి. అందువలన కాగి
తములు చేయుటకు వలసిన ముడిపదార్థమగు
గడ్డిని, గనులసామీప్యమునకు తీసికొనిపోవు
టకు విపరీతమగు వ్యయ మయ్యెడిది. ఇందు
వలన కాగితముఖరీదు బాగుగా ఎక్కు
వైననేతప్ప కిట్టింపు అయ్యెడిదికాదు. ఇందుకు
తోడు, ఒకవంక దేశమున పరిశ్రమలవిషయ
మునసాహసము తక్కువ; ఇంకొకవంక కాగి
తము తయారుచేయు విధానమున అవసర
మగు రాసాయనికపదార్థములు (Chemicals)
మనదేశమున లేకపోవుట-ఇవికూడ పరిశ్రమ
యొక్క సత్వరాభివృద్ధికి ఆటంకములైనవి.
ఎన్నియడ్డంకు లున్నను గతశతాబ్దపు మధ్య
భాగమున దేశమునం దచ్చటచ్చట ఏవో
కొన్నిమిల్లులు స్థాపితములై పని జరపజొచ్చి
నవి. ఆమిల్లులు ఏదో స్వల్పాభివృద్ధిని సూచిం
చినవి. ఈవిధముగా సుమారు డెబ్బదియైదు
సంవత్సరములు గతించినపిదపగాని, మనదే
శపు ప్రభుత్వము ఈపరిశ్రమను కన్నెత్తి చూ
డ లేదు. ప్రభుత్వమునుండి సహాయముగాని,
రక్షణసుంకములుగాని లేకయే ఈపరిశ్రమ
తన శైశవము గడపి బాలారిష్టములు దాటి
గట్టెక్కినది. ౧౯౧౦-వ సం. మొదలు
౧౯౨౦-వ సంవత్సరమువరకును దేశీయో
త్పత్తి ౨౭ వేల టన్నులకు పైనను, ౩౦ వేల
టన్నులకు లోపుగాను ఉండెడిది. గత ఐరోపా
మహాయుద్ధపుదినములలో విదేశములనుండి
దిగుమతులు వచ్చుట కష్టమైనప్పుడు దేశీయ
పరిశ్రమకు కొంచెము తాత్కాలికావకా
శము చిక్కినది. యుద్ధానంతరమున దేశీయ
పరిశ్రమ ఎట్లభివృద్ధిచెందినదియు, దేశములో
ఖర్చగుచున్న మొత్తము కాగితములో
స్వదేశీమిల్లులవలన ఎంత ఉత్పత్తియగుచున్న
దియు ఈక్రిందిపట్టిక తెలుపగలదు.

౧-వ పట్టిక.

| సంవత్సరము | వేల టన్నులలో | | మొత్తములో ఉత్పత్తి నూటి కన్నిపాళ్లు % |
|---|---|---|---|
| | దిగుమతులు | ఉత్పత్తి | |
| ౧౯౨౧ | ౪౦.౨ | ౩౧.౪ | ౪౨ |
| ,, ౨౨ | ౬౦.౩ | ౨౮.౭ | ౨౮ |
| ,, ౨౩ | ౬౪.౫ | ౨౩.౯ | ౨౯ |
| ,, ౨౪ | ౮౪.౯ | ౨౬.౦ | ౨౩ |
| ,, ౨౫ | ౮౭.౪ | ౨౮.౬ | ౨౫ |
| ,, ౨౬ | ౧౦౦.౪ | ౩౨.౧ | ౨౪ |
| ,, ౨౭ | ౧౦౪.౫ | ౩౩.౯ | ౨౫ |
| ,, ౨౮ | ౧౧౫.౬ | ౩౮.౧ | ౨౫ |
| ,, ౨౯ | ౧౩౭.౦ | ౪౦.౮ | ౨౩ |
| ,, ౩౦ | ౧౧౪.౭ | ౩౯.౮ | ౨౬ |
| ,, ౩౧ | ౧౦౯.౫ | ౪౦.౭ | ౨౭ |
| ,, ౩౨ | ౧౩౨.౦ | ౪౦.౨ | ౨౩ |
| ,, ౩౩ | ౧౨౮.౧ | ౪౩.౪ | ౨౫ |
| ,, ౩౪ | ౧౪౬.౮ | ౪౪.౫ | ౨౩ |
| ,, ౩౫ | ౧౬౬.౬ | ౬౭.౬ | ౨౨ |
| ,, ౩౬ | ౧౬౦.౧ | ౪౮.౦ | ౨౩ |
| ,, ౩౭ | ౧౮౨.౦ | ౫౩.౮ | ౨౩ |

గమనింపు: ఈ పట్టికలో సంవత్సర మనగా ఆర్థికసంవత్సర మని తెలుసుకొనవలెను. ౧౯౨౧ అనగా ౧౯౨౧ ఏప్రిలు మొదలు ౧౯౨౨ మార్చి నెలాఖరువరకు గల కాలము.

పై పట్టికలోని విషయ మవగతము చేసుకొనుట కొక సంగతి తెలుసుకొనవలసి యున్నది. యుద్ధసంవత్సరములలో, అనగా ౧౯౧౪ మొదలు ౧౯౧౮ వరకును గల

నాలుగు సంవత్సరములలో దేశీయోత్పత్తి సాలునకు సగటున ౩౧.౪ వేల టన్నులు; కాని యుద్ధానంతరము ఈ సంఖ్య తటాలున పడిపోయినది. ౧౯౨౨-వ సంవత్సరము నుండియు దిగుమతులు హెచ్చుకా నారంభించినవి. ౧౯౨౧-వ సంవత్సరమున ౪౦ వేల టన్నులతో ప్రారంభించిన దిగుమతులు ౧౯౨౬ వ సంవత్సరమున ౧౧౦ వేల టన్నుల వరకును, ౧౯౩౬-వ సంవత్సరమున ౧౬౦ వేల టన్నులవరకును ఉపద్రవముగా పెరిగిపోయినవి. ఈ విపరీతపు పెరుగుదలవలన దేశీయ పరిశ్రమాభివృద్ధికి భంగము కలిగినది. కాగితముయొక్క అవసరము హెచ్చినకొలదిని, సాధారణ సందర్భములలో దేశీయోత్పత్తి హెచ్చవలసియున్నది. కాని మన దేశమున అది వ్యతిరేకమైనది. ౧౯౨౧-వ సంవత్సరమున నూరింట ౪౨ పాళ్లున్న దేశీయోత్పత్తి ౧౯౨౪-వ సంవత్సరమున నూరింట ౨౩ పాళ్ల వరకును దిగిపోయినది. అందువలన మిల్లు యజమానులు భయపడి, పోటీ కాగలేక రక్షణ కావలె నని ప్రభుత్వమును కోరిరి. దేశములో ఉత్పత్తి చేయుట వలన అగు వెలకంటె తక్కువ వెలకు విదేశములనుండి కాగితము దిగుమతి కాకుండునట్లు రక్షణసుంకములను విధించవలెనని వారు ప్రభుత్వమున కెరుకపరచిరి. దీనితో మన దేశపు కాగితపు పరిశ్రమ యొక్క మొదటిదశ పూర్తియైనది. రక్షణ సుంకములతో రెండవదశ ప్రారంభమైనది.

ప్రభుత్వము మిల్లు యజమానుల మాటకు చెవియొగ్గి ౧౯౨౫-వ సంవత్సరమున కాగితపు పరిశ్రమకు రక్షణ యవసరమున్నదా లేదాయనువిషయమును చర్చించి, ఆ విషయమై సూచనలు గావించుటకు టారిఫ్ బోర్డును నియమించిరి. టారిఫ్ బోర్డు వారు ఆ విషయమై సమగ్రమగు విచారణ సలిపి, కొన్ని రకముల కాగితములకు రక్షణ అవసరమని సూచించిరి; అనగా, పరిశ్రమ కంతకు పూర్తియగు రక్షణ కాక కొంత భాగమునకు మాత్రమే రక్షణ యొసగబడెను. రక్షణ యొసగబడిన భాగములో ప్రధానమైనవి, వ్రాయుట కుపయోగించు కాగితములును, పత్రికలు మొదలగువాని కుపయోగించు చౌకరకపు కాగితములును తక్కినిలిన అచ్చు కుపయోగించు కాగితములును మాత్రమని చెప్పవచ్చును. ఈ క్రింది పట్టికవలన ఈ రక్షణ పరిశ్రమ కెట్లు తోడ్పడినదియు తెలియగలదు.

౨-వ పట్టిక.

రక్షణయొసగబడిన రకము కాగితములు

| సంవత్సరము | వేలటన్నులలో | | మొత్తములో దేశీయోత్పత్తి నూటికెన్నిపాళ్లు % |
|---|---|---|---|
| | దిగుమతులు | దేశీయోత్పత్తి | |
| ౧౯౨౪ | ౨౦ | ౨౩ | ౫౪ |
| ,, ౨౫ | ౧౭ | ౨౫ | ౫౯ |
| ,, ౨౬ | ౧౭ | ౨౮ | ౬౨ |
| ,, ౨౭ | ౧౮ | ౩౦ | ౬౩ |
| ,, ౨౮ | ౧౯ | ౩౪ | ౬౪ |
| ,, ౨౯ | ౨౦ | ౩౩ | ౬౩ |
| ,, ౩౦ | ౧౪ | ౩౫ | ౭౧ |
| ,, ౩౧ | ౧౨ | ౩౬ | ౭౫ |
| ,, ౩౨ | ౧౧ | ౩౫ | ౭౬ |
| ,, ౩౩ | ౧౩ | ౩౮ | ౭౫ |
| ,, ౩౪ | ౧౧ | ౪౦ | ౭౮ |
| ,, ౩౫ | ౧౨ | ౪౩ | ౭౮ |
| ,, ౩౬ | ౧౨ | ౪౩ | ౭౮ |

పరా: సంవత్సర మనగా ఆర్థిక సంవత్సరము.
౧౯౨౮ - వ సంవత్సర మనగా ౧౯౨౮ - వ సంవత్సరం ఏప్రిలు మొదలు ౧౯౨౯ - వ సంవత్సరం మార్చినెలాఖరువరకుగల కాలము.

రక్షణ ఒసగబడిన పిదప, రక్షణగల రకపుకాగితముల దిగుమతులు క్రమముగా తగ్గిపోయినవని పై వివరములనుబట్టి స్పష్టమగుచున్నది. దిగుమతులు తగ్గిపోగా వాని స్థానమును దేశీయపరిశ్రమ ఆక్రమించుకొన్నది. దేశీయోత్పత్తి క్రమముగా హెచ్చినది. మొదట నూరింట ౯౮ పాళ్లున్న దేశీయోత్పత్తి పన్నెండు సంవత్సరముల కాలములో నూరింట ౪౭ పాళ్లవరకును పెరిగినది. ఈ విధముగా రక్షణ పరిశ్రమకు కొంత లాభకారియైన దనియే చెప్పవలెను. దేశీయోత్పత్తి ౧౯౨౮ - వ సంవత్సరములో పోల్చి చూచినయెడల ౧౯౩౬ - వ సంవత్సరమున కొంచెమించుమించు రెట్టింపైనది.

కాని ఈ సందర్భమున ఇంకొక విషయము గమనించవలసి యున్నది. పై కాలమున అన్ని రకముల కాగితములును కలిపి విదేశపు దిగుమతులు రెట్టింపు పెరిగినవి. రక్షణగల కాగితముల దిగుమతులు తగ్గిపోయినను మొత్తము దిగుమతులు హెచ్చుట ఆలోచించవలసిన విషయమే. ఇంకొక విశేష మేమన మొత్తము ఖర్చగుచున్న కాగితములలో దేశములో తయారగుచున్న కాగితములవంతు ఏమియును పెరిగియుండలేదు. కాబట్టి ౧౯౨౯ - వ సంవత్సరములో పరిశ్రమ కొసగబడినరక్షణ ఇతరరకముల విదేశీకాగితముల దిగుమతులనుండి పరిశ్రమను రక్షించలేకపోయినను రక్షణ ఒసగబడినంతవరకు పరిశ్రమకు మిక్కిలి తోడ్పడిన దనియే చెప్పవలసియున్నది. అయినను ఈ సందర్భమున ఇంకొకవిషయము చెప్పకొనకతప్పదు. ఈ అభివృద్ధిలో చాలవరకు మొదటి అయిదారుసంవత్సరములలో కాగితములు తయారుచేయుటకు కావలసిన గుజ్జును (pulp) దేశీయ పదార్థములనుండి, దేశములో తయారుచేయుటవలనగాక, విదేశములలో తయారైన గుజ్జును దిగుమతిచేసుకొని దానివలన కాగితములు తయారుచేయుటచేతనే కలిగిన దనుట నిర్వివాదాంశము. ఈ విషయము ఈ క్రింద ఈయబడిన పట్టికవలన తెలియగలదు.

3-వ పట్టిక.

| మిల్లు పేరు | మొత్తము తయారులో దిగుమతియైన గుజ్జువంతు నూటికి(%) | |
|---|---|---|
| | ౧౯౨౮—౨౯ | ౧౯౩౦—౩౧ |
| టిటాఘర్ పేపరు ... | ౩౪ | ౮౮ |
| బెంగాల్ పేపరు ... | ౨౪ | ౫౨ |
| ఇండియా పేపరు పల్పు | ౨౧ | ౭౩ |

మన దేశములో ప్రాముఖ్యమైన మూడు పేపరుకంపెనీలతాలూకు వివరములు పైన యీయబడినవి. పైమూడుకంపెనీలును కూడ తా ముపయోగించు గుజ్జులో చాలభాగము విదేశములనుండియే తెప్పించుకొనవచ్చినవి. ఈ విషయమున బెంగాల్ పేపర్ కంపెనీయును, ఇండియా పేపర్ పల్ప్ కంపెనీయును, మిక్కిలి దోషు లని చెప్పకతీరదు. ౧౯౩౦ - వ సంవత్సరము నాటికి బెంగాల్ పేపరు కంపెనీ

వారు తా ముపయోగించు గుజ్జులో సగము భాగమును, ఇండియా పేపరుపల్ప్ కంపెనీ వారు తా ముపయోగించుదానిలో సుమారు మూడింట రెండుపాళ్లను విదేశములనుండి దిగుమతిచేయ నారంభించిరి. ఈ విధముగా రక్షణగల భాగములో కూడ దేశీయపరిశ్రమకు విదేశపు దిగుమతులపైననే ఆధారపడవలసిన దురవస్థ చేకూరినది. ఈ తప్పు దారినుండి పరిశ్రమను తప్పించి, సరియైన మార్గమున నడపుటకును, మన దేశములో దొరకు ముడివస్తువులనుండియే కాగితము చేయుటకు కావలసిన గుజ్జును తయారు చేయుటకు ప్రోత్సాహ మొసగుటకును, ౧౯౩౧-వ సంవత్సరము నుండియు విదేశములనుండి వచ్చు గుజ్జు దిగుమతులపై ప్రభుత్వము సుంకము విధించినది. ఈ సుంకమువలన కోరిన ఫలిత మొనగూడినది. అప్పటినుండియు, మన మిల్లులు తమకు కావలసిన గుజ్జును తామే తయారు చేసుకొన యత్నింప సాగినవి; క్రమముగా విదేశపు గుజ్జును ఉపయోగించుట తగ్గించుచున్నవి. ఈ విషయము ప్రక్క ఈయబడిన ౪-వ పట్టికవలన తేలగలదు. ఆపట్టికవలన ౧౯౩౧-వ సంవత్సరమున నూరింట ౫౩ పాళ్లు విదేశపుగుజ్జు దిగుమతి కాగా ౧౯౩౭-వ సంవత్సరమున దానిదిగుమతులు నూరింట ౨౪ పాళ్లవరకును పడిపోయినవి. రాబోవు సంవత్సరములలో గుజ్జు దిగుమతులు ఇంకను తగ్గునని మన మాశింపవచ్చును.

౪-వ పట్టిక.
(మొత్తము గుజ్జులో స్వదేశీగుజ్జువంతు)
అంకెలు వేలటన్నులను సూచించును.

| సంవత్సరము (ఆర్థిక సంవత్సరము) | స్వదేశీగుజ్జు | విదేశీగుజ్జు దిగుమతి | స్వదేశీగుజ్జు నూరింటి వంతు % | విదేశీగుజ్జు నూరింటి వంతు % |
|---|---|---|---|---|
| ౧౯౩౧—౩౨ | ౧౮ | ౨౦ | ౪౭ | ౫౩ |
| ౧౯౩౨—౩౩ | ౧౮ | ౨౧ | ౪౫ | ౫౫ |
| ౧౯౩౩—౩౪ | ౨౨ | ౨౦ | ౫౨ | ౪౮ |
| ౧౯౩౪—౩౫ | ౨౩ | ౨౦ | ౫౪ | ౪౬ |
| ౧౯౩౫—౩౬ | ౩౦ | ౧౭ | ౬౫ | ౩౫ |
| ౧౯౩౬—౩౭ | ౩౫ | ౧౧ | ౭౬ | ౨౪ |

ఇప్పు డొకసారి మనము తిరిగి ఒకటి రెండు పట్టికలను జాగ్రత్తగా చూచినట్లయిన ఒకసంగతి స్పష్ట మగును. రక్షణగల రకము కాగితములలో దేశీయోత్పత్తి మంచియాభివృద్ధి చూపినను, దేశములో చెలామణియగు అన్నిరకముల కాగితముల మొత్తముతో పోల్చి చూచినయెడల దేశయోత్పత్తి ముందంజవేయుచున్నట్లు లేదు; ఏమనగా మొత్తములో స్వదేశీకాగితములవంతు నాల్గింట ఒక పాలును మించక ఆ ప్రాంతమునందే ఊగిసలాడుచున్నది. ఈ సంగతి ఇంతకు ముం దొకసారి సూచించితిని. ఈవిషయమున కూడ స్వదేశీపరిశ్రమ అభివృద్ధి చూపవలెననిన మనము కొంచెము లోతు తరచిచూడవలెను. అప్పుడుకాని మనము విదేశముల నుండి వచ్చు దిగుమతులను ఏల అరికట్టజాలకున్నామో తెలియనేరదు.

ఏ యేరకముకాగితములను ఎంత ఎంత పరిమాణములో మనము విదేశములనుండి దిగుమతి చేసుకొనుచున్నామో ౫-వ పట్టిక వివరముగా చూపించును.

౫-వ పట్టిక.

| కాగితపు రకము (దిగుమతులు వేల టన్నులలో) | ౧౯౨౫—౩౦ సంవత్సరములలో సాలుసరి సగటు | ౧౯౩౦—౩౧ | ౧౯౩౧—౩౨ | ౧౯౩౨—౩౩ | ౧౯౩౩—౩౪ | ౧౯౩౪—౩౫ | ౧౯౩౫—౩౬ | ౧౯౩౬—౩౭ | ౧౯౩౭—౩౮ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పొట్లములువగైరా కట్టుకొను కాగితములు[1] ... ... | ౧౧ | ౧౨ | ౧౦ | ౧౬ | ౧౩ | ౧౬ | ౨౦ | ౧౭ | ౨౬ |
| దినపత్రికలు అచ్చువేయురకములు[2]... | ౧౯ | ౨౨ | ౨౦ | ౨౩ | ౨౫ | ౨౮ | ౫౧ | ౫౦ | ౬౧ |
| ఇతర అచ్చురకములు[3] ... | ౧౩ | ౧౩ | ౧౧ | ౧౧ | ౧౩ | ౧౦ | | | |
| వ్రాతకాగితములు కవర్లు ... | ౧౦ | ౭ | ౭ | ౮ | ౭ | ౮ | ౮ | ౭ | ౯ |
| పాత పత్రికలు[4] ... ... | ౩౬ | ౪౧ | ౪౨ | ౪౮ | ౪౮ | ౫౭ | ౫౭ | ౫౫ | ౪౯ |
| ఇతర రకములు ... ... | ౩ | ౧౩ | ౪ | ౫ | ౫ | ౫ | ౪ | ౪ | ౩ |
| కాగితముతో తయారయిన సామానులు[5] ... ... | ౧ | ౧ | ౧ | ౧ | ౨ | ౨ | ౨ | ౨ | ౨ |
| అట్టలు వగైరా[6] ... ... | ౧౮ | ౧౫ | ౧౪ | ౨౧ | ౧౬ | ౨౧ | ౨౫ | ౨౪ | ౩౨ |
| మొత్తము ... | ౧౦౯ | ౧౧౫ | ౧౧౦ | ౧౩౨ | ౧౨౭ | ౧౪౮ | ౧౬౮ | ౧౬౦ | ౧౭౨ |

(౧౯౩౫—౩౬ నుండి దినపత్రికలు అచ్చువేయురకములు, ఇతర అచ్చురకములు కలిపి ఇవ్వబడినవి.)

మనకు దిగుమతి యగు సరకులో ఎక్కువ భాగము పాతపత్రికలు, దినపత్రికలు అచ్చువేయు కాగితములు, అట్టలు వగైరా, పొట్లములు కట్టుకొను కాగితములును అయియున్నవి. వాని దిగుమతుల పరిమాణము కూడ పైన వివరించిన వరుసలోనే యున్నది. ఈ రకము లన్నియును రక్షణ సుంకముల క్రిందకు రానివే. అంతేకాక మన దిగుమతులలో నూటికి నలుబదిపాళ్లు ఆక్రమించు కొన్న పాతపత్రికలకును మనము తయారుచేయు కాగితములకును సంబంధము లేదు. అవి కేవలము పొట్లములు కట్టుకొనుట కొరకై మన దేశమునకు దిగుమతి చేయబడుచున్నవి. దేశీయోత్పత్తి వీనిస్థానము నాక్రమించుట కవకాశము లేదు. ఇవి దిగుమతి కాకుండ చేయుటకు వేరుమార్గము లాలోచించవలసియున్నది. ఇక పత్రికలు అచ్చువేయు రకమన్ననో, ఇది యొక ప్రత్యేక సమస్య. వార్తాపత్రికలును, ఇతరపత్రికలును అచ్చువేయుటకు వీలుగా చౌకగా తయారగు కాగితపురక మిది. ఇది ఒక ప్రత్యేక రకపు గుజ్జు*తో విదేశములలో తయారగు

1. Packing paper.
2. News print.
3. Other printing paper.
4. Old News papers.
5. Paper manufactures.
6. Card board, paste board, etc.

* Machanical pulp. అనిజీవి జీరు.

చున్నది. ప్రస్తుతము అంత చౌకగా దీనిని మనదేశములో తయారుచేయుటకు అవకాశము తక్కువ. దీనిని తయారుచేయుటకు మనదేశపు మిల్లులు ప్రారంభించుచో అందులకు ప్రభుత్వము ప్రత్యేకసహాయము చేయవలసియుండును. ఏమనగా, మొదట కొన్ని సంవత్సరములవరకును ఈ రకపు కాగితము తయారు చేయుటలో ఇతరదేశముల పోటీ కాగలేక స్వదేశీమిల్లులు దెబ్బతినుట తప్పదు. అందువలన ఈ రకపు కాగితముల దిగుమతులపై రక్షణసుంకములనైనను వేయవలెను; లేదా కొంతకాలమువరకును ప్రభుత్వము పరిశ్రమకు సహాయచేసి, నష్టము కూడనీసుకొనుటకు మిల్లులకు కొంత ద్రవ్యమునైనను ఇచ్చుచుండవలెను1. రక్షణ సుంకములను వేయదలచుట కానిపనియని చెప్పవలసియుండును; ఏమనగా ఇప్పుడున్న దిగుమతి సుంకములతోనే వార్తాపత్రికలు చాల చిక్కులకు లోనగుచున్నవి. ఇంకను ఎక్కువ పన్ను విధించినట్లయిన వార్తాపత్రికలలో చాలవరకు నిలిచిపోయినను పోవచ్చును; ఉన్నదానికంటె ఎక్కువ భారమును పత్రికలు వహింపజాలవనుటలో కొంత సత్యమున్నది. గత సంవత్సరము ప్రభుత్వము ఈరకము కాగితములపై ఆదాయమునిమిత్తము ఆర్థిక దురవస్థ సందర్భమున విధించిన హెచ్చు పన్నును తగ్గించినది. కాబట్టి ఈ రకపు కాగితముల ఉత్పత్తిని మనదేశములో ప్రోత్సహించవలెననిన ౧౯౨౩ మొదలు ౧౯౩౪ వ సంవత్సరము వరకును ఉక్కుపరిశ్రమకు చేసినట్లుగానే ఈ పరిశ్రమకు గూడ ద్రవ్యసహాయము చేయవలెను.

మన దేశమునందలి కాగితపు పరిశ్రమ చాలవరకు ప్రస్తుతము ఉత్తరహిందూస్థానమునకే చెందియున్నది. మన దేశమున తయారగు కాగితములో నూరింట డెబ్బదియైదుపాళ్లు ఒక్క బెంగాలులోనే తయారగుచున్నది. మనదేశమున మిక్కిలి ప్రాముఖ్యముగల మిల్లులలో మూడును బెంగాలులో నున్నవి. మిగిలినవానిలో ఒకటి సంయుక్తరాష్ట్రములలోను, రెండు బొంబాయిలోను, ఒకటి మదరాసులోను, ఒకటి పంజాబులోను ఉన్నవి. బెంగాలులో పైనచెప్పిన మూడు మిల్లులుగాక ఇంకొక మిల్లుకూడ ఉన్నది. దానిని కలుపుకొనినచో ప్రస్తుతము పనిచేయు మిల్లులు తొమ్మిది. సంయుక్తరాష్ట్రములలోను బొంబాయిలోను గల మిల్లుల ఉత్పాదనశక్తి చాల స్వల్పము. అవి ఒక్కొక్కటి సాలునకు ౮,౦౦౦ టన్నుల కాగితములుమాత్రమే తయారుచేయగలవు.

మదరాసు రాజధానిలో రాజమండ్రిలోనున్న ఆంధ్ర పేపరుమిల్లును గూర్చి ఒకప్పుడెంతో ఆశపెట్టుకొని యుండిరి. కాని చాలకాలము అది పనిచేయుటయే ప్రారంభించలేదు. తరువాతకూడ అది సరిగా నడపబడకపోవుటచే దానిపని యంత తృప్తికరముగా లేదు. పంజాబులోని మిల్లువిషయము కూడ ఇంతే. ఈ మధ్య ఈ రెండుమిల్లులను తిరిగి సరియైన స్థితిలోనికి తీసికొనివచ్చుటకు కొన్ని ప్రయత్నములు జరుగుచున్నవి. ఇంతేకాక ప్రస్తుతము ఇంకొక నాలుగు క్రొత్తమిల్లులు తయారగుచున్నవి; అందొకటి ఒరిస్సాలోను, ఒకటి బీహారులోను,

1. ప్రభుత్వ మీ విధముగా చేయుసహాయమునే **subsidy** అందురు.

ఒకటి మైసూరులోను, మరియొకటి సంయుక్త రాష్ట్రములలోను కట్టుచున్నారు. ఇవిగాక హైదరాబాదులో ఒకటియు, మదరాసు రాజధానిలో మరొకటియు రెండు క్రొత్తమిల్లులు స్థాపించి, తత్పరిసరములలో దొరకు ముడిపదార్థముల నుపయోగించి లాభకరముగ కాగితములు తయారుచేయవలెనని కొన్ని యత్నములు జరుగుచున్నవి. హైదరాబాదులో స్థాపింపబోవు మిల్లు అడవులకును, బొగ్గుగనులకును చాల సమీపములో నుండును. ఆ మిల్లు నడపించువారు సమర్థులై సమీపములో నున్న ముడిపదార్థములను బాగుగా ఉపయోగించుకొని, దక్షిణ హిందూస్థానమునందలి మార్కెటును చేజిక్కించుకొనినట్లయిన అది మంచి స్థితిలోనికి రాగల దనుటకు సందేహము లేదు. మన రాజధానిలో దక్షిణమున స్థాపింపబడబోవు మిల్లుకూడ లాభకారిగానే యుండవచ్చును; దానికి చౌకగా విద్యుచ్ఛక్తి లభించును.

ప్రస్తుతము పనిచేయుచున్న మిల్లుల ఉత్పాదనశక్తి సాలుసరు ౪౫,౦౦౦ టన్నులుండును. దీనిని సులువుగా ౬౦,౦౦౦ టన్నుల వరకును వృద్ధిచేయవచ్చును. ప్రస్తుతము కట్టుచున్న క్రొత్తమిల్లుల ఉత్పాదన శక్తి, సాలునకు ౩౦,౦౦౦ టన్నులుండవచ్చును. ఇవన్నియును కలిసి కొలదికాలములో, చలామణియగు సరకుకంటె ఎక్కువ సరకు తయారు చేయవచ్చును; ఏమనగా ప్రస్తుతస్థితిలో ఈ మిల్లులు రక్షణ యొసగబడిన రకముల కాగితములను మాత్రమే తయారు చేయగలుగును. అట్టి సరకు ప్రస్తుతము మనదేశములో ౬౦,౧౦౦ టన్నులు మాత్రమే చలామణి యగుచున్నది. కాబట్టి తయారైన సరు కంతయు ఖర్చుపడి మిల్లులకు నష్టము రాకుండవలె ననిన, దేశములో ఇంకను ఎక్కువసరకు చలామణి యైనను కావలెను, లేకున్న క్రొత్తరకముల కాగితములైనను తయారు కావలసియుండును. ఈ మధ్య సంవత్సరమునకు సుమారు వేయి టన్నుల చొప్పున మన దేశమున కాగితముల అవసరము హెచ్చుచున్నది. ప్రజ లందరును విద్యావంతులు కావలెనని కొంతప్రయత్నమీమధ్య జరుగుచున్నది. జన బాహుళ్యమున విద్యావ్యాప్తి హెచ్చినకొలదిని కాగితముల చలామణికూడ హెచ్చు కాగలదు. అందువలన ప్రతిసాలున కాగితముల అవసరము ౧,౫౦౦ టన్నుల చొప్పున హెచ్చవచ్చును. కాని ఈ మధ్య రాష్ట్రాభిమానము కూడ కొంత హెచ్చుచున్నది. అందువలన పైన చెప్పబడిన మిల్లులే కాక ఇకను మరి కొన్ని క్రొత్తమిల్లులు ప్రతిరాష్ట్రమునను స్థాపింపబడవచ్చును. ఏరాష్ట్రమున కారాష్ట్రమున క్రొత్తమిల్లులు స్థాపించబడినచో ఇప్పుడున్న మిల్లులలో కొన్నిటికి నష్టము రావచ్చును. కాబట్టి అన్నియు క్రొత్తరకము కాగితములను తయారుచేయుటకు యత్నించవలసియుండును. ఇప్పటివరకును మనము కృషిచేయక విదేశములనుండి తెప్పించుకొనుచున్న రకములలో పొట్లములు వగైరా కట్టుకొనుటకు ఉపయోగించు కాగితములను ఈ సందర్భమున మనము గుర్తుంచుకొనవలెను. ఈ రకము తయారుచేయుటకు మన మిల్లులు గట్టియత్నము చేయవలసియున్నది.

క్రొత్తరకముల కాగితములను తయారు చేయవలె ననిన మన దేశపు మిల్లులు ప్రతి

కలను అచ్చువేయుటకు కావలసిన రకముపై తమదృష్టిని నిలుపవలెను. ఈ విషయమై ప్రభుత్వసహాయము మిక్కిలి యవసరమను సంగతి పైన చెప్పియుంటిని. మొదట కొన్ని ఏండ్లపాటు ప్రభుత్వము సాయముచేయనిదే స్వదేశీమిల్లు లీ కార్యమును నిర్వహించ లేవు.

ప్రతి సంవత్సరమును మనము సుమారు ౮౦ లక్షల రూపాయల విలువగల పాతపత్రికలను, వస్తువులకు చుట్టును చుట్టుట కుపయోగించు పీచుకాగితములను[1] విదేశముల నుండి దిగుమతి చేసుకొనుచున్నాము. ఆ విషయమై కొన్ని వివరము లీక్రిందిపట్టికలో ఈయబడినవి.

| సంవత్సరము | దిగుమతుల విలువ | | |
|---|---|---|---|
| | పాత పత్రికలు | పీచు కాగితములు | మొత్తము విలువ |
| ౧౯౩౩–౩౪ | ౪౧,౩౦ | ౩౧,౮౨ | ౭౩,౧౨ |
| ౧౯౩౪–౩౫ | ౪౫,౫౨ | ౩౮,౨౦ | ౮౩,౭౨ |
| ౧౯౩౫–౩౬ | ౪౧,౬౯ | ౫౩,౦౨ | ౯౪,౭౧ |
| ౧౯౩౬–౩౭ | ౩౮,౯౯ | ౪౮,౦౬ | ౮౭,౦౫ |
| ౧౯౩౭–౩౮ | ౪౭,౪౮ | ౮౪,౦౦ | ౧౩౧,౪౮ |

ప్రాత వార్తా పత్రికల యొక్కయు, పీచు కాగితముల యొక్కయు విలువ వేల రూపాయలలో ఈయబడినది. పీచుకాగితములపై రక్షణ సుంకమును విధించి వాని రాక అరికట్టవచ్చునేమో కాని, ప్రాతవార్తా పత్రికలను మాత్రము సుంకముల వలన రాకుండ చేయుటకు వీలు కాదు; ఏమనగా వానివిలువ చాల స్వల్పము. వాని నెగుమతి చేయువానికి అందులకగు ఖర్చు తక్కువ. అంతేకాక విదేశములనుండి ఇచ్చట కవి వచ్చుటకు ఓడకేవుకూడ చాల స్వల్పమే. కాళీఓడలలో ఓడ ఊగులాడ కుండుటకై వీనిని బరువుగా నుపయోగించి మన దేశమున కంపుచుందురు. కాబట్టి ప్రాత పత్రికలు రాకుండ చేయవలె ననిన అట్టిసరకు మన దేశములో దిగుమతి కాగూడదని శాసించుట యొక్కటే సరియైనమార్గము. ఈ సరకు రాకుండ జేయుటతో మన మూరకుండజాలము; ఏమనగా మన మార్కెట్లలో పొట్లములు కట్టుకొనుటకును సరుకులు చుట్టుకొనుటకును తత్ప్రత్యామ్నాయముగా వేరొక సరకు చూపించవలెను. ఈ మధ్య మన దేశమున ఉత్పత్తియగు ప్రత్తిలోను జనపనారలోను చాలవరకు చలామణిగాక రద్దయి పోవుచున్నది. ఇట్టిరద్దు సరకునుండి చౌకరకపు సంచులు తయారుచేసి జనసామాన్యమునకు వాని యుపయోగము వెల్లడి చేసినట్లయిన, ప్రాతపత్రికలకై మనము నష్టపెట్టుచున్న సొమ్ము మన దేశమునందే నిలవ యుండగలదు. రక్షణ యొసగబడినట్లయిన స్వదేశీ పరిశ్రమ పీచుకాగితముల దిగుమతి నెదుర్కొన గలదు. పత్రిక లచ్చువేయు కాగితములమాట అటుంచి, పాత పత్రికలును, పీచు కాగితములును రాకుండ జేయగలిగితిమేని మన దేశమున కొక కోటి రూపాయలు ప్రతిసంవత్సరమునను మిగులును.

1. Wrapping paper.

అటుపిమ్మట దినపత్రికల కుపయోగించు కాగితములనుగూడ మనము తయారుచేయగలిగితిమేని మన దేశమున కింకొక కోటి రూపాయలు ప్రతిసాలున మిగులగలవు.

ఈ రెండువిషయములను గూర్చియు గట్టిప్రయత్నము చేసిననేతప్ప హిందూదేశపు కాగితపుపరిశ్రమ ముందు ముందు సరియగు అభివృద్ధి గాంచజాలదు; ఏలయనగా ఒకవంక మిల్లులసంఖ్య పెరుగుచున్నది. క్రొత్తరకముల కాగితములు తయారుచేయుటకు యత్నించిననేతప్ప స్వదేశీమిల్లులు తమ ధర్మమును నెరవేర్చుకొనకపోవుటేగాక తమ భావిభాగ్యమునుగూడ రక్షించుకొనజాలవు.

---

# జెండా

శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

(సారస్వతకుటీరం)

స్వాతంత్ర్యసమరవిజయోత్సాహమ్ము చేతనే
ఈతీరుగా నెగురుచున్నావు నేడేమొ!
త్రివర్ణపతాక! జెండాల కన్నాక;
దేశదేశాల సందేశ మిచ్చెడుదాక;
ఎగరవే, ఎగరవే! గగనమ్మువరకునూ
పగవారిపక్కలో బల్లెమై తనరారు!

పరిపంథిదేశాల పాషాణహృదయాల
విదళనమ్మొనరించు వీరకేసరి వీవు!
త్రివర్ణపతాక! జెండాల కన్నాక!
ఎగరవే! ఎగరవే! ఈభారతావనిని!

శాంతిసమరమ్ములో జయము గాంతురు నీదు
అనుఁగుబిడ్డలు రేపు అధికప్రమోదాన,
నీకీర్తిదుందుభులు లోకాన చాటెదరు
పాశ్చాత్యదేశాలు ఆశ్చర్య మొందంగ!
ఎగరవే! ఎగరవే! మూడురంగులజెండ!
ఎగరవే! ఎగరవే! మా గాంధిజెండా!

---

# రైతురక్షణ: అమెరికాప్రయత్నాలు

## కర్షకులకు రేడియో ఉపయోగాలు

'ఉపాధ్యాయ, వి. సి'

ప్రజాక్షేమం కోరు ప్రతీప్రభుత్వమూ రైతుని అభివృద్ధిలోనికి తీసుకురావడమే ప్రధానకర్తవ్యంగా భావించితీరాలి. అలా లేనినాడు ఏ దేశమూ కూడా ఆర్థికంగాగాని, రాజకీయంగా గాని, అభివృద్ధిలోకి రాదన్న మాట ముమ్మాటికీ నిజం. అందులోనూ వ్యవసాయమే ప్రధానవృత్తిగాగల మనభారత దేశంమాట వేరే అడగాలా?

ఈనాడు మన దేశం ఆర్థికంగా చాలా వెనకబడిందీ అంటే దానికి ముఖ్యకారణం కర్షకసోదరుడి ఆర్థికదుస్థితియే. అమెరికా దేశం ప్రపంచఖండాల్లో శిరోమణిలా ప్రకాశిస్తూంది అంటే అమెరికా రైతుయొక్క సర్వవిధాభివృద్ధేగాని మరోటి కానేరదు. ఏరోజునయితే ప్రభుత్వం కర్షకుడి కష్టాల్ని గుర్తించగలిగి వాటిని నిర్మూలించేందుకు ప్రయత్నింస్తుందో ఆరోజునుంచే భారత దేశం అన్నివిధాలా అభివృద్ధిజెందడం ప్రారంభిస్తుంది.

నిన్నమొన్నటివరకూ మనప్రభుత్వం కేవలం జమీందార్లకొరకూ, లక్షాధికార్లయిన షావుకార్లకోసమూ అన్నట్టు వుండేది. కాని కాంగ్రెస్‌ప్రభుత్వం ఏర్పడడంతో ఆ దురుద్దేశం చాలావరకు నశించింది. కర్షకుని కోసమే ఈ ప్రభుత్వం, అతని కష్టార్జితధనంతో ఈ అధికార్లూ, ప్రభుత్వాలూ కాళ్లూ చేతులూ కదుపుతూంట, అతనినోకర్లే వీళ్లంతా, అతని బాగే దేశకల్యాణం, అతనికన్నీటిబొట్లే దరిద్రదేవత హర్షాశ్రువులు అనేసంగతి ప్రజాసామాన్యానికి బాగా బోధపడింది. దీనికి సహాయంగా కాంగ్రెస్‌ప్రభుత్వం ఆ నిరక్షర పిశాచాన్నికూడా గ్రామాల్లోనుంచి తరిమేసి పుణ్యంకట్టుకుంటే మన దేశం త్వరలోనే అభివృద్ధిలోనికి రాగలదు. రైతుజనంలో ఉచితమైనవిద్యని ఎంత త్వరలో వ్యాపింపజేస్తే దారిద్ర్యం అంతదూరం పారిపోతుంది, రైతు తనహక్కులనీ, వ్యక్తిత్వాన్ని అర్థం జేసికొని తనుకూడా దేశంక్షేమంకోసం పాటుబడగలడు. సంఘీభావం, స్వరాజ్య సంపాదనాకూడా చాలా సులభమవుతాయి. ఇందులో సందేహానికి చోటేలేదు.

'అనుకరణ' అనేది దోషమనీ, వ్యక్తిత్వహీనతని తెలియజేస్తుందనీ, అందరికీ తెలుసు. మంచిప్రవర్తన, ఆచారము, పరోపకారపరాయణత్వమూ మొదలయిన సద్గుణాలు తప్పకుండా అనుకరణయోగ్యములే. అందులో దోషం లేదు సరిగదా ఆమనిషి యొక్క విశాలహృదయాన్ని మంచితనాన్ని చాటుతాయి.

గాని ఈరోజుల్లోలాగ స్వదేశ సాంప్రదాయాలకీ స్వభావాలకీ

విరుద్ధమైన ఆచారాలు, అలవాట్లు తాత్కాలిక సౌఖ్యంకోసం అలవర్చుకొని, అందుచేత తమహృదయాలు విశాలములయినవని, పూర్వాచారాలే పట్టుకొని వేళ్లాడేందుకు సంస్కారశూన్యులం కామనీ, ఏవేవో చెప్పి సమర్థించుకొని కాలం గడిపేయడం - శుద్ధ అనుకరణ. దాంట్లో వ్యక్తిత్వహీనత, యుక్తాయుక్త విచక్షణజ్ఞాన శూన్యత, ఆత్మవంచన అన్నీ కలిసి అణిగి వుంటాయి. కొంచెం ఆలోచిస్తే అవన్నీ కళ్లకి అద్దాలుకట్టినట్లగుపిస్తాయి.

అలాగ్గానే మనప్రభుత్వం కొన్నిమంచి విషయాల్ని ఇతరప్రభుత్వాలనుంచి నేర్చుకొని అమలులో పెట్టిందంటే - అది అనుకరణా? కాదు - అభివృద్ధికి మార్గం చూపిస్తూందన్నమాట. ఇదంతా దేనికంటే - మనదేశం బాగుపడాలంటే అమెరికానుండి కొన్ని పాఠాలు నేర్చుకొనితీరాలి. ఈ రెండు దేశాలకూ చాలావిషయాల్లో సమానత్వం వుంది. అందులో ముఖ్యమైనవిషయం - రెండూ వ్యవసాయంమీద ఆధారపడివున్న దేశాలే! అమెరికా అంత ముందు కెలా నడిచిందీ అంటే - ఓశతాబ్దంకిందే రైతుస్థితిని గుర్తించి అన్నివిధాలా రైతుకి తోడ్పడి వ్యవసాయాన్ని వృద్ధిజేయడంవల్లనే. ఇపుడు అమెరికారైతు దివ్యభవనాల్లో, ధనధాన్యాలతోటీ, సకలైశ్వర్యాలతోటీ తులతూగుతున్నాడు. మనకర్షకసోదరుడో! కూటికీ గుడ్డకీకూడా మొహంవాచి, నివసించేందుకు సరైన కొంపకూడా లేక ఆకలిమంటలలో దహించుకుపోతున్నాడు.

అమెరికారైతు సౌఖ్యానికి కారణం ప్రభుత్వసహాయమే. మనరైతు కష్టాలకి కారణం - మనప్రభుత్వనిరాదరణమే!

ఈమాటలు చూడండి:

"Probably no other country in the whole world shows such appreciation to the value of agriculture in national economics as does United states of America."

ఇంక అమెరికా ఏవిధంగా అభివృద్ధిలో కొచ్చిందో చూదాం. చాలాకాలంవరకూ కూడా అమెరికా దేశపురైతు మన రైతులాగే ఉదరపోషణార్థమే భూమిని దున్నుకోవడం, చాలినంత పండించడం, ఈ విధంగా గడిపేవాడు. అలా ఎన్నేళ్లు గడిచాయో అన్నేళ్లూ అమెరికా పారిశ్రామికంగా చచ్చినదాంట్లోనే జమఅయింది.

"So long as the ryot tilled only such few acres as would provide for his own family America was industrially dead."

గాని రాకపోకల సౌకర్యాలు అభివృద్ధి చేయడానికి ఎపుడైతే ప్రభుత్వం పూనుకొని ఏర్పాట్లుచేసిందో - ఆనాటినుంచి ఎగుమతి దిగుమతులు ప్రారంభించడం, రైతులు పంటలు విస్తారం పండించడం, త్వరగాను ఎక్కువగాను పండించేందుకు యంత్రాల్నీ ఎరువుల్నీ వుపయోగించడం జరిగాయి. దాంతో అమెరికాకు నూత్నదశ ప్రారంభమయింది. వ్యవసాయం అన్నివిధాలా అభివృద్ధిచెందుతూవుంటే దేశంలో అనేక క్రొత్తపరిశ్రమలు స్థాపింపబడ్డాయి. పారిశ్రామికాభివృద్ధికూడ త్వరితంగానే నడిచింది.

"Agriculture walked hand in hand with industry in America. And to-day you can not expect the manufacturing concerns to succeed without the co-operation of

Agriculture than you would expect a human being to live after the heart stops beating and blood flowing".

వ్యవసాయపుపనిముట్ల పరిశ్రమ మొట్ట మొదట తలఎత్తినది. అంతటినుంచి వివిధ పరిశ్రమలు తలఎత్తాయి. దేశం ఆర్థికంగా మంచి వున్నత స్థితిలోకి వచ్చింది.

ఇన్నిటిమూలంగా రైతు పూర్వకాలపు వ్యవసాయపద్ధతుల్ని పట్టుకొని వేళ్లాడితే లాభం లేదనీ, వ్యవసాయపుపనులు ఎంత త్వరలో ఎంత తక్కువ పెట్టుబడితో పూర్తి అయిన అంత మంచిదనీ-పూర్తిగా అర్థముజేసి కొనగలిగాడు. ఈవిషయాన్ని ప్రభుత్వం అంతకుముందే గుర్తించడం చేత రైతుకి కావలసినంత తోడ్పడి వ్యవసాయాన్ని పూర్తిగా యంత్రాలసహాయంతో నడపడానికి పూనుకుంది. ఇదే వ్యవసాయయంత్రీకరణం (machanisation of Agriculture).

ఈనాడు అమెరికా దేశంలో విత్తులు చల్లడంమొదలుకొని, పంటసరకు కొట్లో పోయడంవరకూ యంత్రాలే. దున్నడం, ఎరువులు సమంగా చల్లడం, కాలవలు తవ్వడం, నీళ్లు తోడడం-పండిన పంటని కోయడం, నిలవ కొట్లో పోయడం - ఈపనులన్నీకూడా యంత్రాలతోటే జరిగిపోతాయి. కూలి చాలా తక్కువవుతుంది. లాభం చాలా ఎక్కువ వస్తుంది. ఇప్పుడిప్పుడు యంత్రాలన్నీ విద్యుచ్ఛక్తితో నడిపించడంమూలాన్న యిదివరకటికన్న ఎక్కువలాభం పొందుతున్నాడు రైతు. (ఈ వ్యవసాయ యంత్రీకరణం, మన దేశానికి ఎంతమట్టుకి వుపయోగం ఏ పరిస్థితులలో ఉపయోగించవచ్చు అనేది వేరేవిషయం.) ఈ స్థితిలోనికి అమెరికా రైతు రావడానికి కారణం ప్రభుత్వ సహాయమే. ప్రభుత్వం - రైతు తమ దేశానికి వెన్నెముకలాంటివాడనీ, జీవమువంటివాడనీ గుర్తించి వెన్నెముకకు బలము కలుగజేస్తే శరీరానికంతా బలం కలుగుతుందని తెలిసికొని ధనవ్యయానికి లక్ష్యం చేయక మిక్కిలి రైతుకి తోడ్పడింది.

ప్రభుత్వము చేసిన మహోత్కృష్టమైన పని ఏదంటే వ్యవసాయవృత్తిని ఒక ఆకర్షవంతమైన దానినిగను, మంచి లాభకారిగను, సర్వసౌఖ్యాలను ఇచ్చే వృత్తిగాను చేయడానికి చేసిన బ్రహ్మాండ ప్రయత్నాలే! అంతకుముందు యువతీ యువకులు పల్లెల్లో వ్యవసాయంచేసుకుంటూ పడివుండటం నచ్చక పట్నాలకి పోయి, కూలోనాలో చేసుకుంటూ, ఆ సౌఖ్యాల్ని అనుభవించడం మరిగారు. ఆవిధంగా చాలామంది పట్నాలకి పోవడంచేత వ్యవసాయం మందగించడం, దాంతో ఆర్థికస్థితి మందగించడం జరిగాయి.

ఈ సమయాన్నే ప్రభుత్వందృష్టి పల్లెల మీదికి వ్యవసాయదారులమీదికి మళ్లింది. ఆ పల్లెల్లోనే నూతనాకర్షణలను, - ఆధునిక నాగరికతా చిహ్నాలైన సినిమాలు, రేడియోలు మొదలయినవి—కల్పించారు. దాంతో పల్లెలలో పట్నాలలోకన్న సౌఖ్యం ఎక్కువయింది. చక్కని వాతావరణమునకు పరిశుభ్రమైన గాలికీ,మంచిభోజనసదుపాయాలకీ పల్లెటూరు ప్రసిద్ధేగదా! అలాటి పల్లెలలో క్రొత్తవింతలన్నీ నెలకొల్పేటప్పటికి అవి స్వర్గంలో సమానమైన వయాయి.

ఈ యుక్తితోటి వెనక పల్లెలను వొదిలేసినవాళ్లంతా తిరిగి వెనక్కి రావడం, వ్యవసాయన్ని వృత్తిగా చేసికోవడం

మొదలుపెట్టారు. పట్నాలలో స్వతంత్రం లేకుండా కూలీనాలీ చేసికొని జీవచ్ఛవాల్లా వుండేకంటే స్వతంత్రంగా తమ భూమిని పండించుకొని పల్లెలలోనే వుండటం మంచిదని తోచింది - అందరికీని.

పల్లెలలో రైతుల బిడ్డల విద్యకోసం ప్రభుత్వం అద్వితీయమైన సహాయం చేసింది. ఉచితవిద్యాలయాలు నెలకొల్పి రాకపోక లకి విద్యార్థులకీ ఉచితముగ 'మోటారు సర్వీస్' సేర్పరచి అన్నివిధములైన ఇతర సహాయాలు ఉచితంగానే ఏర్పాటుచేసి చిన్నపిల్లల్ని విద్యాలయాల్లోకి ఆకర్షించింది. ఈ ఆకర్షణలు వుండకపోతే చిన్నపిల్లలు పాఠశాల నేలా ఎగవేద్దామా అని అనుకొనే వాళ్లు. ఇప్పుడు శలవురోజు వస్తే విచారపడుతున్నారు. విద్యార్థులకి వైద్య సహాయంకూడా ప్రభుత్వమే చేస్తుంది.

ప్రతిగ్రామంలోనూ రేడియో, టెలిఫోను మొదలయినవి ఉంటాయి. అవి ముఖ్యంగా వ్యవసాయాభివృద్ధికి తోడ్పడతాయి. ప్రతీరైతు ఈయంత్రాల్ని కొనుక్కోగలుగుతాడని వాటిని చాల చవుకధరలకి రైతులకిమాత్రం అమ్మేవారు.

వ్యవస్యాయువిద్య:—వ్యవసాయసంబంధమైన విద్యని ఎంత వ్యాపింపజేస్తే అంత మంచిది. అమెరికాలో ఒక్కొక్కరాష్ట్రానికి ఒక్కొక్కవ్యవసాయకళాశాల, ఒక్కొక్క 'వ్యవసాయ శాస్త్రపరిశోధనాలయం' (Agricultural Research Institute) చొప్పున వుంటాయి. ఇవిగాక జిల్లాలలో వేరే వ్యవసాయవిద్య నేర్పు చిన్నపాఠశాలలు, ఒక్కపెద్దసంయుక్త పరిశోధనశాల వుండును.

ముసలివాడు, యువకుడు, స్త్రీ, పురుషుడు అని వివక్షలేకుండా కళాశాలలో చదువుకోదలచినవాళ్లందరినీ చేర్చుకుంటారు. చక్కని శాస్త్రీయమైన విద్య నేర్పుతారు- ప్రభుత్వం - వాళ్ల దగ్గరనుంచి జీతవాతలు పుచ్చుకోదు సరిగదా వీరికి అనేకసౌఖ్యాలను కల్పిస్తుంది. ఇక్కడే స్త్రీలకు అత్యంతోపయుక్తమైన "సాంసారికఆర్థికశాస్త్రము"- (Domestic Economy) నేర్పుతారు.

వీట్లముందు మన దేశంలో కళాశాలలు ధనం వసూలుచేస్తూ నిర్బంధిస్తూన్న జైళ్లలా కనబడతాయి. పరీక్షలనీ, ఫలితాలనీ కల్పించడం, పాక్షికబుద్ధితో విద్యార్థుల గొంతు కలుకోయడం, వారిధనం, కాలం, జీవశక్తి వృథాపర్చడం - యివే మన కళాశాలల ముఖ్యఆశయాలేమో అనిపిస్తుంది.

ఇంకా అమెరికాలో ఆ ఇచ్చే ఉచిత విద్యాసంపత్తి కాకుండా ప్రతీ పరిశోధనాలయంనుండి పరిశోధకముఖ్యుల్ని వివిధగ్రామాలికి ప్రత్యేకధూమశకటాల్లో పంపిస్తారు. వాళ్లు వ్యవసాయదారులకి ముందుగానే వర్తమానం పంపి - తాము చేసిన పరిశోధనలు, వాట్ల ఫలితములు - అందువల్ల నేర్చుకోవలసిన పాఠాలు మంచి ఓర్పుతో చిన్నపిల్లలకి బడిపంతులు బోధించినట్లు బోధచేస్తారు. ఈమార్గంవల్ల గ్రామాల్లోవుండే రైతులకి కూడా "వ్యవసాయ అభివృద్ధివిధానాలు" తెలుసుకొనేఅవకాశం కలుగుతుంది. రైతులకి ఏవిషయంలోనేనా సందేహం గలిగినట్లయితే అది తీర్చుకొనేవిధానం అతనికి తెలియజేస్తారు ముందుగానే. - ఆప్రకారం సంవత్సరానికి కొన్నిలక్షలసందేహాలు వ్యవ

సాయశాఖ తీరుస్తూంది - ఉత్తరప్రత్యుత్తరాలద్వారా.

ప్రత్యేకం వ్యవసాయ కళాశాలలు మాత్రమే కాకుండా వ్యవసాయాభివద్ధికి తోడ్పడే ఇతరశాస్త్రాలనికూడా బోధించడానికి (అనగా వృక్షశాస్త్రం - Botany,) కీటకశాస్త్రం (Entomology) - ప్రత్యేకకళాశాలలని స్థాపించింది, ప్రభుత్వం. ఈప్రత్యేక ప్రభోధంకోసం - ౬౦,౦౦౦ మంది విద్యార్థులకి ౩,౦౦౦ మంది విద్యాధికులైన అధ్యాపకులను ప్రభుత్వం నియమించింది. ప్రభుత్వం సంవత్సరమునకు సుమారు ౧౪,౦౦౦,౦౦౦ రూపాయలు ప్రత్యేకం వ్యవసాయవిద్యావ్యాప్తికే ఖర్చుచేస్తుంది. ఇతరత్ర పరిశోధనలకోసం కోట్లకొలది ఖర్చుపెట్టడం కాకుండా - అమెరికా కంతటికి ఒక కేంద్ర వ్యవసాయసంస్థ వుంటుంది. ఇందులో దీనికి సంబంధించిన శాఖలు - ఉపశాఖలు వుంటాయి. ప్రతీశాఖనుండీ ప్రతీరోజు ఆశాఖవారు చేసిన పరిశోధనఫలితాలు రేడియోద్వారా వినిపిస్తారు.

ఉదా :-శీతోష్ణస్థితిశాఖవారు (Meteorological branch) వానఎన్నిరోజుల్లో పడవచ్చో, విత్తులు ఎప్పుడు చల్లితే మంచిదో పంటలు ఎప్పుడు కోస్తే లాభమో, ఇలాంటివన్నీ రైతులకి తెలియజేస్తారు. అలాగ్గానే జంతుశాస్త్రం వారు-పశువుల్లో వ్యాపించే అంటువ్యాధులను అరికట్టడం ఎలాగో, ఏయేమందులు వాడవచ్చో, ఏజాగ్రత్తలు తీసుకోవాలో తెలియజేస్తారు. “వృక్షవ్యాధిశోధనశాఖ (Plant pathology branch) ఇదేప్రకారం - చెట్లల్లో కలిగే రోగాలు వాటిలక్షణాలు, వాటిని నిర్మూలించే పద్ధతులు తెలియపరుస్తారు. ఇదేవిధంగా ఇతర శాఖలవారుకూడా.

“ భూరసాయనశాస్త్రశాఖ ” (Soil Chemistry branch) రైతుకి చేసేఉపకారం ఇంతఅని చెప్పడానికి వీల్లేదు. వారు అనేక గ్రామాలనుంచి – వేర్వేరు ‘ మట్టి ’ పొట్లములను (Soil packet) శోధనాగారానికి తీసుకొనిపోయి పరిశీలించి, ఆనేలల్లో ఏరసాయన ద్రవ్యములు ఎక్కువగా వున్నాయో, ఏవి తక్కువో తెలిసికొని - అందుమూలంగా ఏ ఎఱువు వేస్తే ఆభూమికి ఉపయోగమో, ఏ పంట పండిస్తే ఆరైతుకి లాభమో తెలియజేస్తారు. ఈపరిశోధనలమూలంగాఒక్కొక్క రైతుకి వేలకొలది రూపాయలు లాభం వచ్చినట్లుతెలుస్తూంది. ఈశాఖమూలంగానే రైతు పచ్చిఎఱువుల ప్రాముఖ్యత తెలిసికొన్నాడు.

ఇన్నిమాట లెందుకు ! ఏశాస్త్రంలో కొత్తవిషయజ్ఞానం పరిశోధనద్వారా కలిగినా - ప్రభుత్వం వెంటనే ధనవ్యయప్రయాసలని లెక్కపెట్టకుండా ఆవిజ్ఞానవీచికల్ని గ్రామవాసుల గృహప్రాంగణాలకు పంపడానికి ఏమీ వెనకంజవేయడంలేదు.

ప్రతీయేడూ తొలకరిసమయం రాగానే- వ్యవసాయదార్ల కోరికమీద - వివిధమైన - కొత్తజాతులకి సంబంధించిన విత్తులను ప్రభుత్వం - ఉచితంగా పంచిపెడుతుంది.

అమెరికాప్రభుత్వం వ్యవసాయాన్ని అభివృద్ధిలోకి తీసుకురావడానికి బ్రహ్మాండమైన ప్రయత్నాలు చేసింది. నే నింతకి ముందు చెప్పినవి వాటిముందు చాలా చిన్న విషయాల్లా కనపడ్డాయీ అంటే ఆశ్చర్యం

వుండదు. నేను ముందు చెప్పినవిషయాలేనా చాలా టూకీగా తేల్చేయడం తప్పింది కాదు.

ఇంకా మంచిఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని ప్రేరేపించే విషయాలు చాలా వున్నాయి. వాటిలో ప్రతీది మనప్రభుత్వానికి నేర్చుకోవలసిన ఓపాఠం అన్నమాట. ప్రస్తుతం - దేశసౌభాగ్యం పెంపొందాలీఅంటే రైతుసౌఖ్యజీవనానికి తోడ్పడాలి, రైతుకి సేవ చేయడమే - దేశానికి సేవజేయడం. ఈ విషయాల్ని గుర్తెరింగినరోజునే మనభారత దేశంకూడా ఇతరదేశాల్లాగే సంతృప్తితో, సగర్వంగా, తల ఎత్తి - అస్వాతంత్ర్య శృంఖలాలలోనుంచి, అత్యధికదారిద్ర్యంనించి బయల్పడి, పూర్ణచంద్రుడిలా ప్రకాశించగలుగుతుందని మనప్రభుత్వం గుర్తించాలి.

---

# ఇండియాలో ఇన్సూరెన్సు (భీమా) వ్యాపారము

## ౧౯౩౮-వ సంవత్సరపు సవరణచట్టము

శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణమూర్తి

"భారతి ఇన్సూరెన్సునుగురించికూడా వ్యాసాలు ప్రచురించవలెనా ?" అని చదువరు లనేకులకు ఈ శీర్షికను చూడడంతోనే ఆశ్చర్యం కలుగవచ్చును. ఇన్సూరెన్సునుగురించి చర్చించడం ఘరానాపత్రికల లక్షణం కాదని అనేకుల నమ్మకం. ఈ వ్యాపారం మన ఏజంట్ల చేతులలో నలిగిపోయి కొంత చులకనపడినమాట నిజం. కాని దేశాభివృద్ధి కిది ఎంత తోడ్పడగలదో, పశ్చిమరాష్ట్రాలలో ఎంతగా తోడ్పడుతోందో, దాని నభివృద్ధిచేయుటానికి ఆ ప్రభుత్వాలు ఎంత దోహదు తున్నాయో మనకు తెలియకపోవడమే ఇందుకు వక కారణం. ప్రజలదృష్టిని ఆవైపుకు త్రిప్పనిలోపం కొంతవరకు మనపత్రికాధిపతుల దనుకుంటాను. ఈయేడు జూలై నెల మొదటి తేదీని ఇండియాలో అమలులోకి వచ్చిన ఇన్సూరెన్సు (సవరణ)చట్టాన్నిగురించి చర్చించిన తెలుగుపత్రికలసంఖ్య బహుస్వల్పంగా వుంది. బొంబాయి కలకత్తా మొదలైన ఇతరప్రాంతాలలో పత్రికలు దానికి తగిన ప్రాముఖ్యతను ఇచ్చాయి. కొన్నిపత్రికలు ప్రత్యేక అనుబంధాలనుగూడా ప్రచురించాయి.

'వేదాంతము, తర్కము, వ్యాకరణము, సాహిత్యము మొదలైన శాస్త్రాలలో భారతీయులు గట్టివారేగాని, కార్యనిర్వాహకశక్తి, నిర్మాణకౌశల్యము, కావలసినచోట్లమాత్రం వారిది కిందిచెయ్యే' అని ఆంగ్లో ఇండియను పత్రికలు వ్రాస్తూవుండడం అలవాటే. ఈ అపనింద అసత్యమని రుజువు చేయడానికి ఇన్సూరెన్సు (భీమా) వ్యాపారంలో భారతీయుల అభివృద్ధి వక్కటే చాలును. ఒకప్పుడు పూర్తిగా విదేశీయుల స్వాధీనంలోవున్న ఈవ్యాపారం ఈదేశస్థుల స్వాధీనం అయిన విధం గమనించినప్పుడు ఏదేశాభిమాని హృదయం ఆనందంతో పొంగిపోదు ? విదేశాలనుంచి దిగుమతియైన ఈ సంస్థను ఈదేశంలో అభివృద్ధికాకుండా చేసే ప్రతికూలపరిస్థితులు మొదట్లో అనేకం వుండేవి. విదేశీ కంపెనీ లిక్కడ అర్థబలం అధికారబలం సంపాదించుకొని దేశవాళీ కంపెనీలను ఎదగనీయకుండా చేశాయి. ప్రభువుల ప్రాపకంవల్ల ఈదేశంలో పాతుకుపోయిన విదేశీబ్యాంకులు దేశవాళీ ఇన్సూరెన్సు కంపెనీలలో పాలసీలను మొన్న మొన్నటివరకూ అంగీకరించనేలేదు. ఆరోజులలో మనవారిలో కూడా ఇన్సూరెన్సుయెడల అనేక అపోహ లుండేవి. అందులో కొన్ని సహేతుకమైనవి; మరికొన్ని నిర్హేతుకమైనవి. ఫొటో తీసుకొన్నవాడి మోస్తరుగా జీవితం భీమాచేసినవాడు కూడా త్వరగా చచ్చిపోతాడని అనేకులకు భయంవుండేది.

ఇన్సూరెన్సు మొదట మన దేశంలో భర్తలులేనిస్త్రీల సహాయకనిధిగా ప్రారంభమైంది. ఇప్పటి పద్ధతుల మీద ఇండియాలో మొట్టమొదట ఇన్సూరెన్సు కంపెనీ మద్రాసులో ప్రారంభం కావడం ఆంధ్రులు కూడా గర్వింపవలసిన విషయమే. అది ౧౮౨౯ లో మద్రాసు ఇక్విటబుల్ ఇన్సూరెన్సు కంపెనీ' అన్న పేరుతో ప్రఖ్యాతినందిన ఆర్బత్తునాటు కంపెనీవారిచే స్థాపితమైంది. అది చాలాకాలం జయప్రదంగా పనిచేసి ఒకప్పుడు సుమారు ౨౫ లక్షల రూపాయల వరకూ రిజర్వులో ధనం నిలవ చేసినట్లు తెలుస్తుంది. కడచిన యుద్ధానంతరం ఆకం

పెనీ దివాలాతీసింది. ఇప్పుడు నిలిచియున్న కంపెనీల లో, ౧౮౭౧ లో స్థాపితమైన బొంబాయి మ్యూచు వలు కంపెనీ బహుపురాతనమైనది. ఆతర్వాత వచ్చి నది ౧౮౭౪ లో ఓరియంటలు ఇన్సూరెన్సు కంపెనీ.

ఈమధ్య, ఈవ్యాపారం మనదేశంలో అభి వృద్ధియైనవిధం సూచించడంకోసం ౧౯౩౬ సంవత్సరపు ఇండియా గవర్నమెంటువారి రిపోర్టులోనుంచి కొన్ని సంఖ్యలను ఉదాహరిస్తాను. మనకున్న ఆఖరురిపోర్టు అదేకాబట్టి దానినే మనం ఆధారంగా తీసుకోవాలి.

౧౯౩౬ లో ఈ దేశంలో పనిచేస్తూవుండిన ఇన్సూరెన్సుకంపెనీలసంఖ్య ౩౭౯. అందులో ౨౩౨ ఇండియను కంపెనీలు, ౧౪౭ విదేశీకంపెనీలు. ఇండి యను కంపెనీలలో ౧౮౫ కంపెనీలు జీవితపు భీమా వ్యాపారంమాత్రం చేస్తూవున్నవి; ౨౮ కంపెనీలు జీవితంభీమాతోబాటు అగ్ని, మోటారు, నౌకా ప్రయాణం వగైరా భీమాలనుకూడా చేస్తున్నాయి; ౧౯ కంపెనీలు ప్రత్యేకంగా అగ్ని, మోటారు, నౌకా ప్రయాణం వగైరా భీమాలుమాత్రమే చేస్తున్నాయి. ఈదేశంలో పనిచేస్తూవున్న మొత్తం ఇన్సూరెన్సుకంపె నీలలో ౬౯ కంపెనీలు బొంబాయి రాజధానిలోను, ౫౦ బెంగాలులోను, ౪౧ మద్రాసు రాజధానిలోను, ౩౦ పంజాబులోను, ౩ సింధురాష్ట్రంలోను, ౧౦ ఢిల్లీలోను, ౧౨ సంయుక్తపరగణాలలోను, ౪ బీహారు లోను, ౫ మధ్యపరగణాలలోను, ౩ అజ్మీరు మార్వారు లోను, ౨ బర్మాలోను, ౨ అస్సాములోను, ౧ పశ్చి మోత్తరపరగణాలలోను పనిచేస్తున్నాయి.

౧౪౭ విదేశీకంపెనీలలో ౧౨౨ కంపెనీలు ఇతరభీమావ్యాపారం, ౧౨ కంపెనీలు జీవితంభీమా, ౧౩ కంపెనీలు ఆరెండువ్యాపారాలూ కలిపి చేస్తు న్నాయి. అందులో ౭౦ కంపెనీలు గ్రేటుబ్రిటను ఐర్లాండుదేశాలలోను, ౩౦ కంపెనీలు బ్రిటిషుకాల నీలు డొమినియన్లలోను, ౧౭ కంపెనీలు యూరోపు ఖండంలోను, ౧౬ అమెరికాసంయుక్తరాష్ట్రాలలోను, ౯ జపానులోను, ౫ జావాలోను స్థాపింపబడినవి.

కడచిన ఎనిమిదేళ్లలో ఇండియను, విదేశకంపె నీలసంఖ్య వృద్ధియైనవిధం ఈ క్రింది అంకెలవల్ల తెలు స్తుంది:—

| సం॥రం | ఇండియను కంపెనీలు సంఖ్య | విదేశీ కంపెనీలు సంఖ్య | మొత్తం |
|---|---|---|---|
| ౧౯౨౮ | ౯౭ | ౧౪౮ | ౨౪౫ |
| ౧౯౩౩ | ౧౯౪ | ౧౪౭ | ౩౪౧ |
| ౧౯౩౬ | ౨౩౨ | ౧౪౭ | ౩౭౯ |

ఇండియను కంపెనీల వ్యాపారం అభివృద్ధి చెం దినవిధం ఈక్రిందిసంఖ్యలవల్ల తెలుస్తుంది:

| సం॥రం | ఆయేడు కొత్త వ్యాపారం రూ. | మొత్తంవ్యాపారం రూ. |
|---|---|---|
| ౧౯౨౦ | ౫౧౭ లక్షలు | ౩౧ కోట్లు |
| ౧౯౨౮ | ౧౫౪౧ ,, | ౭౧ ,, |
| ౧౯౩౬ | ౩౬౦౦ ,, | ౧౬౮ ,, |

౧౬ ఏళ్లలో ఇండియను కంపెనీలవ్యాపారం ౩౧ కోట్ల రూపాయలనుంచి ౧౬౮ కోట్ల రూపాయల వరకు పెరగడం అద్భుతంకదా!

ఇండియను కంపెనీలలోను విదేశీకంపెనీలలోను లోను కొత్తవ్యాపారం అభివృద్ధిచెందిన విధం:—

| ఇండియను కంపెనీలు: | ౧౯౩౩, | ౧౯౩౬ |
|---|---|---|
| పాలసీల సంఖ్య | ౧౫,౫౦౦ | ౨,౩౯,౦౦౦ |
| కొత్తవ్యాపారం లక్షలరూ.లో | ౨౪౦౯ | ౩౬౦౦ |
| ప్రీమియము ఆదాయం ,, ,, | ౧౨౫ | ౧౮౪ |
| **విదేశీకంపెనీలు:** | | |
| పాలసీల సంఖ్య | ౨౮,౪౬౩ | ౩౪౦౦౦ |
| కొత్తవ్యాపారం లక్షలరూపాయ లలో | ౮౯౦ | ౧౦౭౫ |
| ప్రీమియం ఆదాయం ,, | ౪౯ | ౫౭ |
| **మొత్తం:** | | |
| పాలసీలసంఖ్య | ౧,౮౩,౪౬౩ | ౨,౭౩,౦౦౦ |
| కొత్తవ్యాపారం లక్షలు రూ. | ౩,౨౯౯ | ౪౬౭౫ |
| ప్రీమియం ఆదాయం ,, ,, | ౧౭౪ | ౨౪౧ |

ఇతరవిధాలైన ఇన్సురెన్సు వ్యాపారంలో విదేశీకంపెనీలదే ఇంకా పైచేయిగా వున్నట్లూ, ఇండియను కంపెనీల అభివృద్ధి అంత చురుకుగా లేనట్లూ తెలుస్తుంది.

## ప్రీమియము ఆదాయము

లక్షలరూపాయలలో

ఇండియనుకంపెనీలు:

| | నిప్పుప్రమాదము | సముద్రప్రమాదాలు | చిల్లర | వెరశి |
|---|---|---|---|---|
| ౧౯౩౦ | ౨౫ | ౧౦ | ౨౬ | ౬౧ |
| ౧౯౩౩ | ౩౦ ౧/౩ | ౬ ౩/౪ | ౩౩ ౩/౪ | ౪౧ |
| ౧౯౩౬ | ౩౬ | ౧౧ | ౨౭ | ౭౪ |

విదేశీకంపెనీలు:

| | | | | |
|---|---|---|---|---|
| ౧౯౩౦ | ౧౨౦ | ౪౧ | ౬౨ | ౨౨౩ |
| ౧౯౩౩ | ౯౭ ౨/౩ | ౩౫ | ౪౬ ౨/౩ | ౧౭౯ ౧/౩ |
| ౧౯౩౬ | ౧౦౧ | ౪౧ | ౫౮ | ౨౦౦ |

మొత్తం:

| | | | | |
|---|---|---|---|---|
| ౧౯౩౦ | ౧౪౫ | ౫౧ | ౮౭ | ౨౮౪ |
| ౧౯౩౩ | ౧౨౮ | ౪౨ | ౮౦ ౧/౩ | ౨౫౦ ౧/౩ |
| ౧౯౩౬ | ౧౩౭ | ౫౨ | ౮౫ | ౨౭౪ |

౧౯౩౬ లో ఇండియాలోవున్న అన్నిరకాల భీమాకంపెనీలలో వచ్చిన మొత్తం సాలుసరి ఆదాయము ౧౫కోట్ల ౭౩లక్షలరూపాయలు. అందులో ఇండియను కంపెనీల ఆదాయం ౮కోట్ల ౬౧లక్షలరూపాయలు-; విదేశీకంపెనీల ఆదాయం ఏడుకోట్ల పన్నెండులక్షల రూపాయలు; అనగా మొత్తం ఆదాయంలో ఇండియను కంపెనీలభాగం నూటికి ౫౫వంతులు; విదేశీకంపెనీల భాగం నూటికి ౪౫వంతులు. జీవితభీమా తప్పించి ఇతర రకాల భీమావ్యాపారంలో ఇండియను కంపెనీల అభివృద్ధి చురుకుగా లేదు. విదేశ కంపెనీలకు విదేశీబాంకులకు ఈ దేశపు వర్తకవ్యాపారాలలో ఇంకా సత్తహక్కులుండడం స్పష్టమేగదా.

ప్రస్తుత పరిస్థితులను ఈక్రిందిపట్టిక అద్దంలో మోస్తరుగా స్పష్టంగా తెలుపుతోంది.

ఈవిధంగా దినదినాభివృద్ధి గాంచిన ఈ వ్యాపారానికి ౧౯౧౨ సంవత్సరపు ఇన్సురెన్సుచట్టం సరిపోలేదు. అనుభవంలో అందులో అనేకలోపాలు అగపడ్డాయి. ఇన్సురెన్సు ఏవిధంగా అభివృద్ధిచెందుతోందో, దానిలో లోపా లేమిటో, వాటిని అరికట్టడం ఎట్లాగో కనుక్కునే నాథుడు లేకపోవడమే అందులో ముఖ్యలోపం. ఒక ఇన్సురెన్సు కంపెనీ విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెడుతూ వుండవచ్చును. రీతీ నియమం లేకుండా తన ప్రీమియం రేట్లను ఏర్పాటు చేసుకోవచ్చును. వ్యాపారం సంపాదించడంకోసం దుబారాగా డబ్బు ఖర్చుచేయవచ్చును. ఏజంట్లకు ఇష్టంవచ్చినంత కమిషను ఈయవచ్చును; బోలెడుసొమ్ము పెట్టుబడిపెట్టి దానిని తిరిగి వసూలు చేయలేకపోవచ్చును. కంపెనీకి నష్టం వచ్చినప్పటికీ ప్రీమియము ఆదాయంలోనుంచి లాభాలను బోనస్సులను విరివిగా పంచిపెట్టవచ్చును. ఇన్నాళ్లూ అదమా

ప్రీమియము, ఆదాయము, లక్షల రూపాయలలో:—

| | ఇండియను కంపెనీలు- | | | విదేశీకంపెనీలు - | | | వెరశి. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ౧౯౩౪- | ౧౯౩౫- | ౧౯౩౬- | ౧౯౩౪- | ౧౯౩౫- | ౧౯౩౬- | ౧౯౩౪- | ౧౯౩౫- | ౧౯౩౬- |
| జీవితం - | ౬౦౦- | ౭౦౦- | ౭౮౭- | ౪౫౦- | ౫౦౦- | ౫౧౨- | ౧౦౫౦- | ౧౨౦౦- | ౧౨౯౯- |
| అగ్నిప్రమాదం- | ౨౯ ౩/౫ | ౩౧- | ౩౬- | ౧౦౫ ౨/౫- | ౧౧౧- | ౧౦౧- | ౧౩౫- | ౧౪౨- | ౧౩౭- |
| నౌకాప్రమాదములు- | ౭ ౨/౫ | ౯- | ౧౧- | ౩౭- | ౩౭- | ౪౧- | ౪౪- | ౪౬- | ౫౨- |
| చిల్లర - | ౧౭- | ౧౯- | ౨౭- | ౫౦-౨/౫ | ౫౫- | ౫౮- | ౬౮- | ౭౪- | ౮౫- |
| మొత్తం. | ౬౫౪- | ౭౫౯- | ౮౬౧- | ౬౪౩- | ౭౦౩- | ౭౧౨- | ౧౨౯౭- | ౧౪౬౨- | ౧౫౭౩- |

అనగా మొత్తం ఆదాయంలో దేశవాళీ కంపెనీల ఆదాయం నూటికి ౫౫ వంతులు; విదేశీ కంపెనీల ఆదాయం నూటికి ౪౫ వంతులు.

యించే అధికారి, వద్దని వారించే నాథుడు లేకపోయారు. ఇట్టిలోపాలను సవరించడం ఈయేడు జూలై మొదటి తేదీని అమలులోకి వచ్చిన ఇన్సూరెన్సు చట్టం యొక్క ఉద్దేశ్యం. ఇక్కడ కొన్ని ఉదాహరణలను ఇస్తాను.

(౧) వ్యాపారం నడపడంకోసం మూలధనం:— చేతిలో పైకం లేకుండా నిత్యఖర్చులకోసం కూడా ఏనెల కానెల ప్రీమియము వసూళ్లమీద ఆధారపడి పనిని ప్రారంభించే ఇన్సూరెన్సు కంపెనీలు మనదేశంలో లేకపోలేదు. అట్టి కంపెనీల ఆట లికముందు సాగవు. ఈ సవరణచట్టం ౬-వ సెక్షను ప్రకారం, గవర్నమెంటు డిపాజిట్లూ, ఆరంభఖర్చులూ కాక, ఫక్తువ్యాపారం నడపడంకోసం మాత్రం అధమం ౫౦ వేలరూపాయలైనా లేకుండా ౧౯౩౭ జనేవరి ౨౬-వ తేదీతర్వాత ఇన్సూరెన్సుకంపెనీలు రిజిష్టరు కాజాలవు.

(౨) డిపాజిట్లు:— ఇన్సూరెన్సు కంపెనీలు గవర్నమెంటుకు కట్టవలసిన డిపాజిట్లవిషయంలో ఈ చట్టం చాలా కఠినంగా వుంది. డిపాజిట్టుమొత్తాలను, ఒక్కొక్క వాయిదాకు చెల్లింపవలసిన మొత్తాన్ని మునుపటికన్న ఎక్కువ చేశారు. రెండువాయిదాల మధ్య వ్యవధిని తగ్గించి, వాయిదాకాలాలను చట్టంలోనే నిర్ణయించారు. వేరువేరురకాలైన వ్యాపారాలకు చెల్లించవలసిన డిపాజిట్లు:

| | | | |
|---|---|---|---|
| ౧. జీవితం భీమాకు | రూ. | ౨ | లక్షలు |
| ౨. అగ్ని ,, | ,, | ౧½ | ,, |
| ౩. సాగర ,, | ,, | ౧½ | ,, |
| ౪. మోటారువగైరా ,, | ,, | ౧ | ,, |
| ౫. జీవితంభీమాతో ౨,౩,౪ లో వకటి కలిసి | ,, | ౩ | ,, |
| ౬. జీవితభీమాతో రెండుకలిసి | ,, | ౪ | ,, |
| ౭. ౧ మొదలు ౫ వరకు అన్నీకలిసి | ,, | ౪½ | ,, |
| ౮. పైన ౨,౩,౪ లో రెండుకలిసి | ,, | ౨½ | ,, |
| ౯. ,, ౨,౩,౪ మూడూ | ,, | ౩½ | ,, |

ఈరేట్లు బ్రిటిషు ఇండియాలో పనిచేస్తూవున్న ఇన్సూరెన్సుకంపెనీ లన్నిటికీ—విదేశీకంపెనీలకైనాసరే దేశవాళీకంపెనీలకైనాసరే—సమానంగా వర్తిస్తాయి. బ్రిటిషు ఇండియాకుగాని, గ్రేటుబ్రిటను ఐర్లాండు దేశాలకుగాని చెందని ఇతరవిదేశీకంపెనీలు తమ డిపాజిట్టుమొత్తాన్ని రిజిష్టరు కాకపూర్వమే దరఖాస్తుతోపాటు ఒక్క మొత్తంగా కట్టివేయాలి.

(౩) పెట్టుబళ్లు:— ౨౭-వ సెక్షను చాలా ముఖ్యమైనది. బ్రిటిషు ఇండియా, గ్రేటుబ్రిటను, ఐర్లాండు దేశాల ఇన్సూరెన్సుకంపెనీలు ఇండియాలో తాము జారీచేసిన జీవిత భీమాపాలసీలమీద పాలసీదార్లకీయవలసిన మొత్తంలో నూటికి ౫౫ వంతులు పైకాన్ని ఈదేశంలోనే, గవర్నమెంటు పత్రాలలోను, గవర్నమెంటుచే ఆమోదింపబడ్డ ఇతర హామీలలోను వుంచాలి. ఇతర దేశాలలో స్థాపింపబడ్డ కంపెనీలుమాత్రం ఆ మొత్తాన్ని పూర్తిగానే ఈదేశంలో గవర్నమెంటుపత్రాలలోను, గవర్నమెంటుచే ఆమోదింపబడ్డ ఇతరహామీలలోను, వుంచాలి. ఇన్సూరెన్సు కంపెనీసబ్బును పెట్టుబడి పెట్టడంలో కంపెనీవారి స్వతంత్రం ఈవిధంగా అరికట్టడం కంపెనీకి క్షేమం కాదనీ, కంపెనీపైకాన్ని అనేకరకాలైన పెట్టుబడులలో వుంచాలిగాని ఒక్కరకం పెట్టుబడిమీద వుంచడం హానికరమనీ, గవర్నమెంటు పత్రాలమీద ఆదాయం తక్కువఅనీ, అందుచేత ప్రీమియం రేట్లు అధికం చేయవలసి వుంటుందనీ, కంపెనీ మేనేజర్ల మొర. అయితే భీమాపైకం ఎవరికోసం ఉద్దేశింపబడ్డది? వృద్ధుల అనాథలైన స్త్రీల, బిడ్డల పోషణకోసంగదా! అందు, కోసమై అతిభద్రంగా దాచివుంచవలసిన పైకాన్ని లాభాలకు ఆశపడి అనుమానాస్పదమైనచోట్ల అప్పియడం న్యాయం కాదు. ఎక్కువవడ్డీ సంపాదించుకోవడమే ఇన్సూరెన్సుపైకంయొక్క ముఖ్యోద్దేశం కాదు- ప్రత్యేకంగా లాభాలకోసం వడ్డీలకోసం ఆశపడేవారు సుర్రవుపం[illegible]లలో వేసుకుంటారు, వడ్డీవ్యాపారం చేస్తారుగాని ఇన్సూరెన్సులో తమపైకం దాచుకోరు. పైగా, మిగత ౪౫వంతులు ఆదాయంమీద కంపెనీఅధికారం తీసివేయలేదుగదా!

విదేశీకంపెనీలకు ఈమరకు పచ్చివెలక్కాయ మోస్తరుగా గొంతుకపడ్డది. తమ పైకాన్ని ఈ దేశంలో ముడుపుగట్టుకొని వుంచడం వారి కెంతమాత్రం ఇష్టం లేదు. ఇక్కడనుంచి డబ్బును తమదేశాలకు తర్లించుకొని పోడానికేగదా వారిక్కడకు వచ్చింది? ఈవిషయమై మరొక సందర్భంలో చర్చిస్తాము

(౪) మేనేజింగు ఏజంట్లు:–కంపెనీలన్నింటిలో మోస్తరుగా ఇన్సూరెన్సు కంపెనీలలో కూడా మేనేజింగు ఏజంట్లు వుండడం మనదేశంలో మామూలై యుంది. కంపెనీ మేనేజిమెంటు కొన్ని యేళ్లవరకూ వారికే గుత్తహక్కు. ఒడంబడిక ప్రకారం అనుకున్నంతకాలం వారిని ఆపదవిలోనుంచి తీసివేయడానికి వల్లగాదు. వారు కంపెనీలను ప్రారంభించిన వారైనా అయివుంటారు; లేదా తమ తెలివితేటలవల్లా పలుకుబడివల్లా కంపెనీలను అభివృద్ధిలోకి తెచ్చినవారైనా అయివుంటారు; లేదా కడుసమర్థతతో, అందరినీ టోపీ వేసి, ఆస్థానం ఆక్రమించుకున్నవారైనా అయివుంటారు. కంపెనీల అభివృద్ధికి వా రుండడం అవసరం అని పైకి పేరు. క్రియలోమాత్రం కంపెనీలు వారిబాగు కోసం నడుస్తూవుంటాయి. అనేకచోట్ల వారి జీతాలు భత్యాలు కమిషన్లు వగైరాలన్నీ కలిసి, కలెక్టర్ల, గవర్నర్ల జీతాలను మించివుంటాయి. వారికి ముట్టవలసిన ముడుపులన్నీ ముట్టినతర్వాత మిగిలిన పైకములోనుంచే వాటాదార్లకు పంచిపెట్టే లాభాలు. ఈ ఇన్సూరెన్సు సవరణచట్టం ౩౨-వ సెక్షను ప్రకారం ఇన్సూరెన్సు కంపెనీలు ఇకముందు మేనేజింగు ఏజంట్లను నియమించరాదు; ఇదివరకే నియమింపబడివున్న మేనేజింగు ఏజెంట్లు ఈచట్టం ప్రారంభమైన తర్వాత మూడేళ్లకన్న ఎక్కువకాలం ఆపదవిలో వుండరాదు; ఆమూడేళ్ల కాలంలోనూ, వారికీ కంపెనీకీ వుండే అగ్రిమెంట్లు ఎటువంటివైనా సరే, జీతాలు, భత్యాలు, కమిషను వగైరా బాపతులన్నీ కలిసి వారికి నెలకు రెండువేల రూపాయలకన్న ఎక్కువపైకం ముట్టగూడదు.

ఈ నిబంధన మరీకఠినంగా వుందని అనేకులు మేనేజింగు ఏజంట్లు మొరపెట్టారుగాని ఇన్సూరెన్సు కంపెనీల అభివృద్ధికి మేనేజింగు ఏజంట్లు అవసరం లేదని అనుభవంమీద తెలుస్తోంది. కొత్త కొత్త పద్ధతులమీద ఎక్కువపాలసీలను సంపాదించడం, వచ్చిన పైకాన్ని ఎక్కువలాభాలకు పెట్టుబడిపెట్టడం—ఇవి ఇన్సూరెన్సులో కావలసిన తెలివితేటలు. అందుకు సమర్థులు అయిన వుద్యోగులను పైపదవులలో వుంచాలిగాని ఎల్లకాలం మేనేజింగు ఏజంట్లనే అచ్చట వుంచడం వ్యాపారాభివృద్ధికి క్షేమకరం కాదు.

(౫) అప్పులు:— ౨౯-వ సెక్షను ప్రకారం, ఇన్సూరెన్సుకంపెనీలు తమ డైరెక్టర్లకు, మేనేజర్లకు, మేనేజింగు ఏజంట్లకు, ఆడిటర్లకు, అక్చ్యుయరీలకు (actuaries), కంపెనీభాగస్థులకు, ఆఫీసర్లకు వారి ఆస్తి తాకట్టు మీదనైనాసరే, స్వంతహామీమీదనైనాసరే అప్పులుగాని తాత్కాలికంగా అడ్వాన్సులుగాని ఇయ్యకూడదు; ఇప్పుడున్న అప్పులను ఈ సవరణచట్టం ప్రారంభమైన ఏడాదిలోపుగా తీర్చివెయ్యాలి; అట్లా తీర్చివేయనియెడల చట్టం ప్రారంభమైన ఏడాదిపిదప ఆ అధికారులను ఆ ఉద్యోగాలలోనుంచి తొలగించాలి.

ఇదికూడా చాలా కఠినమైన నిబంధన అనీ, కంపెనీ సెక్రటరీలకు, ఇనస్పెక్టర్లకు మోటారుబండ్లఖరీదు, ప్రయాణ ఖర్చులు వగైరా అడ్వాన్సులుగా బదుళ్లు ఈయనియెడల ఇన్సూరెన్సువ్యాపారానికే భంగంవస్తుందనీ కొందరు మేనేజర్లు మొరపెడుతున్నారు. కాని కొన్ని కంపెనీలలో మేనేజింగు ఏజంట్లు వగైరా ఉద్యోగులు తమకంపెనీలకు రూ. ౩౦ వేలు, రూ. ౪౦/ వేలు, ౫౦- వేలువరకూ బాకీలుపడి వుండడం మనం ఎరుగుదుము.

(౬) నష్టాలు:పైనచెప్పబడ్డ ౨౭, ౨౯ సెక్షన్లకు భంగంచేయడంవల్ల ఇన్సూరెన్సుకంపెనీకిగాని పాలసీదార్లకుగాని నష్టం వచ్చివున్నయెడల, తెలిసివుండికూడా అందుకు తోడ్పడ్డ ప్రతిడైరెక్టరు, మేనేజరు, మేనేజింగుఏజంటు, భాగస్వామి, ఆఫీసరు ఒక్కొక్కరుగానూ, సమిష్టిగానూకూడా ఆ నష్టాన్ని పూడ్చడానికి బాధ్యులు అవుతున్నారు అని ౩౦-వ సెక్షను చెప్తోంది. దీనిమీద ప్రత్యేకవ్యాఖ్యానం అనవసరం.

(౭) ఏజంట్లు:— ఇన్సూరెన్సు ఏజంట్లనుగురించి ఈ చట్టంలో కొన్ని ముఖ్యమైనమార్పు లున్నాయి

వారివృత్తి నానాటికి హీనస్థితికి వచ్చినమాట అందరూ ఎరిగినదే. పాలసీలకోసం ప్రజలను పీడించడంలో వారిని దర్శీలలోవుండే వల్లులతో పోల్చారు. ఎక్కడ చూసినా, వూరూరా, ఇంటింటికీ ఇన్సూరెన్సు ఏజంట్లే అగపడుతున్నారు. పూర్వం సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు తమజీవితం భీమా చేసుకోవడం కోసం ఏలూరునుంచి కాకినాడకు ప్రత్యేకంగా పని గట్టుకు వెళ్లవలసివచ్చిందట! ఇప్పుడు వక్కపాలసీ దారుణ్ని సేకరించడంకోసం వారిలో వారికి ఎన్ని పోటీలు! ఎంత సూచన! పైగా ఎంత శ్రమపడ్డా, 'దంపిన అమ్మకు బొక్కిందే కూలి' అన్నట్లు ఈవృత్తిలో ఎప్పటి కష్టాకం అనిశ్చయమే! అస్థిరమే! నిగటికన్న ఈరేడు పని తగ్గిందనికాని, మరేదో వంకబెట్టికాని, పాతకమీషనుకూడా ఇయ్యకుండా కంపెనీలు తమఏజంట్లను బర్తరుఫు చేయడం మనం ఎరుగుదుము. ఈసవరణ చట్టం ఈలోపాలను కొంతవరకు తగ్గించిందని చెప్పవచ్చును.

ఇన్సూరెన్సు ఏజంట్లు ప్రతియేడూ గవర్నమెంటు వద్దనుంచి లైసెన్సు పొందాలి(సె, ౪౨-౧); చట్టంలో విధింపబడ్డ నియమాలకు వ్యతిరేకంగా ప్రవర్తించిన ఏజంట్లలైసెన్సు రద్దుచేయబడుతుంది (సె, ౪౨-౫); ఈ సవరణచట్టం ప్రారంభమైన ఆరునెలల తర్వాత ఇన్సూరెన్సు కంపెనీలు లైసెన్సు పొందనివారిని ఏజంట్లుగా నియమించి వారిచేత పాలసీదారులను సేకరింపజేసి కమిషను ఈయరాదు (సె, ౪౦-౧); ఇన్సూరెన్సు ఏజంట్ల కమిషనూ, ఇతర ప్రతిఫలాలు,కలిపి మొత్తంమీద మొదటి యేడు ప్రీమియములో నూటికి రూ. ౪౦/-కు, ఆతర్వాత సాలుసరి ప్రీమియములలో నూటికి ౫/-రూపాయిలకు మించరాదు. ఇతర విధాలైన భీమావ్యాపారాలలో ఏజంట్ల కమీషను సాలుసరి ప్రీమియంలో నూటికి ౧౫-రూపాయలు మించరాదు (సె౪౦-౨); ఇన్సూరెన్సు కంపెనీలు తమవ్యాపారం ప్రారంభించిన మొదటిపదేళ్లలో, జీవిత భీమావ్యాపారం విషయంలోమాత్రం, మొదటియేడు ప్రీమియములో నూటికి రూ. ౫౫-ల వరకూ, ఆపిమ్మట సాలుసరి ప్రీమియములో నూటికి రూ. ౬-వరకూ, ఏజంట్లకు కమిషను ఈయవచ్చును (౪౦-౨); ఇన్సూరెన్సు ఏజంట్లు తమకమిషను పూర్తిగా గాని కొంతగాని పాలసీదార్లకు ముదరా ఇయ్యగూడదు (౪౧-౧); ప్రత్యేకంగా ఒక ఇన్సూరెన్సు కంపెనీలో పదేళ్లవరకు విడువకుండా పనిచేసి పిదప విరమించుకున్న ఏజంటుకు ఆ కంపెనీ, అతడు చేసిన జీవితభీమా వ్యాపారంమీద తిరుగుదల కమీషన్లను పూర్తిగా చివరవరకూ ఇచ్చివేయవలెను; అయితే వంచన మూలంవల్ల ఆఏజన్సీ రద్దు అయివుండగూడదు; పదేళ్ల తర్వాత అతడు మరొకకంపెనీలో ఏజంటుగా పనిచేయగూడదు (సె. ౪౪).

ఈనిబంధనలవల్ల ఇన్సూరెన్సు ఏజంటువృత్తికి మునుపటికంటె ఎక్కువ గౌరవము స్థిరత్వము ఏర్పడతాయని చెప్పవచ్చును. కంపెనీలకు ఏజన్సీ కమిషను ఖర్చులు తగ్గుతాయి. కమీషనుపైకం అధికంగా ముదరావస్తుందన్న ఆశతో ప్రజలు జబ్బురకం కంపెనీలలో తమ జీవితాలను భీమాచేసుకోవడం ఇకముందు మానుతారు. ఇన్సూరెన్సు ఏజంట్లకు ఆవృత్తి మానుకున్నప్పటికీ తామిదివరకు సేకరించిన వ్యాపారంమీద కమీషను రాదన్నభయం వుండదు. ఇది ఇంచుమించుగా పింఛనుతో సమానమైన యేర్పాటు.

(౮) లాభాలు బోనస్సులు:— ఇన్సూరెన్సు కంపెనీయొక్క జీవితభీమా వ్యాపారంలో వచ్చిన అప్పు ఆస్తులను గురించి ఆక్చుయరీ (actuary) మదింపుగట్టగా తేలిన శేషభాగంలోనుంచి తప్ప ఇతరపైకంలోనుంచి ఇన్సూరెన్సు కంపెనీలు తమవాటాదార్లకు లాభాలుగాని పాలసీదార్లకు బోనస్సుగాని పంచిపెట్టగూడదు (సె-౪౯)

(౯) పాలసీరద్దు కావడం:— ఇదివరకు ఎన్నో ఇన్సూరెన్సు కంపెనీలు ఏదో వంకబెట్టి పాలసీమొత్తం ఇయ్యకుండా ఎగవేయడానికి ప్రయత్నించేవి అని చెప్పడం మోటుతనమైతే కావచ్చునుగాని అతిశయోక్తి మాత్రం కాదు. తమ పాలసీపైకం తిరిగి చేతులలో పడేవరకూ అది ఎప్పుడు ఏ వంకమీద రద్దు అవుతుందో అని చాలామంది పాలసీదారులు భయపడేవారు. ఈ చట్టం ౪౫-వ సెక్షను పాలసీదారులకు శ్రీరామరక్షవంటిదని చెప్పవచ్చును. ఆ సెక్షనులో

చెప్పబడ్డ దేమనగా:— ఈ చట్టం అమలులోకి రాక పూర్వం జారీచేయబడ్డ జీవితభీమాపాలసీలవిషయంలో చట్టం అమలులోకి వచ్చిన రెండేళ్లతర్వాతా, చట్టం అమలులోకి వచ్చినపిదప జారీచేయబడ్డ జీవితభీమా పాలసీలవిషయంలో వాటిని జారీచేసిన రెండేళ్ల తర్వాతా, అసలు ప్రొపోజలు స్టేటుమెంటులో గాని, వైద్యుడి రిపోర్టులోగాని, మధ్యస్థుల రిపోర్టులోగాని, స్నేహితుడి రిపోర్టులోగాని, పాలసీని జారీచేయడానికి అవసరమైన ఇతరకాగితాలలోగాని తప్పు లున్నాయనో, అబద్ధా లున్నాయనో కారణంకల్ల పాలసీని రద్దుచేయగూడదు—ఆతప్పూ అబద్ధమూ ప్రధాన విషయాలలో వచ్చాయనీ, పాలసీదారుడు ఆస్టేటు మెంటును దురుద్దేశంతో చేశాడనీ, అది అబద్ధమని దానిని చేసేటప్పుడే అత డెరుగుననీ, ఇన్సూరెన్సు కంపెనీ రుజువుచేస్తేతప్ప; అనగా రుజువుచేసేబాధ్యత ఇన్సూరెన్సుకంపెనీది అన్నమాట. పాలసీదారు తప్పు సమాచారం ఇచ్చినప్పుడైనా పాలసీ రద్దుకావద్దా? అని అనేకమంది ఇన్సూరెన్సువ్యాపారస్థులు మొరపెట్టారు. కాని అటువంటి సందేహా లేవైనా ఉన్నయెడల కంపెనీలు వాటిని మొదట్లోనో, మొదటి రెండేళ్ల లోనో తీర్చుకోవాలిగాని ఎల్లకాలం అనుమానాలు పెట్టుకుంది, చివరవరకూ పాలసీదారులను సందేహాలతో బాధపెట్టి, ఆఖరున తగాదాలుపెట్టడం న్యాయం కాదు. అనేక పెద్దపెద్దకంపెనీలుకూడా ఇదివరకు చేస్తూ వుండిన పనేకదా ఇది!

(౧౦) విదేశీకంపెనీలు:— మనదేశంలో విదేశీ కంపెనీల స్థానం త్రిశంకు స్వర్గపదవివంటిది. అది మన ఇన్సూరెన్సు వ్యాపారంయొక్క అభివృద్ధిని అరికట్టడం మాత్రమేకాకుండా భారతీయుల ఆత్మగౌరవానికి భంగ కరంగా వుందనికూడా చెప్పవచ్చును. అట్టి పరిస్థితిని ఈచట్టం కొంతవరకు సవరిస్తోంది.

ఈచట్టం ఇండియాలో పనిచేస్తూవున్న ఇన్సూరెన్సు కంపెనీలన్నిటికీ వర్తిస్తుంది(సె-౨) ఈచట్టంప్రకారం ఇండియను కంపెనీలు ఇన్సూరెన్సు సూపరెంటుకు పంప వలసిన స్టేటుమెంట్లను, లెక్కలను, అబుస్ట్రాక్టులను, వుంచవలసినఅక్కౌంటు పుస్తకాలను రిజిస్టర్లు వగైరాలను అన్నింటినీ విదేశీ కంపెనీలుకూడా, ఇండియాలో తాము చేస్తూవున్న ఇన్సూరెన్సు వ్యాపారం విషయమై, వ్రాసి వుంచాలి (సె-౬౪). విదేశాలలో పనిచేస్తూవున్న ఇండియను కంపెనీలమీద ఆప్రభుత్వాలు ఎట్టి నిర్బంధాలను విధిస్తున్నాయో ఇండియాలో పనిచేస్తూవున్న ఆదేశాల కంపెనీలమీద గూడా ఇండియా గవర్నమెంటు అట్టి నిర్బంధాలను విధించాలి(సె-౬౨). మనఇన్సూరెన్సు కంపెనీలను తమదేశాలలో పనిచేయనీయని విదేశాల ఇన్సూరెన్సు కంపెనీలను ఈదేశంలో రిజిస్టరుచేయగూడదు. ఇదివరకే అవి ఈదేశంలో రిజిస్టరు అయివుండినయెడల ఇన్సూరెన్సు సూపరెంటెండెంటు ఆ రిజిస్ట్రేషనును వెంటనే రద్దుచేయాలి(సె,3-3).

ఈచట్టం ఈదేశంలో తమ అభివృద్ధిని అరికట్టు తోందని విదేశీకంపెనీలు మొరపెడుతున్నాయిగాని అందుకు తగినకారణం అగపడదు. ఆకంపెనీలు ఇంతకాలం ఇండియాలో ఏవిధంగా వ్యాపారం చేస్తున్నాయో తెలియదు. అవి తమలెక్కలను చూపడంలేదు. కాని ఇకముందు ఈఆటలు సాగవు. పైగా ఇన్సూరెన్సు పేరు చెప్పి విదేశీకంపెనీలు ఇదివరలో ఏటేటా మనదేశంలోనుంచి ౬, ౭ కోట్ల రూపాయలు తమదేశాలకు తర్లించుకొనిపోయి అక్కడ తమఇతర వ్యాపారాలను అభివృద్ధి చేసుకుంటూ వుండేవి. ఇది న్యాయమా? ఇకముందు మనం అట్టి అన్యాయాల కెడమీయక పోవడం తప్పా? ప్రపంచకంలో ప్రతి దేశంలోనూ అట్టి నిర్బంధా లున్నాయికదా! ఒక్క మనదేశం మాత్రమే విదేశీకంపెనీలకు ధర్మసత్రము కావాలా?

విదేశీకంపెనీలు తాము ఇండియాలో చేస్తూ వున్న ఇన్సూరెన్సు వ్యాపారాన్నిగురించి ఏటేటా ఇన్సూరెన్సు సూపరెండెంటుకు ఆదాయవ్యయపట్టిక, ఆస్తి అప్పుపట్టిక, రివిన్యూ అక్కౌంటులను పంపించాలి (సె ౧౫-3)

ఈదేశంలో రిజిస్టర్డు కార్యస్థానాలులేని విదేశీ కంపెనీలు ఈదేశంలో జారీచేసిన ఇన్సూరెన్సు పాలసీల విషయమై వచ్చిన తగవులను గురించి ఈదేశంలో వ్యాజ్యాలువేయడానికి పార్టీల కిదివరలో అధికారం వుండే

దికాదు. ఈచట్టం ౪౬-వ సెక్షను ఇకముందు అట్టి అధికారం ఇస్తోంది. ఈదేశంలో జరుగుతూవున్న ఇన్సూరెన్సు వ్యాపారం సందర్భంలో జారీచేయబడ్డ పాలసీలన్నిటికీ ఇండియాలో అమలులోవున్న న్యాయశాస్త్రం వర్తిస్తుంది. వాటినిగురించి వచ్చేతగవు లన్నిటినీ ఇండియాను కోర్టులలో విచారించవచ్చును. (సె-౪౬)

ఇదివరకు మన ఇన్సూరెన్సువ్యాపారాలలోవున్న లోపాలను ౧౯౫౦ సంవత్సరపు సవరణచట్టం చాలా వరకు తీర్చిందని సూచించడానికి ఈ వుదాహరణలు చాలును. ఇంకా సవరణ కావలసిన లోపాలు అనేకం వున్నాయనీ, ఈ సవరణచట్టం లాయర్ల చేత ప్లాను చేయబడ్డదిగాని ఇన్సూరెన్సువ్యాపారాలలో అనుభవం వున్నవారిచేత ప్లానుచేయబడ్డది కాదనీ, అందుచేత ఇన్సూరెన్సు వ్యాపారస్థుల కష్టనష్టాలను ఈ చట్టం పూర్తిగా గుర్తించలేదనీ కంపెనీ మేనేజర్లు కొందరంటున్నారు. వారు చూపించే కొన్ని లోపాలకు అందుకు సమాధానాలను ఇదివరకే కొంతవరకు చెప్పివున్నాను. వారు చూపే మరొకలోపం ఏమనగా:—

౨౭-వ సెక్షను ప్రకారం ఇన్సూరెన్సు కంపెనీల ఆదాయంలో నూటికి ౫౫ వంతులు గవర్నమెంటువారి పత్రాలలోను వారిచే ఆమోదింపబడ్డ సెక్యూరిటీలలోను వుంచాలని వ్రాసివున్నానుగదా! వాటిమీద సాలుకు దాదాపాయిని నూటికి ౩½ కంటె ఎక్కువ వడ్డీ గిట్టటంలేదు. మహాఎక్కువగా వస్తే ౪½ దాటడం కష్టం. కాని ఇప్పటి ప్రీమియంరేట్లు చాలావరకు, కంపెనీ పెట్టుబడులమీద నూటికి ౪, ౫ రూపాయల వరకూ వడ్డీ వస్తుందన్న అంచనామీద నిర్ణయింపబడ్డవి చాలా కంపెనీలు నూటికి ౬ రూపాయల వరకూ వడ్డీ సంపాదిస్తూవుండేవి. కాని ఇకముందు ఈ ఆదాయం తగ్గిపోకతప్పదు; నూటికి ౩, ౪ రూపాయల కన్న ఎక్కువవడ్డీ రావడం కష్టం. కాబట్టి ఇన్సూరెన్సుకంపెనీలు ఇకముందు తమ ప్రీమియంరేట్లను హెచ్చించుకోవలసి ఉంటుంది. కంపెనీలు ఇన్నాళ్లూ పెద్దపెద్ద కమిషన్లు, ముదరాలు ఆశచూపి వ్యాపారం సంపాదిస్తూ వుండేవి. ఇకమీద అది సాగదు. అవి ఇకముందు నమ్మకమైన వ్యాపారం సంపాదించడంకోసం ప్రయత్నించవలసి వుంటుందిగాని పెద్దవ్యాపారంకోసం కాదు. పెద్దకంపెనీలు తమ ప్రీమియంరేట్లను ఇదివరకే హెచ్చిస్తున్నాయి. చిన్నవికూడా ఇకముందు అట్లా చెయ్యకతప్పదు. ప్రీమియంరేట్లను హెచ్చించడం, బోనస్సును, కమిషనును తగ్గించడం, వ్యాపారం వృద్ధిచేయవలసిన ఇన్స్పెక్టర్లకు, సెక్రటరీలకు ప్రయాణాల భత్యఖర్చులైనా చేబదులుగా ఇయ్యకపోవడం, నమ్మకమైన వ్యాపారంకోసం అసలు వ్యాపారం చంపుకోవడం, ఇవి ఇకముందు మన ఇన్సూరెన్సు కంపెనీలు అవలంబించవలసిన పద్ధతులు. అవి అట్లా చేస్తాయా? చేస్తే వ్యాపారం వస్తుందా? పోటీలకాగగలవా? ఈ ప్రశ్నలకు జవాబు ముందుముందు అనుభవంమీదనే తెలియాలి.

ఇక కంపెనీ ఖర్చుల విషయంలో, వైద్యపరీక్షను కొంతవరకు తగ్గించవచ్చునని అనుకుంటున్నారు. రెండు మూడేళ్లకు మించని స్వల్పకాలానికి, రూ౧౦౦౦౦, రూ౧౫౦౦౦లకు మించని స్వల్పమొత్తాలకు, తగిన జాగ్రత్తలపైన వైద్యపరీక్ష అవసరంలేకుండా పాలసీలను జారీచేయవచ్చునా అన్నది ఆలోచించతగ్గ విషయం.

సవరణచట్టం అమలులోకి వచ్చింది. దానిలో వున్న లోపాలను గురించి ఇప్పుడు ఆలోచించడం గతజలసేతుబంధనం అవుతుంది. ఉన్నచట్టంతో సరిపుచ్చుకొని, అందులోఉన్న ఇబ్బందులను ఏదోవిధంగా సాధించవలసినపూచీ ఇన్సూరెన్సు వ్యాపారస్థులది. మన కాగోడవలతో పనిలేదు. ఇంతవరకూ మనఇన్సూరెన్సు వ్యాపారం ఏదో వొక్క జీవిత భీమా పద్ధతిమీద మాత్రమే కొంతమట్టుకు అభివృద్ధి అయింది. అవక్క పద్ధతిలో కొన్ని కంపెనీలు తమ వ్యాపారం చాలా అభివృద్ధి చేసుకొంటున్నాయి. కాని ఇన్సూరెన్సుయొక్క ఉద్దేశ్యం ఏమిటి? వ్యక్తుల లాభమా? దేశాభివృద్ధియా? ఏవో కొద్దిమంది లాభాలతో సంతోషించి ఊరుకోవడమా? ఇన్సూరెన్సు పైకం దేశంయొక్క ఆర్థిక పారిశ్రామిక అభివృద్ధికి తోడ్పడాలిగాని కంపెనీ ప్రొప్రయిటర్ల, కంపెనీనుంచి అప్పులు పుచ్చుకొనే తాహతుగల భాగ్యవంతుల, ఇళ్లలో పెళ్లిఖర్చులకోసం, ఎలెక్షన్ల ఖర్చులకోసం, ఉంపుడు

కత్తెలకోసం, కోర్టు వ్యాజ్యాలకోసం పెట్టుబడులకింద ఉపయోగపడగూడదు. అనగా ఇన్సూరెన్సు వ్యాపారం దేశంపరం కావాలి గాని కొద్దిమంది వాటాదార్ల పరమై యుండగూడదు. అంతటి పుణ్యకాలం ఇంతలో వస్తుందని అనుకోడానికి వీల్లేదుగాని అందుకు దారితీసే జేయి కార్ల పర్వతానికి ఈచట్టం మొదటి సోపానమని చెప్ప వచ్చును.

ఇప్పుడు మనం ఆలోచించవలసిన ముఖ్య విషయం మరొకటి కలదు. మన ప్రజలలో నూటికి ముప్పాతికమంది వ్యవసాయదారులు. వారి కష్టనష్టాలను దారిద్ర్యబాధను తొలగించడానికి ఇన్సూరెన్సు ఎంతవరకు తోడ్పడగలదో ఎవరూ ఆలోచించిన ట్లగపడదు. ఇది ఎంతో శోచనీయమైన విషయంకదా! పశ్చిమ దేశాలలో ప్రజల అవసరాలనుబట్టి ఇన్సూరెన్సు ఎన్నెన్నివిధాల అభివృద్ధి అవుతోందో చూడండి! ఇంట్లో వెండి సామాను రక్షణకు భీమా, ప్రయాణాలలో పెట్టె, పరుపులు వగైరాల భీమా, రికార్డుకాగితాల సంరక్షణకు భీమా, తాళంచెవుల రైళ్లువగైరా సీజనుటిక్కెట్ల రక్షణ భీమా, కుక్కలు, చిలకలు వగైరా పెంపుడు జంతువుల భీమా, వ్యాక్తుల అవయవాలు భీమా, గాయకురాలి గాత్రం భీమా- ఈవిధంగా ఉన్నాయి. మన గ్రామాలలోవుండే ప్రజల ఇబ్బందులూ, కష్టనష్టాలు మనదృష్టిలో ఆమాత్రం విలువ నోచుకోకపోవడం ఎంత విచారకరమైనసంగతి! అది వ్యవసాయదారుల అభివృద్ధి యెడల మననిర్లక్ష్యం, అజ్ఞానం చూపుతుంది. ఇందులో చాలా చిక్కు లున్నమాట నిజమే. పశ్చిమ దేశాలలో వ్యవసాయభీమా ఇంతవరకు అభివృద్ధి కాని మాట నిజమే. కాని ఇన్సూరెన్సును వారికి కావలసిన పద్ధతులలో వారు అభివృద్ధి చేసుకున్నారు; మనకు అవసరంవున్న పద్ధతులలో అభివృద్ధి చేసుకో వలసిన విధి మనది. నేడు పశ్చిమదేశాలలో ప్రభుత్వాలు తమ ప్రజల అభివృద్ధికోసం ఎన్నెన్నో మహాకార్యాలను సాధిస్తూన్నాయి. సోవియటు రష్యాలో పాడిపంటలకోసం ఎడారులలోనుంచి మంచినీటిని తవ్వి ఎత్తుతున్నారట. ప్రభుత్వమే తలుచుకుంటే ప్రజల సేవని సాధించజాలదు?

మన వ్యవసాయదారునికి కావలసిన ఇన్సూరెన్సు సంరక్షణ ఒక్కవిధంగా వుండదు. (౧) ఇల్లు, ధాన్యపు కొట్టు, గడ్డివాము, పనిముట్లు వగైరా భీమా (౨) పశువులభీమా (౩) పంటల భీమా. ఈమూడు విధాలా రైతుల కష్టనష్టాలు తొలగినవాడు అతడి అప్పుల బాధా, ఆకలి బాధా, కరువులబాధా చాలామట్టుకు తీరిపోతాయి.

ఏ పేటా దేశంగులలో ఎన్నో ప్రాళ్లు "పరశురామ ప్రీతి" అయిపోయి ప్రతిప్రాణ్లోను వేలకొద్ది రూపాయలు నష్టంరావడం మనం ఎరుగుదుము. అగ్నిభయంతో సమానమైనది వరదలభయం. పశ్చిమదేశాలలో పశువుల భీమా అంతగా అభివృద్ధిచెందినట్లు అగపడదు గాని అక్కడ పరిస్థితుల కది అంత ముఖ్యమైన వ్యాపారం కాదుకాబట్టి వారు దానిని విరివిగా అభివృద్ధి చేసుకోలేదు. మనదేశంలో కొంతకాలంకింద పశువులభీమా కంపెనీ వుండేది. మేనేజిమెంటు సరిగా జరక్క అది అంతరించిందిగాని పల్లెటూళ్లలో దాని కెంతో ప్రోత్సాహం రావడం నే నెరుగుదును.

ఉదాహరణార్థం పంటలభీమావిషయం ఆలోచిద్దాము. అతివృష్టి, అనావృష్టి, వరదలు, వగైరా కారణాలవల్ల పంటలు చెడిపోయినప్పుడు రైతు కూలిపోకుండా సంరక్షణ యివ్వడం దీనిఉద్దేశ్యం. పంటలు ప్రతియేడూ ఎల్లావున్నా, ధరలెల్లా వున్నా, యెకరానికింత కనీసం ఆదాయం చొప్పున రైతుకు గారంటీ ఇయ్యడం అవుసరం. కనీసం ఆదాయాన్ని, కనీసం పంటను నిర్ణయించడం ఎట్లా? ఒక్కొక్క పొలాన్ని ఎంతమొత్తాని ఇన్సూరు చేయవచ్చును? ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క పంటకు ప్రీమియము రేటును నిర్ణయించడం ఏవిధంగా? ఈ విషయాలను తరిచి చూచినకొద్దీ సందేహాలే అవుతాయి. ఇదివరకు అధాలంలో పండినపంటను, గవర్నమెంటు లెక్కలను, ఆధారంగా చేసుకొని దామాషాయి అంకెను ఇంచుమించు సరిగా లేల్చవచ్చు ననుకుంటాను. పొలంలో పండే దామాషాయి పంటకంటె పంటల ఇన్సూరెన్సు గారంటీ మొత్తం చాలాతక్కువగా వుంటే మోసాలు చాలావరకు తగ్గుతాయి.

వ్యవసాయభీమాలో వున్న అసలుచిక్కు అది గాదు. రైతుయొక్క కష్టనష్టాలు ఎప్పు డెప్పుడు వస్తాయో ఎంతమట్టుకు వస్తాయో కొంతవరకైనా ముందుగా ఉజ్జాయింపుగా తెలుసుకొని మదింపుగట్టడం అసాధ్యంగా వుంది. అంత యాదృచ్ఛికంగా వచ్చే నష్టాలను పూడ్చడంకోసం ఎంతమొత్తానికి ఇన్షూరు చెయ్యాలి? ఏరేటున ప్రీమియం వసూలుచెయ్యాలి? ఇవి చాలా చిక్కుప్రశ్నలు. ఒక్కొక్క యేడు అనావృష్టిలో, కరువులలో, వరదలలో, అంటుజాడ్యాలలో, గాలిపాటు తెగుళ్లలో కుటుంబాలకు కుటుంబాలు, వూళ్లకు వూళ్లు, మండలకు మండలాలు నాశనమవుతూ వుంటాయి. ఆనష్టంయొక్క విస్తీర్ణాన్ని గాని విలువను గాని మదింపుగట్టడానికి తగిన ఆధారమైనా దొరకడం కష్టం అవుతుంది. అటువంటప్పుడు భీమారేట్లు చాలావరకు ఊహలమీదనే ఆధారపడివుండాలి. రేట్లు మరీ ఎక్కువగా ఉంటే భీమా రైతుకు అందుపాటులో వుండదు; మరీ తక్కువగా ఉంటే కంపెనీకి నష్టంవస్తుంది.

మైసూరు గవర్నమెంటువారు ఈమధ్య ఈవిషయమై కొంత పరిశోధన చేసినట్లు తెలుస్తుంది. మన వ్యవసాయం ముఖ్యంగా వర్షాధారం గాబట్టి పంటల భీమాను వర్షంభీమాగా మారిస్తే బాగుంటుం దని వారి ప్రత్యేకపరిశోధకుడు నిర్ణయించాడట! అనగా ఒక ప్రదేశంలో వర్షాలు, ఒకయేడు, ఫలానా రేటికి ఇన్ని అంగుళాలకన్న తగ్గిపోతే రైతుకు ముదరా ఇయ్యడం, అన్నమాట- అయితే రైతు నష్టాలన్నిటికీ అనావృష్టి వక్కటే కారణంకాదు. ఈ కలికాలంలో వర్షపాతం వూరి కొవిధంగాను పొలాని కొకవిధంగాను వుంటోంది. దానిని కొలవడం, ఎట్లా? సకాలంలో గింజ నాటక పోతే వర్షాలు కురిసి ఏమిలాభం? మొత్తంమీద వర్షంలెక్క కాకులలెక్కవంటిది.

ఎన్నో చిక్కు లున్నప్పటికీ వ్యవసాయంభీమా దుస్సాధ్యమైన సమస్య కాదు; ముమ్మాటికీ గాదు. ఇంపీరియలు బాంకువారు మారుమూలల వున్న పల్లెటూళ్లలో కూడా వేరంగులలో, లక్షలాది ధాన్యపుకొట్లను అగ్నిప్రమాదాలకు ఇన్షూరుచేస్తున్నారు. అక్కడక్కడ ఒకటిరెండు పొరపాట్లు జరిగితే జరగవచ్చును గాని మొత్తంమీద ఆ పద్ధతి చాలా జయప్రదంగా నడుస్తోంది. పట్నాలలో చిన్న చిన్న సాహుకారు కొట్లలో అగ్నిప్రమాదాలకు భీమా, మారుమూల వూళ్లలో సైతము జీవితంభీమా, మోటారుభీమా వగైరాలు కూడా జయప్రదంగానే జరుగుతున్నాయి.

అయితే, మనరైతులు అజ్ఞానులు; మోసాలకు అబద్ధాలకు వెనక్కితీయరు; వారికి శాస్త్రజ్ఞానం లేదు' ఇటువంటి పాతకాలపు ఆర్గ్యుమెంట్లు ఎన్నో మనం వింటాము- అవి అన్నీ వస్లువంగని వెంకయ్యలు చెప్పే జవాబులు. ఇ దులో అసలు రహస్యం ఏమిటనగా :—

మన ఇన్సూరెన్సు కంపెనీలలో చాలావాటికి పూర్వకాలపు పద్ధతులమీద ఇంకా కొద్దిగానో గొప్పగానో వ్యాపారం దొరకుతోంది. అట్లా దొరికినంత కాలం అవి పల్లెటూళ్లవంకకు వెళ్లవు. కొత్తపంథాలు తొక్కవు. ఎవరైనా అడిగితే 'మాకు అనుభవం చాలదు' అని జవాబు చెప్పుతాయి- కాబట్టి గవర్నమెంటు ఒకకమిటీని నియమించి, పని ప్రారంభించడం కోసం కొన్ని పంథాలు ఏర్పాటు చేసుకొని, వ్యవసాయభీమాను పెద్దఇన్సూరెన్సు కంపెనీలచేత దేశంలో ఒక్కడక్కడ అమలులో పెట్టించాలి. మొదటి పదేళ్లలో వాటికి వచ్చే నష్టానికి గవర్నమెంటే పూచీపడాలి. ఈవిధంగా క్రమక్రమంగా పని సాగిస్తే పది,పదిహేను ఏళ్లలో ఈసమస్యను పూర్తిగా సాధించవచ్చును. అట్లా చేయనంతకాలం ఈసమస్యలూ, చిక్కులూ, అనుమానాలూ, భయాలూ యథాప్రకారంగానే వుంటాయి.

ప్రజల క్షేమాన్ని గమనించని రాజర్కము, పన్నులు వసూలుచేసుకొనే సంస్థ, అని అనిపించుకుంటుంది గాని ప్రభుత్వం అనిపించుకోదు.

---

# పుస్తక సమీక్ష

## బ్రహ్మసూత్రములు

[శ్రీభాష్యలఘుటీకా తాత్పర్య సహితము. గ్రంథకర్త:— భద్రగిరి నంబెరుమాళ్లుగారు బి. ఏ. యల్. టి. ప్రచురణకర్త: రంగా అండు కంపెనీ; ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా.]

సాధారణవిద్యావంతులమాట అట్లా ఉండగా పేరుకు ఉన్నతవిద్యల నభ్యసించినవారికికూడా పిట్టకథలమీద మనస్సు పోతుంది కాని శాస్త్రీయగ్రంథాలంటేనూ, అందులోనూ వేదాంతానికి సంబంధించిన బ్రహ్మసూత్రాలంటేనూ బొత్తిగా నచ్చవు. అందులకు కారణము వాటిలోగల గూఢార్థమే. లోకోపకారంగా వుంటుం దని ఎందరో వాటిమీద వ్యాఖ్యానాలు వ్రాశారు. వారు స్వకీయ అభీష్టానుసారం అర్థం సమర్థించుకోవటానికిగాను చేసిన ప్రయత్నాలమూలకంగా అర్థాలు సరళాలు కావడానికిబదులు మరింత గూఢాలయి అసలుకంటే మించిపోయినాయి. అందువలన వీటిని తెలుసుకోజేవాళ్లుకూడా అరుదైపోయినారు. ఇప్పుడు ఈ నంబెరుమాళ్లుగారు వ్రాసిన బ్రహ్మసూత్రముల లఘుటిప్పణిలో ఇంతవరకున్న టీకలలోని ధోరణిని మాని వాదవివాదాలకూ, తర్కవితర్కాలకూ, శంకాసమాధానాలకూ చోటివ్వక అందరికీ తెలిసేలాగు సులభశైలిలో అర్థాలనూ తాత్పర్యాలనూ వ్రాసుకొంటూ పోయినారు. ఉబుసుపోకకు పుస్తక మెత్తి చదువుకొనబోయినప్పటికీ రవంత పఠించిన మాత్రాన ఇంకా ముందుకు సాగి పోదామని పిస్తుందికాని రెండుమూడు వాక్యాలు చదువంగానే అర్థంగాక పుస్తకం అవతల పారేయాలనే బుద్ధి పుట్టదు. త్రిమత సంస్థాపకాచార్యుల అభిప్రాయాలను సరళంగా అవగాహన చేసుకోవచ్చు ఈ గ్రంథాన్ని చదివి.

దేశోద్ధారకులు భగవద్గీతావ్యాఖ్యానం వ్రాస్తూ ప్రతి అధ్యాయం ఆరంభంలోనే ఫలానిశ్లోకం మొదలుకొని ఫలానిశ్లోకంవరకూగల వస్తువు ఇదీ అని ఆయధ్యాయాంతం వరకూ గల విషయాన్ని టూకీగా చదువర్లకు బోధపరుస్తూ వచ్చినలాగే నంబెరుమాళ్లుగారు కూడా ప్రతి అధ్యాయం, ప్రతిపాదం మొదట్లోనే ఇన్నో సూత్రం మొదలుకొని ఇన్నో సూత్రం వరకుగల సంగతి ఇది యని పాదాంతంవరకూ గల సూత్రాల విషయం వివరించి తదనంతరమే సూత్రాల అర్థం తాత్పర్యసహితంగా, పెక్కుచోట్ల ప్రతిపదార్థంతో సూత్రాలనూ విశదీకరిస్తూ పోయినారు. ఇంతే కాదు. అక్కడక్కడ 'మగా' అనే పేరుతో తమ సొంత అభిప్రాయాలను సైతము ప్రకటిస్తూ పోయినారు. ఎట్లాగంటే శూద్రులకు బ్రహ్మవిద్యాధికారం ఉన్నదా లేదా యని తగవువచ్చిన అధికరణంలో సూత్రకారుని భావం ముందు తెలియపరచి తరువాత "ఉపనయనసంస్కారము శూద్రునికి చేయకూడదని శ్రుతులలో లేదు. స్మృతులలో "శూద్రశ్చతుర్థో వర్ణ ఏకజాతి ర్న చ సంస్కార మర్హతి" అని యున్నది. శ్రుత్యాధారము లేని స్మృతికి విలువలేదని విద్వజ్జనసమ్మతము; గాన స్మృతికారకులు, సూత్రకారులు శూద్రునకు ఉపనయన సంస్కారము నిషేధించి వారి సంకుచితహృదయమును వ్యక్తపరచిరి" అనియు, రైక్వమహారాజు విద్యకొరకు తనవద్దకు బరుగెత్తికొని వచ్చిన జానశ్రుతి యనువానిని "శూద్రా" యని సంబోధించి బ్రహ్మవిద్య నుపదేశించగా ఆ శూద్రశబ్దానికి విపరీతార్థము లాగిన సూత్రకారుని బుద్ధికుశలతను విమర్శించి చిట్టచివరకు "ఇట్టి సంకుచిత వాక్యములు స్మృతులలో గనుపడుచున్నవి. వానికి శ్రుతులలో నాధారము లేదు. సూత్రకారు లీ విషయమును విమర్శింపకుండుట శోచనీయము"— అనియు, గౌతముడు సత్యకామ జాబాలిని సంకరుడని ఎరిగియుండియు అతని సత్యసంధతకు మెచ్చి బ్రాహ్మణు డని స్థిరపరచినమీద విద్య నుపదేశించెనని సమర్థించిన సూత్రకారుని విమర్శిస్తూ "స్వేచ్ఛా విహారిణికి జన్మించిన సత్యకాముడు బ్రాహ్మణు డెట్లగునో తెలియదు. గౌతముడు జాతిని చూడక సత్యసంధతను జూచి, అనగా "గుణకర్మ"లనే ముఖ్యముగా నెంచెనని స్పష్ట మగుచుండ జాతినే ముఖ్యముగా

సెంచె ననుట యుక్తిహీనముగా నున్నది. శ్రుతుల కాలమున జాతి ముఖ్యము కాదనియు, "గుణకర్మ"లే ముఖ్యమనియు, సత్యకాముని కథనుబట్టి కనుపడుచుండగా సూత్రకారులు స్మృతికారుల ననుసరించి వారిసంకుచిత హృదయమును వెలిబుచ్చిరి కాని శ్రుతుల ఔదార్యమును వ్యక్తపరచరైరి" అనియు తమ స్వాంత అభిప్రాయమును వెలిబరచిరి. ఈకాలమందలి సంఘసంస్కర్తల కిట్టి నిశ్చితభిప్రాయములు మిక్కిలి యుపయుక్తములు. కాబట్టి ఈ గ్రంథము సనాతన, అధునాతనులకు గూడ పఠనీయము.

డెమ్మీ ఆక్టేవో సైజులో ౩౦౦ పేజీలకు పైగా ఉన్నప్పటికీ గ్రంథం వెల కేవలము రు ౦-౮-౦ లు మాత్రమే. పండితులకు ఇందులో సగము వెలకే దొరకును. 'సు.'

---

### బాలచంద్ర

పల్నాటివీర చరిత్ర : నాలుగంకముల నాటకము గ్రంథకర్త : శ్రీ కోటంరాజు సీతాపతి గారు హిందీ ప్రచారకులు : గుంటూరు. వెల: అర్ధరూపాయి.

పల్నాటివీర గాథ నొండు ఇతివృత్తము గావించుకొని గ్రంథకర్తగారీ నాటకమును రచించిరి. దీనిని చదువునపుడు రాజస్థానమున నొకప్పుడు వర్ధిల్లిన వీరవరులును, వీరాంగనలును తలపునకు వత్తురు.

మలిదేవుడు మాచర్ల మండలాధిపతి. బ్రహ్మనాయుడు ఆతనిమంత్రి. నలగామరాజు మలిదేవుని సవతితల్లికొడుకు. నాయకురాలీతనిమంత్రిణి. ఇరుపక్షములందు ప్రధాన కర్తవ్యములు నెఱపువారు బ్రహ్మనాయుడును నాయకురాలును. తన యేలికభాగమునకై నాయుడు శాంతియుత సమరము చేయగోరును. ఈతని ప్రబోధములు గాంధీప్రబోధములను బోలునవి. నిమ్నజాతులకు దేవాలయప్రవేశము చేకూరవలెనని సర్వజాతులందు సమత్వము నెలకొనవలెనని యీతని యాశయము. నాయకురాలీ సంస్కరణమునకు ఘోరవిరోధిని. నలగామరాజును రక్షించి యీమె మంత్రిణి కాజాలెను.

బ్రహ్మనాయుని జంపించుటకై మంత్రిణి కిరాతుల నంపినది. వారు పట్టుబడిరి. గడ్డివంటెవలమీద నుండి వారిని పోవునట్లు చేసియు, విషజలాశయములో ప్రోప్పించియు విషభక్ష్యముల పెట్ట యంకించియు, ప్రతిపక్షుల జంపింప నామె యత్నించినది. కాని ఆమె యత్నము లన్నియు విఫలము లయ్యెను. నాయుని “సంకరమతము” నెదుర్కొనినది.

అల్లుడు శత్రువుల యాశయములయెడల సానుభూతి జూపినాడని నలగామరాజు తరిమివేసినాడు. కూతురు పేరిందేవి నిజేసని ఆశయములనే ఉగ్గడించినది. బ్రహ్మనాయు డరణ్యమున వసించుచు నాటవికులను నాగరకుల జేయ నెంచినాడు. బాలచంద్రుడు, అలరాజు, మలిదేవుడు, అనపోతు, కన్నమదాసు, భీమనాయకుడు వనములో నాతనితో పెక్కు యిక్కట్టుల పాలబడిరి. “ఆపత్సముద్రమం దున్నవారికి మానవ మాత్రుడగు ప్రతివాడును తోడ్పడక మానడు” అని బ్రహ్మనాయుడు తనహృదయమును సదాశచే తేజరిల్ల జేసినాడు. చెంచులను, కోయలను చేరదీసి వారి కస్త్రవిద్యాదులు కఱపినాడు. దురాచారములు విడచి శైవదర్శనార్థమై వచ్చిన “మాలమాదిగల” ను దేవాలయమందు ప్రవేశపెట్టించుట వానియాశయము. కన్నమదాసీతని మాలపెంపుడుకొడుకు. మాచి వీని మాదిగ పెంపుడుకూతురు. మాచి మంచి విద్వాంసురాలు. ఆలయప్రవేశసమయమున గలహము వాటిల్లెను. మాచి తలకు పెద్దదెబ్బ తగిలెను. దౌర్జన్యమువలన నాలయప్రవేశము గావింతునని నాయునికొడుకు బాలచంద్రుడు పట్టుపట్టినాడు. అట్టివిధానమును గర్హించు తండ్రిమాటను పాటింపక తనపట్టును నెగ్గించుకొనినాడు. కొంత రాజ్య మిమ్మని సంధికొఱకై మామకడకు అలరాజు వచ్చినాడు. వానిప్రయత్నము విఫలమైనది. మంత్రిణి ప్రేరణవలన విషాక్తమైన పూలగుత్తి సన్మానపూర్వకముగ వాని కీయబడినది. దానిని వాసన జూచుటచే నాతడు మరణించినాడు. వానిప్రాణములు దీసినవానిని చంపుటకై బాలచంద్రుడు ప్రతిజ్ఞజేసినాడు. తండ్రిమాటలను లెక్కచేయక తుద కీతడు తనప్రతిజ్ఞను పాలించుకొనినాడు—నరసింహరాజును చంపినాడు. పిదప

సోదరులతో గలసి, కొమ్మరాజు చితిలో దుమికినాడు. బాలచంద్రుని అర్ధాంగి మాంచాలయూష చితిలో ప్రవేశించినది. అంతకుమున్నె పెనిమిటిశవముతో పేరిందేవి సహగమనము గావించినది. ఈ రెండుదాంపత్యములను గ్రంథకర్తగారు చక్కగ చిత్రించిరి. బాలచంద్రుని బ్రాహ్మణస్నేహితుడైన అనపోతు, మాంచాల ఎంత వారించినను వినక, యుద్ధాభిముఖుడై, విరుద్ధశాసనమును విలోకించి తనమస్తకమును త్రెంచుకొనినాడు. ఈకర్జము బాలచంద్రుని మఱింత యుద్రేకించినది. బ్రహ్మనాయుడుతనయుని దౌర్జన్యమును గర్హించినాడు. అన్నివేళలందు శాంతిమంత్రమునే పురశ్చరణము గావించినాడు. ఈతని మాహాత్మ్యముకతన నాయకురాలి హృదయమందును, నలగామరాజు హృదయమందును చక్కని పరివర్తనము తలయెత్తెను. తుదకు బ్రహ్మనాయునియుదారాశయములే విజయడిండిమమును మ్రోగించినవి. గ్రంథము గంభీరభావబంధురమై యున్నది. గ్రంథము బాలచంద్రునిపేరుతో గాక బ్రహ్మనాయుని పూర్తినామముతో నొప్పవలసినది.

ఇందు విశేషముగ గద్యమే వాడబడుట ముదావహము. హృదయమును నలరించువాక్యము లిందు గలవు. చూడుడు: (౧) "నీవు నన్నుజూచి దురపిల్లెడి చంద్రిచాతకివని సూర్యకిరణాకాంక్షి యగు కమలినివని తెలిసికొనజాలకుంటివి"

చాతకి యనుటకంటె చకోర మనవలసినది. చాతకము వానకోయిలగదా!

(౨) నీవు నామనోమీనమునకు జలాశయమవు."

(౩) "నీసన్నిధానమున నే నమరసౌఖ్యము జూరగొనుచున్నాను."

(౪) నీమహోన్నత సౌందర్యమరీచికచే ముగ్ధుడనై పరవశుడ నగుచున్నాను" మన్నవి.

గ్రంథము ఆంధ్రమహాజనుల ఆదరము నంద గలదు.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

# ప్రఖ్యాతిపురుషులు

అనేకమంది ప్రఖ్యాతిపురుషులు తాము జీవించి యున్నంతకాలము తగిన గౌరవ మర్యాదలను పొందుట లేదనే విషయము జగద్విదితమే. చరిత్రయందు కూడ దీని విషయమై అనేక దృష్టాంతరములు కలవు.

జన్నర్, కాక్, పాస్టర్ మున్నగువారు తాము కనిపెట్టిన విషయముల ప్రాముఖ్యతను ప్రపంచమును గ్రహింపక మునుపు తమ సమకాలికులతో పోరాటము సలిపిరి. వీరింత పని చేసియుండకపోయినచో మానవులు అనేక బాధలకులోను కావలసియుండెడిది.

క్యూరీ కుటుంబము ఇందులకు మరొక తార్కాణము, తమ గొప్పతనమును ప్రజలకు చాటుటకై వీరిద్దరు ప్రపంచమునందు అనేకమంది అధికారులతో పోరాటము సలిపియుండిరి. పిర్రీ క్యూరీగారి విషయము మాత్రము అట్లుకాదు. తమ పరిశోధనాఫలితమును తాము జీవించియుండగానే అనుభవింప గలిగిన శాస్త్రజ్ఞులు ధన్యులు, సుఖజీవులు.

మానవకోటికి సర్ రోనాల్డ్ రాస్, సర్ పాట్రిక్ మాన్సన్ గార్లు నిరుపమాన సేవ యొనర్చియుండిరి. మలేరియా దోమవలన మలేరియా జాడ్యము వ్యాపించు నని వారు తెలియపరచిరి. మరియు ఉష్ణప్రదేశములలో లక్షలకొలది ప్రజలు ప్రతిసంవత్సరము మలేరియా జబ్బు వలన బాధపడుచున్నారని కూడ వారు ఋజువుపరచి యున్నారు. ఫ్రెంచి శాస్త్రపరిశోధకులగు లావిరాన్ గారు మలేరియా జాడ్యమును గూర్చి కనిపెట్టిరి.

మలేరియా ప్రబలముగానుండు ఋతువునందు మలేరియా తగులకుండుటకు దినమునకు 6 గ్రెయినులు క్వైనైను సేవింపవలసియున్నదనియు, మలేరియా ప్రబలముగా నున్న దినములలో 5 నుండి 7 దినములవరకు దినమునకు 15 మొదలు 20 గ్రెయినులు క్వైనైను సేవించుట యుక్తమనియు జాతిసమితి మలేరియా కమిషన్ వారు సలహా నొసగిరి. క్వైనైను సేవించుట నిరపాయకరమైనదనియు, దీనిని సేవించు విషయమై అంతగా వైద్యుల సలహాకూడ అవసరము లేదనియు, 1938 సం॥ లో జారీ చేయబడిన నివేదికయందు 124-వ పేజీలో మలేరియా కమిషనువారు సూచించియుండిరి.

M. Eng. No. 126

## లలిత

గ్రంథకర్త: శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి గారు. ప్రకాశకులు: సావిత్రీ గ్రంథమండలి. పూర్ణానందంపేట, బెజవాడ. వెల రు 1-౦-౦.

గ్రంథము సనాతన ధర్మరక్షణమునకు సంబంధించినది. పరార్థజీవితము మానవుని పరమావధి యని గ్రంథకర్తగారి యభిప్రాయము. రాజకీయరంగములందు దలయెత్తుచుండు మతసంస్కారమునకు వీరు విముఖులు. ఈ యభిప్రాయము నామోదించువారు కొందఱు రాజకీయప్రముఖులందు గలరు. మతమునకును రాజకీయములకును ముడిపెట్టరాదని వీరి యుద్దేశము. సర్వమతములకును, సమస్తజీవితమునకును సంబంధించిన ఉత్కృష్టాశయములు కలవు. వీనినుండి రాజకీయములను వేఱుచేసిన యెడల నవి పంకిలమయము లగును. ఒక్కొక్కమతమునకు సంబంధించిన ఆచారములు కొన్ని కలవు. ఇవి యత్యాచారములు కానంతవరకు పాలకులజోక్యమునకు తలలొగ్గరాదు. ఈయంశమును రాజకీయవేత్త లందఱు నెఱుంగుదురు. ముసల్మాను క్రైస్తవ మతాచారములను స్పృశించుటకే శాసనమునకు నేఁటిలో సాహసము కలుగలేదు. హృదయసంస్కరణమునకు సంబంధించిన విషయములు శాసనమువలన నిర్వర్తిలఁజేరవు. కాని శాసన మనిన నంతగా నులికిపడనక్కఱలే దనిన సంపూర్ణవిషయపరిశీలనమైనంతన నవి దలమాపవచ్చు నని యూహింపవలెను. కాని న్యాయసమ్మతమో న్యాయసమ్మతము కాదో యని విమర్శింపక యెదుటి యభిప్రాయమును మట్టుపెట్టదలచుట న్యాయము కాదు. గ్రంథకర్తగారు తమయభిప్రాయములను స్పష్టముగా, భీతునకుగాని మోమాటమునకుగాని తావొసగక, తెలిపిరి. పాశ్చాత్యనాగరకతవలన చేటు వాటిల్లినదని చెప్పిరి. సంఘపరిస్థితులను గమనించి వీరియభిప్రాయము సత్యదూరము కాదని గ్రహించువారనేకు లుందురు.

మతమును గుఱించిన వీరియుద్దేశము లెల్లరకును సమ్మతములు కాకపోయినను వీరిసాహిత్యాశయము లెల్లరయామోదమును నందజాలు ననుట నిస్సంశయము.

గ్రంథము గంభీరభావబంధురమై యున్నది. చూడుడు:

"సీ. మాఱిన మాఱనీ మతములు యోగములు
వేదముల్ మాఱునే విలయమైన
... ... ...
ధర్మబీజంబులు దగ్ధమగునె?
... ...
శమదమసంపత్తి సమయగలదె?
... ...
పరమపాతివ్రత్యపథము చెడునె" (పుట. ౨౧)

"కలకల వేదవాదములు మ్రోయుచుండగ...
... ... ...
మహోజ్జ్వలత్సతీ
తిలకము లుండ నీధరణి దేశము
ధర్మము వీడియుండునే?" (పుట. ౬౭)

"ఈభరతోర్వీస్థలి ధర్మవార్ధిముల
బుద్ధ్వా శక్యమే—యేరికిన్" (పుట. ౭౧)

గ్రంథమందలి శైలి సౌందర్యసందీప్తమై, కడుంగడు హృద్యమై యున్నది. చూడుడు:

"సరసిజవిభాసురంబగు సరసివోలె
యౌవనోజ్జ్వలయై యింతి యలరు నపుర"
(పుట. ౯౦)

"కన్నుల కమ్రశాంతరేఖయయి
నోముఫలంబగు ముద్దుపట్టి" (పుట. ౪౭)

"సుందరవసనంబు గాత్రజలదంబున
నొప్పమెఱుంగుగాక" (పుట. ౯౬)

"మలయజగంధముల్ వకుళమాలల
తావులు విస్తరిల్ల" (పుట. ౯౭)

"నిమతు లెడలింప ధర్మంబు వెడలగలదె?
కొల్చునే మందుకొంసను గాఱుదిచ్చు"
(పుట. ౩౪)

"శిశిర మారుతముల రాల్చిన జొన్నమితి
యలరు బొంపంబులును శైల్ల సలముకొనవె?"
"ప్రేమరాజ్యమునకు పతాక —
ఆనందరాజ్యమునకు సింహాసనము."





401

గ్రంథము సహృదయుల ఆదరానురాగముల నందగలదు.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

---

## ఘోషయాత్ర

కర్త: మల్యాల జయరామయ్యగారు, రాజమహేంద్రవరము, వెల ఒకరూపాయి.

ఈనాటకములోని వస్తువు (plot) భారతారణ్యపర్వమునుండి గ్రహింపబడినది. అరణ్యవాసక్లేశమనుభవించుచున్న పాండుసుతులను ఆత్మవైభవప్రకటనముచే భంగపరుపబోయి దుర్యోధనుడు భార్యామిత్రాదులతోగూడ గంధర్వులచే భంగపడుట ఇందలి కథాంశము.

కవి మామూలు తప్పకుండ నారదపాత్రతో నాటకమును ప్రారంభించినాడు. నారదుడు మొదట ద్వైతవనమందున్న పాండవులను సందర్శించి వారిసందేశమును దుర్యోధనాదులవద్దకు గొనిపోయినాడు. ఈ ఘట్టమును కవి కృష్ణరాయబారమును మనస్సులో నుంచుకొని రచించినట్లు బాగుగా తెలియుచున్నది. ధర్మరాజసముఖమున కృష్ణునికి బదు లీనాటకములో నారదుడు భీమాదులను ప్రేరేపించి ప్రల్లదము లాడించినాడు. మరల కౌరవసభలో భీష్మాదులు పాండవులను స్తుతించుట, కర్ణకలహము, దుర్యోధనాదులు సభనుండి లేచిపోయి పన్నాగము పన్నుట, అంతమున దుర్యోధన పరాభవము—రాయబారము ననుసరించి యున్నవి. ఇందు ద్రౌపది చెప్పిన 'పుట్టితి రాజవంశమున భూరిబలాఢ్యు లనంబను వీరి నేపురం బట్టితి...' అనుపద్యము రాయబారసందర్భములో ద్రౌపది కృష్ణునితోఁ జెప్పిన 'జనమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి...' (ఉద్యోగ ప.) అనుపద్యమును బోలియున్నది. పద్యముల రచించుటలో కవి శ్రీతిరుపతివేంకటకవుల ననుసరించినాడు. వారి పాండవోద్యోగమువలె స్వీయనాటకమును రచించుట కవియుద్దేశ్యముకాబోలు. మహాకవు లనుసరణీయులు కదా!

నాటకములోని సంభాషణలు గ్రాంథికభాషలో నున్నను వ్యావహారికప్రాయిష్యముగా నున్నవి. 'ఆహా ఏమి వేందాంతమండీ'వంటి వాక్యములు వ్యావహారికములో మార్పును జెందజాలవు. కవియైనను పూర్వపద్ధతులను 'తు చ' తప్పకుండ ననుసరించువాడు కాడు. "అచ్చటచ్చట నఖండయతి వాడుటయు వర్గయతియందు స్వతంత్రించుటయు తటస్థించినది. రసపోషణార్థమై కొన్నిపద్యములయందు నూతనమార్గ మవలంబించితి"నని తానే పీఠికలో వ్రాసినాడు. 'రోజులు'వంటి అన్యదేశ్యపదములను వాడుటకు కవి వెనుదీయలేదు. లోకవ్యవహారమునం దుండు సామెతలు సందర్భోచితముగా వాడబడినవి. ఇందులో కొన్ని 'గాలిలో మేడలు కట్టుట' (Buiiding castles in the air), 'రాజవీధినిభరాజ మేగుచుమండ కుక్క మొఱిగిన నేమి లెక్కసేయు' (Dogs bark as the caravan goes) వంటి సామెత లాంగ్లవాఙ్మయమునుండియు గ్రహింపబడినవి.

నాటక ప్రథమభాగములో పద్యము లెక్కువగా నున్నవి. నటకులు అడుగడుగునకు పద్యములు చదువుచుండినచో రసవంతముగా నుండదు. అసాధారణ భావప్రదర్శనమందే పద్యములను వాడి తక్కినచోట్ల వచనము నుపయోగించిన మంచిది. ఈ కవికి చక్కని ధారాశుద్ధి యలవడినది. పద్యములలో తొట్రుపాటు లేదు. సుబోధవేద్యమైన శైలి. మచ్చున కొకపద్యము చూడుడు:

మ. అటు పార్థుండను గానుజాముష్క రిపుసం
  హారంబు గావింప నే
 నిటు సన్యాసినిగాను తమ్ములను ని
  న్నిల్లాలి బాయంగ, బా
 సట గోవిందుడు గల్గి నాకు భయత్రా
  తృత్వంబు వాటిల్లె నా
 న్నటికో యీనెప మంతరించుట హా కి!
  నాప్రాణితో బోవునా ?

నాటక మన్నివిధముల నాధునికరంగోచితముగ రచింపబడినది. అంకములుగాని రంగములుగాని విసుగు గల్పించునంత దీర్ఘములుగా లేవు. ఈ నాటకమున ఏభాగము లోపించకుండ మూడుగంటలలో ప్రదర్శింపవచ్చును. ఆంధ్రనాటకరంగము త్వరలో నీనాటకమును తన కలంకారముగా జేసుకొనునని నమ్ముచున్నాము.

వెం. శ్రీ.

---

# పిల్లవాండ్లు చెప్పునది గమనింపుడు

NO COUPONS

NO PRESENTS

NO NOVELTY

NO GIFTS

**But Quality**

*Ask and insist on Being Given*

# L. G

**THE QUALITY ASAFOETIDA**
**FULL VALUE FOR YOUR MONEY**

కూపన్సు అవసరంలేదు. బహుమతులు అవసరంలేదు. నూటికి నూరు కల్తిలేని పరిమళమైన పట్నం ఇంగువ కావలయుననిన **ఎల్. జి.** గుర్తును అడుగండి. **ఎల్. జి.** గుర్తును గమనింపుడు. **ఎల్. జి.** గుర్తుగల ప్యాకెటునే కొనుడు.

**ప్రజలకు హెచ్చరిక**

మీరు ఇంగువను కొనునప్పుడు మాయొక్క లాల్‌జీ గోధు అండ్ కంపెనీ విలాసమును ఎల్. జి. మార్కును గమనించి కొనవలెను. కృత్రిమ మార్కులు ఎన్నెన్నో బయలుదేరినవి. గనుక మోసపోక ఎల్. జి. మార్కును గమనించి కొనవలెను.

## ప్రతిమ

క ర్త. భారతుల మార్కండేయశర్మగారు. ఒంగోలు; వెల ఒకరూపాయి.

భాసకవికృతనాటకమున కిది యనువాదము. భాసకవి కాళిదాసునకు బూర్వుడు. ఇతడు తననాటకము లన్నిటిని పురాణములలోని రసవంతమైన ఘట్టములనుండి సృష్టించినాడు. మూలకథ పురాణములోనిదైనను పాత్రలు పురాణములలోని మట్టిబొమ్మలవలె నుండక ఈతనినాటకములలో సజీవము లైనవి. అవసరమైన చోటు లన్నిటిలో మార్పు లొనరించి పురాణములోని యసంగతముల దొలగించి పాత్రల స్వభావోన్మీలనములో స్వతంత్రశక్తి గనబరచినాడు. మధ్యమవ్యాయోగాది ఏకాంకనాటకము లితని కవితాప్రాగల్భ్యమును జాటుచున్నవి.

ప్రతిమానాటకము రామాయణకథనుండి రచింపబడినది. ఇందలి ముఖ్యాంశము భరతుడు దశరథమరణవృత్తాంతమును దశరథప్రతిమచే గ్రహించుట. నాటకములో రామపట్టాభిషేకప్రయత్నము మొదలుకొని యుద్ధాంతమున రాముడు సింహాసనస్థు డగునంతవరకు గల కథ యున్నది. పాదుకాపట్టాభిషేకమువరకు విపులముగను తరువాత కథ దిఙ్మాత్రముగను నున్నది.

ఒకభాషలో నేర్పడిన మహాకావ్య మున్నప్పుడు ఆభాష తెలియనివారుకూడ నాకావ్యరసము నాస్వాదింప గలుగునట్లు చేయుట భాషాంతరీకరణములోని ఉద్దేశ్యము. కాబట్టి అనువాదకులు మూలకావ్యములోని పటుత్వము తమ కృతులలో ప్రతిబింబించునట్లు ప్రయత్నించవలెను. మక్కికి మక్కి అనువదించి నిర్జీవకావ్యములను సృష్టించుటకంటె, అనువాదములో కొంతవరకు స్వతంత్రించి మూల కావ్యములోని భావౌన్నత్యమును చక్కగా ప్రదర్శించుట చేయుటెట్లు మంచిని. మార్కండేయ శర్మ గా రిట్లు చేసి న ట్లు క న బ డ దు. వీరి యనువాదము సంస్కృతనాటకమునకు దండాన్వయమువలె నున్నది. కావ్యములోని బిగువు సడలినది. దానికితోడు పద్యములు సరళముగా నడువలేదు. పద్యవచనముల కంతగా భేదము కనుపడుటలేదు. భాష వీరగ్రాంథికము. ఇట్టి యనువాదములవలన సంస్కృతకావ్యములం దాదరము సన్నగిలిపోగలదు. శర్మగారు మున్ముందు చక్కని కావ్యములను రచింప కోరుచున్నాను.

వెంపటి శ్రీనివాసమూర్తి

---

### ౧. ఆర్యసామాజికధర్మము

పదినియమములు

మూలలేఖకులు: శ్రీసత్యానందస్వామిగారు.
అనువాదకుడు: పండితగోపదేవదార్శనిక్ గారు.
ప్రచురణకర్త: పండిత మదనమోహనవిద్యాసర్ గారు. వెల, రు ౦-౨-౦.

### ౨. ఈశ్వరుడు—ఉపాసనా

మూలసంపాదకుడు: గంగాప్రసాద్ ఉపాధ్యాయగారు; ఎం, ఎ. అనువాదకుడు: పండిత గోపదేవదార్శనిక్ గారు.

ప్రకాశకులు: ఆర్యసత్యాగ్రహసమితి-బెజవాడ.

### ౩. ఇంటివేల్పు (గృహదేవి)

మూలసంపాదకుడు: గంగాప్రసాద్ ఉపాధ్యాయగారు ఎం.ఎ. అనువాదకుడు: పండిత గోపదేవదార్శనిక్ గారు.

ప్రకాశకులు: ఆర్యసత్యాగ్రహసమితి, బెజవాడ.

ఈ చిన్నపుస్తకాలు మూడూ బెజవాడ శ్రీ కన్యకా ముద్రాక్షరశాలయందు ముద్రితము లైనవి. ఇవి ఆర్యసమాజమనే వక హిందూ అంతఃశాఖామతానికి చెందిన గ్రంథములు. ఇందలి మొదటి పుస్తకంలోని పదినియమాలూ ఆర్యసమాజంవారి ప్రతిగ్రంథంమీద ముద్రితాలయివుంటాయి. సామాజికుల కందరికి తమమత మంటే ఏమో తెలుసుకోడానికిగాను, శ్రీ స్వామి దయానంద సరస్వతిగారే రచించి ప్రతి గ్రంథంమీదా అచ్చువేయించులాగు ఏర్పాటుచేసి యుంచారు. సూత్రప్రాయాలుగావున్న ఈ నియమాలలోనుంచి ఒక్కొక్కదాన్నే దీసుకొని సామాన్య జనుల కందరికీ తెలిసేలాగు దానికి విస్తారరూపంలో హిందీ వ్యాఖ్యానం వ్రాసి శ్రీ సత్యానందస్వామిగారు వకచిన్నపుస్తకంగా ప్రకటిం

చారు. దాని కిది ఆంధ్రానువాదం. ఆర్యసమాజ మంటే ఏమిటో ఈ పుస్తకం చదివినవారికి తేటతెల్ల మవుతుంది. అసలు ఈ నియమాలన్నీ హిందూధర్మ గ్రంథాలనుంచి గ్రహించినవే గాని మరెక్కడనుండో సృష్టించినవి కావు.

తక్కిన పుస్తకాలు రెండూ 'సత్యార్థ ప్రకాశ' మనే ఒక పెద్దగ్రంథంలోనుంచి ఉద్ధృతాలైన భాగాలు. సత్యార్థప్రకాశమనేది దయానంద సరస్వతి రచితమైన ఒక పెద్దగ్రంథం. అందులో పూర్వార్థం, ఉత్తరార్థమని రెండు విభాగాలు. పూర్వార్థంలో పదిసముల్లాసాలూ, ఉత్తరార్థంలో నాలుగూ. పూర్వార్థంలో ఆర్యులు పాలింపవలసిన విధులూ, విధానాలూ, ఆచారాలూ మున్నగు వానిగురించి ఆర్షగ్రంథ ప్రమాణ సమేతంగా వ్రాయబడివుంది. ఉత్తరార్థంలో పురాణ, జైన, కురానీ, కిరానీ, క్రైస్తవ మతాలఖండనలు ఉన్నాయి. అది చాలా పెద్దగ్రంథమవడంచేత అందరికీ అందుబాటులో వుండదు. పైగా అందులోని విషయం యావత్తూ ఒక్కపాఠంగా అవగాహనం చేసుకోవటం కూడా కష్టం. కాబట్టి క్రమక్రమంగా ఒక్కొక్క సముల్లాసంలోగల విషయాన్ని సులభంగా జనులకు బోధపరచడానికి గాను ఈ పద్ధతిని అవలంబించారు. మూడవ సముల్లాసపు భాగంలో స్త్రీవిద్యనూ, దాని ఆవశ్యకతను గురించీ, ఏడవసముల్లాసపు భాగంలో జీవేశ్వరుల గుణకర్మ స్వభావాలను గురించీ, ఉపాసనా విధానాన్ని గురించీ వ్రాయబడివుంది. చివరి రెండు పుస్తకాలూ పోస్టేజీ పంపేవారికి ఉచితం. సత్యాగ్రహసమితి, హనుమాన్లపేట, బెజవాడ; లేక మదనమోహన విద్యాధర్, ప్రేమ మందిర్, బెజవాడ అని వ్రాసిన పుస్తకములు దొరకును.

'సం.'

## గ్రంథ స్వీకారము

---

**ఎలక్ట్రిసిటీ**— విద్యుత్ప్రక్రియలు: గ్రంథకర్త: గాడేపల్లి సూర్యనారాయణశర్మగారు - వైజ్ఞానిక గ్రంథమండలి ౨-వ పుష్పము. పబ్లిషర్స్: వేంకట్రామ అండుకో; ఏలూరు, రాజమండ్రి. వెల రూపాయ.

**త్రిదోషములు**— గ్రంథకర్త: బ్రహ్మశ్రీ భాగవతుల రామమూర్తి శాస్త్రులుగారు, ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ. వెల ఆరణాలు.

**సూర్యకిరణచికిత్స**— గ్రంథకర్త: పండిత జ్వాలాప్రసాద్‌ఝూ; అనువాదకులు: డా. పుచ్చా వెంకట్రామయ్యగారు, ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ. వెల ఆరణాలు.

**ఫిడేలు రాగాలదర్జా**— గ్రంథకర్త: పఠాభిగారు. వలయువారు, పఠాభిరామరెడ్డిగారికి, సుదర్శన మహల్, నెల్లూరికి వ్రాయవలెను. వెల దర్జా అర్థణాలు.

**నాడు-నేడు**—విశ్వసాహిత్య మాలలోని ౧౪-వ పుస్తకము. గ్రంథకర్త: ఎ. అడయంకో. అనువాదకులు:— రామమోహన్‌గారు. ప్రకాశకులు : విశ్వసాహిత్యమాల, ముంగండ, అంబాజీపేటపోస్టు. తూర్పు గోదావరి జిల్లా. వెల, రు ౧-౪-౦ లు.

**విప్లవసందేశం**— గ్రంథకర్త: క్రొపాట్కిన్. అనువాదకులు: మహీధర జగన్మోహన్‌రావుగారు. ప్రకాశకులు: విశ్వసాహిత్యమాల, ముంగండ, అంబాజీపేటపోస్టు. వెల, రెండణాలు.

**కమ్యూనిస్టులతో**— గ్రంథకర్త: కారల్‌మార్క్స్. అనువాదకులు: రామమోహన్‌గారు. ప్రకాశకులు: విశ్వసాహిత్యమాల, ముంగండ, అంబాజీపేటపోస్టు, వెల, అణాన్నర.

**రాజ్యాంగయంత్రం**— గ్రంథకర్త: వి. ఐ. లెనిన్. అనువాదకులు: మహీధరజగన్మోహనరావుగారు. ప్రకాశకులు: విశ్వసాహిత్యమాల, ముంగండ, అంబాజీపేటపోస్టు. వెల, రెండణాలు.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.